శ్రీః

# విజ్ఞానదీపికా

వివృతివ్యాఖ్యానసహితా

సంస్కృతమూలం : **శ్రీపద్మపాదాచార్యః**

తెలుగు సేత : **తులసీపుత్ర దుర్గానంద (చింతగుంట సుబ్బారావు)**



ప్రకాశకులు

**శ్రీ సదాశివబ్రహ్మేంద్రాశ్రమము**

చిల్లకల్లు - 521 178, జగ్గయ్యపేట మండలం, కృష్ణాజిల్లా.

**2009**



వెల : అమూల్యం

శ్రీః

# విజ్ఞానదీపికా

వివృతివ్యాఖ్యానసహితా

సంస్కృతమూలం : శ్రీపద్మపాదాచార్యః

తెలుగు సేత : తులసీపుత్ర దుర్గానంద (చింతగుంట సుబ్బారావు)



ప్రకాశకులు

శ్రీ సదాశివబ్రహ్మేంద్రాశ్రమము

చిల్లకల్లు - 521 178, జగ్గయ్యపేట మండలం, కృష్ణాజిల్లా.

2009

శ్రీః

# విజ్ఞానదీపికా

వివృతివ్యాఖ్యానసహితా

సంస్కృతమూలం: **శ్రీపద్మపాదాచార్యః**

తెలుగు సేత : **తులసీపుత్ర దుర్గానంద (చింతగుంట సుబ్బారావు)**
ఫోన్ : 9652726061

ప్రథమముద్రణ :- 15-06-2009
ప్రతులు : 500
పేజీలు : 128
వెల రూ. : రూ.50-00



***D.T.P. by :-***
**J. RAJA**
18, Banam Complex,
Munthavari Centre, Chirala.
Cell : 98483 90564

***Printed at :-***
**SOWMYA OFFSET,**
CHIRALA.

# ముందుమాట

శ్లో॥ న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః॥ (భగవద్గీత అ.3, శ్లో.5)

గీతాచార్యుడిట్లనుచున్నాడు - ఎవడు గాని ఎపుడు గాని కర్మచేయనివాడై ఒక్క క్షణమైనను మనలేడు. ఎల్లరును ప్రకృతిసిద్ధమైన గుణములచేత వివశత్వమున కర్మ యందు ప్రవర్తింపజేయబడుచున్నారు.

ఈ శ్లోకార్థము విస్తృతరూపమున మానవులతో బాటు పశుపక్ష్యాదులను అప్రాణులను సైతము తాకుచున్నది. ప్రకృతిగుణములు స్థావరజంగమములందు సమానముగ వ్యాప్తమైయున్నవి. ప్రకృతిలో కర్మకు మూడుస్థితులు అనుభవగోచరము లగుచున్నవి, 1) క్రియారూపమున ప్రాణులలో (చరములలో) ప్రకటమగునది, 2)స్థితిరూపమున చరాచరములందంతట ప్రకటమగునది, 3) మమత్వాసక్తిరూపమున ప్రేరకమై మానవులలో నత్యధికముగను, పశుపక్షులలో అల్పముగను ప్రకటమగునది. ఈ మూడు స్థితులలోను కర్మ ప్రాకృతికనియమమైయున్నది. ఈ స్థితినుండి తప్పించి-కొనుటకు చరాచరములలో దేనికిగాని ఎవరికిగాని స్వేచ్ఛలేదు. మానవునకు మాత్రము కర్మముక్తుడగుట స్థూలభౌతికజీవితమున కాదు గాని, మనోమయ జీవితమును నియమించుటవలన, వైఖరిని సంస్కరించికొనుటవలన, ఆత్మజ్ఞానము-వలన సాధ్యమని శాస్త్రోక్తి, దానికి సజీవప్రమాణముగ మహాత్ములున్నారు.

మానవజీవితము నేపథ్యముగ, కేంద్రముగ, కర్మను విశేషముగ విశ్లేషించి, అది అనివార్యమైనను, మానవుడు దానికి శృంఖలాబద్ధుడు కాకుండ మనుటెట్లని విచారించి సప్రమాణముగ తమ పరిశ్రమఫలమును మహాత్ములు లోకమున కందించియున్నారు. అట్టిదొక పుస్తకము ఈ విజ్ఞానదీపిక. దీనికి సంస్కృతమూలము శ్రీమచ్ఛంకరభగవత్పాదుల ప్రియశిష్యుడైన పద్మపాదాచార్యులవారు రచించినది. ఆ మూలగ్రంథమును తెలుగులిపిలోనికి మార్చి, తెలుగులో వివరణమును కూర్చి, రెండిటిని కలిపి ప్రచురించిన దీ గ్రంథము. సంస్కృతమూలము సంస్కృతపద్య-

రూపముగలది. దానికి ఆచార్యులవారు స్వయముగ వివృతి యను పేరున వ్యాఖ్యను గూడ ప్రసాదించిరి. ఇది నా తెలుగుసేతకు అందివచ్చిన మ్రానిఫలము. దానిని నేనాస్వాదించి, తెలుగువారితో పంచికొనుట బాగనితోచి, ఈ ప్రయత్నము చేసితిని.

నా ప్రయత్నము తొలుత అర్థవంతమగుట ఇచటి వాడరేవు గ్రామస్థమైయున్న శ్రీ లలితానందాశ్రమమువారు శ్రీ అరుళానందస్వామి ఆధ్వర్యమున ప్రచురించుచున్న ఆత్మజ్యోతి యను మాసపత్రికలో ధారావాహికగా ప్రచురితమగుచుండుట. అంతట ఈ గ్రంథప్రతినొకదానిని తాము ఇరువదేండ్ల క్రిందటే వ్రాసికొనియుంచి, అద్దానిని నాకు జేర్చినవారు శ్రీ నడిపినేని సూర్యనారాయణగారును, శ్రీ రావి మోహనరావు గారును నాకు వెన్నుదన్ను. నా రచన పూర్తియైనంతనే దానిని పుస్తక రూపమున ప్రకటించుటకు సంకల్పించిన శ్రీమతి నడిపినేని కోటేశ్వరమ్మ, శ్రీ సూర్యనారాయణ దంపతుల ఔదార్యము మిక్కిలి అభినందనీయము. ఈ తెలుగు పుస్తకమే కాక, సంస్కృతగ్రంథమును దేవనాగరిలిపిలో గూడా వెలువరించనెంచిన శ్రీ నడిపినేని వారికి ఆంధ్రపాఠకలోకము చాల ఋణపడియున్నది. వారికి ధన్యవాదములు. అట్లే దీనికి తొలి వెలుగును ప్రసాదించిన శ్రీ అరుళానంద పబ్లికేషన్స్ వారికి సాదర ప్రణామములు. మిత్రుడు శ్రీ రామోరాకు హృద్యపరిష్వంగము.

ఈ గ్రంథమున, కర్మ సమూలముగా నశించి స్వరూపదర్శనము, మోక్షము లేక జన్మరాహిత్యము కలుగుటెట్లు? అను విషయము సవిస్తరముగా చర్చించబడినది. ఇది విరాగులకంటె నాబోటి సరాగులకు మరింత మార్గదర్శకము కాగలదను ఆశతో, **సామాన్య సంసారులకు ఇంత మహోపకారము చేయబూనిన గురుపరంపరకు భక్తితో అంకితమిడుచున్నాను. శ్రేయోఽస్తు!**

చీరాల,
15-06-2009

– చింతగుంట సుబ్బారావు

5

శ్రీః

# విజ్ఞానదీపికా

## వివృతివ్యాఖ్యానసహితా

### ప్రార్థనా

శ్లో॥ వన్దే సామ్బం సదానన్దమ్
అనన్దావరణాపహమ్।
తత్త్వావలమ్బనార్థాయ
మహాదేవం ధృతాకృతిమ్॥

శ్రీభగవత్కృపోపస్థితవేదాన్తవిదాచార్యశిరోమణి శ్రీభగవదవతారభగవచ్ఛఙ్కరా-చార్యచరణానుగ్రహవిజ్ఞాతపరాపరాత్మతత్త్వః శ్రీపద్మపాదాచార్యః తత్త్వానుసన్ధాన-లక్షణమఙ్గలం శిష్యోపశిష్యశిక్షాయై కర్తవ్యసత్ప్రకరణోపక్రమే నిబధ్నాతి-

ప్రతిపదార్థం:- తత్త్వ+అవలమ్బన+అర్థాయ=తత్త్వమును నిల్పుటయను ప్రయోజనముకొరకు, ధృత+ఆకృతిమ్=ధరింపబడిన ఆకారముగల, స+అమ్బమ్=అంబతో కూడియున్న, సదా+నన్దమ్, లేక, సదా+ఆనన్దమ్=ఎల్లవేళల ఆనందముగలవాడైన, (పక్షాంతరమున) సత్+ఆనన్దమ్= సత్యమగు(సత్యమను) ఆనందముగలవాడగు, అనన్ద+అవరణ+అపహమ్=ఆనందమునకైన అవరోధమును హరించు నట్టి, మహాదేవం=మహాదేవుని(శివుని), వన్దే=(నేను) నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము:-** తత్త్వమును నిల్పు ప్రయోజనము నాశించి ఆకారమును ధరించిన, అనగా అవతరించినట్టి, పార్వతీసమేతుడైన సదానందుడగు శివుడు ఆనందమునకు కలిగిన అవరోధమును హరించువాడు. వానికి నమస్కరించుచున్నాను.

**వివరణము:-** వివృతివ్యాఖ్యతోగూడిన ఈ విజ్ఞానదీపికాగ్రంథమును శ్రీశంకరాచార్య ప్రియశిష్యుడగు శ్రీపద్మపాదాచార్యుడు ప్రారంభించుచు తత్త్వవిచారలక్షణమైన మంగళాచరణము జేయుచున్నాడు. ఈ గ్రంథకర్త సాక్షాత్ శివభగవానుని మానుషావతారమైన శ్రీశంకరభగవత్పాదుల శిష్యుడు. తద్గురు కటాక్షమున పరాపరాత్మతత్త్వము నెఱిగినవాడు. ఆశించిన పరమప్రయోజనము శిష్యప్రశిష్యుల కద్వైతతత్త్వమును బోధించుట. ఈ ప్రయత్నము మంగళప్రదమగునట్లు తన గురువగు శంకరునకు, అర్ధనారీశ్వరుడైన శంకరునకు సత్సంప్రదాయికమైన నమస్కారము చేయుచున్నాడు.

ఈ శ్లోకము అనుష్టుప్ ఛందమున నిబద్ధమైనది. నాల్గుపాదములు, పాదమున కెనిమిదక్షరములు, అన్ని పాదములందును అయిదవ అక్షరములఘువు, ఆరవది గురువు, ఎన్మిదవది గురువు, ఒకటవ మూడవ పాదములలో ఏడవ అక్షరము గురువుగను, రెండవ నాల్గవపాదములలో లఘువుగను ఉండును. శ్లోకమున క్రియ 'వన్దే' ఉత్తమపురుషకర్తను బోధించగా, వ్యాఖ్యలోని క్రియ 'నిబధ్నాతి' ప్రథమపురుష కర్తను చెప్పుచున్నది. కవియు వ్యాఖ్యాతయు శ్రీ పద్మపాదాచార్యులొక్కరేయైనను, ఈ ప్రయోగము సంప్రదాయసిద్ధమైన సాధుప్రయోగమే.

**విశేషము:-** గ్రంథరచనకు ప్రయోజనము తత్త్వావలమ్బనము, అనగా సత్యమును ప్రతిష్ఠించుట. ఆ సత్యము అద్వైతతత్త్వము. తత్త్వశబ్దమునకు సందర్భానుసారమిది సిద్ధించును. ఈ తత్త్వసారరూపముగ సాంబుడు ధ్యానింపబడినాడు. సాంబుడు అర్ధనారీశ్వరుడు, అనగా ప్రకృతి తత్త్వముతో కూడిన పురుషతత్త్వము. ఈతడు సదానందుడు. ఎల్లప్పుడు ఆనందించువాడు. సత్యమునందానందించువాడు. ఉనికియే ఆనందమైనవాడు. అట్టి ఆనందమునకు అవరోధమేర్పడినచో దానిని నశింపజేయువాడు. అట్టివాడు మానవరూపము దాల్చి పుడమిపై అవతరించినాడు. అనగా ఇచట ఆనందము ఆచ్ఛాదితమైనది. ఎట్లు? ఆనందైకతత్త్వము ఆనంద-

దుఃఖద్వయమైనది. కాగా అద్వైతతత్త్వమును లోకమున ప్రతిష్ఠింపవలసివచ్చినది. అందులకే శంకరుడు శంకరాచార్యుడై అవతరించినాడు. కావున వానికి వందనము అని ఇట్లు గ్రంథప్రయోజనమును దానిని తీర్చు పరమేశ్వరుని రూపమును అనుసంధానముచేసి, రెండిటికి నొక ఐక్యతను ఘటించుచున్నది ఈ ప్రార్థనము. ఇందు దేవగురువులిర్వురకును ఐక్యత ఘటిల్లినది. అద్వైతతత్త్వమిట్లే ప్రార్థనలో రూపుగట్టినది.

ఆనందమునకవరోధమేర్పడినప్పుడే విష్ణుని అవతారములకును అవసర మేర్పడినది. కాగా, శివుడుగాని విష్ణువుగాని తమ తమ కైలాస వైకుంఠములలో అట్టేయుండి భూలోకమును చక్కదిద్దుట లేదు. మానవరూపముననో లేక మరియొక ప్రాకృతికరూపముననో అవతరించితీరవలె. విష్ణువు ధర్మపాలనము చేయువాడు. శివుడు జ్ఞానదాత, విష్ణునినుండి మోక్షమును, శివునినుండి జ్ఞానమును కోరవలెనని పెద్దలందరు. ఆ దృష్ట్యా తత్త్వావలమ్బనార్థము శివుడు శంకరాచార్యుడై అవతరించె ననుట.

*శ్లో॥ బ్రహ్మాభిః ప్రతిపాద్యం యద్ బ్రహ్మాభిర్బ్రహ్మాసంయుతైః।*
*చిన్తితం కర్మనిర్ముక్త్యై తద్ బ్రహ్మ హృది భావయే॥* **1**

బ్రహ్మాభిరితి। తత్ ప్రసిద్ధం బ్రహ్మ వ్యాపకం చైతన్యం హృది హృదయే భావయే చిన్తయే। కిం భూతమ్? బ్రహ్మాభిః వేదశిరోభిః ప్రతిపాద్యం అతన్నిరసనముఖేన లక్షితమిత్యర్థః పునశ్చ కీదృశం బ్రహ్మ? బ్రహ్మాభిః తపోభిః సంయుతైః సమ్యక్ సమ్పన్నైః బ్రహ్మాభిః బ్రహ్మజ్ఞానిభిః కర్మణాం సఞ్చిత-సఞ్చీయమాన-ప్రారబ్ధానాం నిర్ముక్త్యై నిఃశేషేణ సమాప్త్యర్థం చిన్తితమాత్మస్వరూపత్వేన ధ్యాతమ్॥

బ్రహ్మాభిః ప్రతిపాద్యమిత్యనేనాస్య ప్రకరణస్య ప్రతిపాద్య ప్రతిపాదితభావః సమ్బన్ధో దర్శితః బ్రహ్మాసంయుతైరిత్యనేనాధికారీ సూచితః-కర్మనిర్ముక్త్యై ఇత్యనేన కర్మనిర్హారలక్షణం ప్రయోజనముక్తమ్। తద్ బ్రహ్మ ఇత్యనేన బ్రహ్మణః సద్వృత్తి-వ్యాప్యత్వేన తస్య ధ్యాతృధ్యేయయోర్వా ఐక్యస్య విషయత్వమభిహితమ్। మహానుభావ-నిరూపితస్య సమాసస్యాపి ప్రకరణస్య సంహితానుగతసదనుబన్ధాదిలక్షణైరేవ భావ్యత్వాదితి భావః॥

**ప్రతిపదార్థము:–** కర్మనిర్ముక్త్యై=కర్మనుండి పూర్తిగ విడుదలపొందుటకు, యద్=ఏది, బ్రహ్మభిః=ఉపనిషత్తులచేత, ప్రతిపాద్యమ్=ప్రకటింపబడినదో, బ్రహ్మసంయుతైః= తపస్సంపన్నులైన, బ్రహ్మభిః=బ్రహ్మజ్ఞానులచేత, చిన్తితమ్=ధ్యానింపబడినదో, తద్ బ్రహ్మ=అ బ్రహ్మమును, హృది=మనసులో, భావయే=(నేను) ధ్యానించుచున్నాను.

**తాత్పర్యము:–** ఉపనిషత్తులు ప్రకటించగా, తపస్సంపన్నులైన బ్రహ్మజ్ఞానులు కర్మఫలభోగమునుండి పూర్తిగ ముక్తులగుటకు దేనిని ధ్యానించిరో, అ బ్రహ్మమును మనసున ధ్యానించుచున్నాను.

**వివరణము:–** బ్రహ్మమును ధ్యానించుచున్నానని కవి ప్రకటనము. ఈ బ్రహ్మమును తొలుత ప్రకటించినవి ఉపనిషత్తులు. ఇవి వేదము చివర నుండునవి. కనుక వేద శిరస్సనియు వేదాంతమనియు వీనికి పేరు. వేదమున కర్మానుష్ఠానములు వాని ఫలములు చెప్పిన తర్వాత బ్రహ్మముపదేశింపబడినది. అనగా కర్మలకు లక్ష్యము బ్రహ్మమని కదా తాత్పర్యము. అందుచే బ్రహ్మము నుపాసించుచున్నాను. అదియుగాక, బ్రహ్మజ్ఞానులైన తపస్సంపన్నులు కనుగొనిన సత్యమిది. వారు ద్రష్టలు, వేదమంత్ర ద్రష్టలు, లోకమున గల భోగములను నిరాకరించి, ఈ జగత్తుయొక్క బాహ్యస్వరూపము మన చర్మచక్షువులకు గోచరించుచున్నదే యైనను, దాని అంతరంగము బ్రహ్మమని జ్ఞానదృష్టిచే కనుగొన్నవారు. వారికి లోకోద్ధరణ ప్రయోజనము గాక ఆత్మోద్ధారకమగు ప్రయత్నము లేదు. కావున వారు నిశ్శంకగ విశ్వసనీయులు. కర్మఫలభోగము- నుండి ముక్తులు కాదగినవారికి వారు అనుసరణీయులు. కర్మఫలము సహజప్రాప్తము కదా, కర్మ చేయక జనుడు మనలేడు కదా, అట్టిచో కర్మఫలము అనుభవించరానిదని యెట్లు చెప్పవచ్చును? అను శంకయున్నది. విచారించగా, కర్మఫలముగ లభించునవి సుఖము, దుఃఖము అను రెండు భోగములు. దుఃఖానుభవమును లోకము నిరాకరించును గాని సుఖానుభవమును స్వాగతించును కదా. ఐనను, ఈ సుఖానుభవము గూడ క్షణికమనుట సత్యము. కావలసినది సుఖమే యైనప్పుడు శాశ్వత సుఖము నేల వరింపరాదు? అట్టి శాశ్వత సుఖస్వరూపము బ్రహ్మమే యని ఋషివాక్కు. కనుక అ బ్రహ్మమునే ధ్యానింతును అని కవి యనుట. కాని బ్రహ్మము లభింపవలెనన్న కర్మనుండి విడుదల కాక తప్పదు. కర్మయున్నచో ఫలము సిద్ధము. ఫలము వద్దనుట కర్మ వద్దనుటే. అందులకే కర్మవిమోచనము ప్రయోజనముగ బ్రహ్మోపాసన. బ్రహ్మము కర్మకతీతము గనుక తదుపాసనమే కర్మముక్తిని సాధించ గలదు. అన్యోపాసనములు కర్మబద్ధములే, ఫలమును ఆశించునవే.

అవతారికా:- పునరపి పరా-పశ్యన్తీ-మధ్యమా-వైఖరీలక్షణశబ్దవృత్త్యా అకారాద్యక్షర-రూపేణ స్వయమేవ వివర్తతామివ ప్రాప్తం బ్రహ్మ ఏవ మఙ్గలాన్తరత్వేన ప్రణమతి।

శ్లో॥ వాచే బ్రహ్మస్వరూపాయై పఞ్చాశద్వర్ణభేదతః।
అనేకరూపమాప్తాయై నమో మాత్రే త్రిమూర్తయే॥ 2

వాచే ఇతి। మాత్రే సకలచరాచరజగజ్జనన్యై వాచే సరస్వత్యై నమః కిం భూతాయై? పఞ్చాశద్వర్ణభేదతః లిప్యా, ఆకృత్యా, స్థానేన ఉచ్చారణేన వా భిన్నత్వేన స్వసమానైః అకారాది షోడశ, కకారాది పఞ్చవింశతిః, యకారాది నవ ఇత్యేవం పఞ్చాశత్ సంఖ్యాకైః వర్ణైః అనేకరూపాం పరా-పశ్యన్తీ-మధ్యమా-వైఖరీ-లక్షణ-శబ్దవృత్త్యా, చరాచరరూపేణ వా వివిధాకృతిమాప్తాయై, అత ఏవ త్రిమూర్తయే త్రయోఽకార-ఉకారమకారాః మూర్తయః యస్యాః, తదధిష్ఠాతారో హరిహర-విధాతారో వా మూర్తయో యస్యాః, సత్త్వరజస్తమోగుణా వా మూర్తయ ఉపాధయో యస్యాస్తస్యై॥

యద్వా తిస్రో భూరాద్యా వ్యాహృతయో వహ్నిసూర్యసోమకలా వా మూర్తయో యస్యాః త్రీణి పదాని యస్యాం గాయత్ర్యాం సా మూర్తిః యస్యాః,త్రయో లోకా సన్తి యస్మిన్ బ్రహ్మాణ్డే తన్మూర్తిః యస్యాః, త్రయో హ్రస్వదీర్ఘప్లుతా ఉదాత్తానుదాత్తస్వరితా వా మూర్తయో యస్యాః, తిస్రః సన్ధ్యాస్తదధిష్ఠాత్ర్యో గాయత్రీసమవత్రో సరస్వత్యో మూర్తయో యస్యాః, జాగ్రత్స్వప్నసుషుప్తిలక్షణా మూర్తయో సరస్వత్యాః, త్రయోఽ-జ్ఞానలిఙ్గస్థూలదేహాః తదభిమానినః ప్రాజ్ఞతైజసవిశ్వహిరణ్యగర్భవైశ్వానరా వా మూర్తయో యస్యాః ఋగ్యజుస్సామలక్షణా వా త్రయీ మూర్తిరస్యాః, ధ్యేయధ్యాన-ధ్యాతృరూపా త్రిపుటీమూర్తిః స్వరూపం యస్యాః తస్యై ఇత్థమనేకాకృతయే తథాపి బ్రహ్మస్వరూపాయై అప్రచ్యుతస్వస్వరూపాయై నమ ఇతి పూర్వేణ సమ్బన్ధః। ప్రణవాన్తర్గతస్య అకారస్య పరావిషయత్వమ్, ఉకారస్య పశ్యన్తీ విషయత్వం, మకారస్య సన్నిపాతస్య చ మధ్యమా విషయత్వం స్వస్వస్థానప్రాప్తానాం వర్ణానాం తద్వివర్తానాం చ వైఖరీవిషయత్వమితి వివేకః। కార్యకాలోపస్థితమాయాగుణానుకరణేన వివిధాకృత్యా ప్రతీయమానస్యాపి బ్రహ్మణః కూటస్థస్వరూపత్వాత్ సచ్చిదానన్దరూపత్వం న హీయతే ఇతి భావః॥

అవతారిక:- మరలను పరా-పశ్యంతీ-మధ్యమా-వైఖరీ-లక్షణ అను ఈ పేర్లచేత వివరింపబడిన ఆకారము మొదలైన అక్షరముల రూపముతో స్వయముగ తానే

వ్యాపించియున్న బ్రహ్మమునే మతియొక మంగళాచరణరూపమున నమస్కరించు-చున్నాడు.

ప్రతిపదార్థము:- పఞ్చాశత్+వర్ణభేదతః=ఏబది అక్షరముల భేదమున, అనేకరూపమ్=పలు రూపములను, ఆప్తాయై=పొందియున్నట్టి, బ్రహ్మస్వరూపాయై=బ్రహ్మముయొక్క స్వరూపమైన, త్రిమూర్తయే=మూడు మూర్తులుగల, మాత్రే=తల్లియగు, వాచే=సరస్వతికై, నమః=నమస్కారము.

తాత్పర్యము:- బ్రహ్మమే మూడు మూర్తుల ప్రకృతియైనది. వారిలో ఒక మూర్తి సరస్వతి. ఈమెయే ఏబది అక్షరముల రూపములుగ అనేకతను పొందినది. ఈమెయే జగన్మాతృమూర్తి. ఇట్టి సరస్వతికి నమస్కారము.

వివరణము:- తల్లియైన సరస్వతికి నమస్కారము. సరస్వతి ఎవరికెట్లు తల్లియైనది? జగత్తునకు తల్లి. చరాచరరూపమైనది జగత్తు. ఇట్టి జగత్తునకెట్లు సరస్వతి తల్లియైనది? చరాచరముల వివిధాకారములను పొందియున్నందునను, అకారాది పదునారు, కకారాది ఇరువదియైదు, యకారాది తొమ్మిది, మొత్తము ఏబది అక్షరములుగ వివిధాకారములై యున్నందునను, పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ, లక్షణయను శబ్దవృత్తులచేత అనేకరూపములు గలిగియున్నందునను జగన్మాతయైనది. ఇట్లే, ఓంకారరూపిణియైన ఆ తల్లి తనయందలి అకార, ఉకార, మకార రూపులుగ ముమ్మూర్తులై వానికధిష్ఠాతలగు బ్రహ్మవిష్ణుమహేశ్వరులుగను మూడు మూర్తులైనది. ఇట్లు దేవతామూర్తులకు సైతము ఈమె ఆదిమూర్తియే. ఇట్లే ఈ తల్లి సత్త్వము, రజస్సు, తమస్సు అను మూడు గుణములుగ శరీరములను దాల్చి చరాచరాంతర్గత-శక్తియైనది. ఇట్లే భూమి, భువమనబడు భూమ్యావరణము, స్వః అనబడు అంతరిక్షము, ఈ మూడు వ్యాప్తుల రూపమైనది. అగ్ని, సూర్యుడు, చంద్రుడను మూడు కళలు గలిగినది. మూడు పదములు గల గాయత్రీమూర్తియైనది. మూడు లోకములుగనున్న బ్రహ్మాండమూర్తియైనది. హ్రస్వ, దీర్ఘ, ప్లుతములుగ, ఉదాత్త, అనుదాత్త, స్వరితములుగ మూడు శబ్దమూర్తులైనది. ఉదయ, మధ్యాహ్న, సాయంసంధ్యలైనది. వాని అధిష్ఠాతలు తానైనది. జాగ్రద్, స్వప్న, సుషుప్తులను మూడు స్థితులందు దర్శింపబడునది. అజ్ఞానదేహము, లింగదేహము, స్థూలదేహము అను మూడు శరీరములను దాల్చి వాని అభిమానపురుషులైన ప్రాజ్ఞ, తైజస, విశ్వపురుషులైనది. హిరణ్యగర్భ వైశ్వానర-రూపములు దాల్చినది. ఋుక్, యజుస్, సామ వేద రూపములైనది. ధ్యానము,

ధ్యానించువాడు, ధ్యానింపదగినదియు తానైన త్రిపుటీమూర్తి. ఇట్లనేక యైనను చ్యుతిలేని బ్రహ్మము గూడ యైనది సరస్వతి. ఈ అద్వైతమూర్తిని గ్రంథారంభమున స్మరించుట మంగళకరము. అదియును వాచే యని వాగ్రూపను ధ్యానించుట సందర్భోచితము.

అకారాది, శబ్దరూపమున వ్యవహారములోనున్న వాక్కు సంపూర్ణ స్వరూప మిట్లుండును – యోగశాస్త్రము ప్రకారము, మానవుని శరీరమున సుషుమ్నయను నాడి యొకటి కలదు. దీని అధోభాగము గుదప్రదేశమున నుండును. ఈ ప్రదేశమున నుండు శక్తికేంద్రక్షేత్రమును మూలాధారమందురు. ఇచ్చట, ఒక వ్యక్తికి తాను మాటలాడవలెనను ఇచ్ఛ లేక కోరిక కలిగినంతనే, ఆ ఇచ్ఛాశక్తి ప్రేరణతో వాయు రూపాగ్ని కదలుట మొదలగును. ఈ వాయువు శివస్వరూపము, అందలి అగ్ని శక్తి కాగా ఈ రెండిటి పరస్పరైక్యము మొదటి పరిణామము. ఈ దశలో వాక్కునకు గల రూపమును లేక స్థితిని పరా అందురు. ఇది బీజరూపము. దీనికి అధిష్ఠాన దేవత గణపతి. (గణపతి శివపార్వతుల కుమారుడనుటలోని ఆంతర్యమును ఈ సందర్భమున నిట్లు గ్రహించవచ్చును. గణపతి ప్రథమపూజ్యుడగుటకు ముఖ్య కారణమును గూడ నిట అన్వయించవచ్చును.) ఇట్లు కదలిన పరావాక్కు పైకెగసి స్వాధిష్ఠానచక్రములో బలపడి ఉత్తేజమును పొంది మణిపూరచక్రమును జేరును. ఈ చక్రము నాభిస్థానీయము. ఇచట బలమైన బీజముగనున్న పరావాక్కు తన ఏకరూపమును వీడి రెండుగా విభాగమును పొందును. ఈ దశలో దీనిని పశ్యంతి అను పేరున గుర్తింతురు. ఇది జ్ఞానశక్తిరూపముగ భాసించును. ఇటనుండి ఎగసి అనాహతచక్రమును చేరును. ఈ చక్రము ఉరఃస్థానీయము. ఇచ్చట దీని పేరు మధ్యమ. ఇది నాదరూపమును సంతరించికొనినది, కాని ఈ నాదమును యోగులు మాత్రము విందురు. ఎవరికి వారు దీనిని గ్రహింపగలరు. కాని ఇతరులకు వినిపించదు. ఇది ఇటనుండి కంఠస్థానీయమైన విశుద్ధచక్రమును చేరికొనును. ఇచ్చట అన్యులకు వినరాకున్న మధ్యమావాక్కు అన్యులకు సైతము వినబడునట్టి ధ్వనిగా మారును. దీనికిప్పుడు వైఖరీవాక్కు అని పేరు. ఇది క్రియాశక్తి రూపమును పొందియుండును. వ్యవహారమున పరస్పరావగాహనకు తోడ్పడు భాష ఇదియే. ఇది రెండు రూపములుగ వినబడుచుండును. ఒకటి, స్వరములు (అచ్చులు). ఇవి శక్తి రూపములు. రెండు, వ్యంజనములు (హల్లులు). ఇవి శివరూపములు. ఇవి మొత్తము, 'అ' మొదలు 'క్ష' వరకు గలవి, ధ్వనులుగను, అక్షర రూపమునను, 'అ'

నుండి 'అః' వరకు పదియారును, 'క' వర్గమున నైదు, 'చ' వర్గమున నైదు, 'ట' వర్గమున నైదు, 'త' వర్గమున నైదు 'ప' వర్గమున నైదు, ఇట్లగు ఇరువది యైదును, 'య'కారాది 'క్ష' కారాంతము తొమ్మిదియు కలసి ఏబదిగ నుండును. ఇది భాషోత్పత్తి క్రమము, వర్ణనిర్ణయము. పై జెప్పిన చక్రములలో విభిన్న దళములుగల పద్మములును, దళదళమున కొక్క వర్ణమును కలవని యోగమంత్రతంత్రశాస్త్రములు చెప్పుచున్నవి. ఇది యంతయు ప్రాచీన మహర్షులు దర్శించిన సరస్వతీ స్వరూపము.

**అవతారికా:-** త్రిగుణమాయామృగీవర్తకత్వేన గుణాభిమానిత్వం గతస్య పూర్వ-స్వరూప- అస్మృత్యా ఆత్మనో జీవత్వవ్యవహారో దుర్వార ఇత్యాశయేనాహ।

శ్లో॥ త్రైగుణ్యాద్ బ్రహ్మణః పూర్వం సచ్చిదానన్దరూపిణః।
సదసత్కర్మణోః సఙ్గాజ్జీవత్వం న నివర్తతే॥ 3

**వ్యాఖ్యా-** త్రైగుణ్యాదితి। సత్తాజ్ఞానసుఖస్వరూపస్యాపి పరమాత్మనః సత్త్వరజస్తమః-సామ్య లక్షణాయాం ప్రకృతౌ ప్రతిబిమ్బపాతేన జీవత్వం లభమానస్య జగదుపాదాన-కారణావిద్యాసమ్బన్ధేన అదృష్టవశతః సంప్రాప్తోత్తమమధ్యమాధమకర్మప్రసఙ్గేన సంసరత ఆత్మనః కర్మకర్తృత్వభోక్తృత్వాభిమానానివృత్త్యా తదాకారవృత్త్యభావాత్ జీవ ఇతి నామరూపవ్యవహారో న నివర్తతే। అవిద్యాస్వభావనామరూపయోరేవ ఆత్మస్వభావరూప సచ్చిదానన్దావరకత్వాత్ తత్సంసర్గ ఏవాత్మనో ద్వైరూప్యకర ఇతి భావః॥

**అవతారిక:-** త్రిగుణములనబడు మాయలేడియొక్క నట్టువతనముచేత గుణముల-యందభిమానమును పొందియున్నట్టి ఆత్మకు పూర్వపు తన రూపము మఱపు దగిలియుండుటచేత జీవత్వవ్యవహారము అనివార్యమనుభావముతో నిట్లనును.

**ప్రతిపదార్థము:-** పూర్వమ్=తొల్లింటి కాలమున, సత్+చిత్+ఆనన్ద=అస్తిత్వము, జ్ఞానచైతన్యము, ఆనందము అను వీనియొక్క, రూపిణః=రూపముగల, బ్రహ్మణః =బ్రహ్మమునకు, జీవత్వమ్=తాను జీవుడనను భావన, త్రైగుణ్యాత్=మూడు గుణముల కారణమువలన, సత్+అసత్ మంచి, చెడు, కర్మణోః=కర్మలయొక్క, సఙ్గాత్= సంబంధము వలన, న నివర్తతే=తొలగిపోదు.

**తాత్పర్యము:-** సృష్టికి ముందు బ్రహ్మమునకు సత్, చిత్, ఆనందములనునివి స్వస్వరూపము. సత్త్వరజస్తమోగుణములను భావించుటవలన కర్మ కలిగినది. కర్మకు మంచి చెడుగుల నాపాదించుట కలిగినది. ఇట్టి కర్మతో బంధమేర్పడి దానియందే

జీవించుటవలన బ్రహ్మము తాను జీవుడ ననుకొనుట మొదలైనది. ఈ కర్మబంధ-మున్నంత వరకును వానికీ జీవభావముండును.

**వివరణము:-** బ్రహ్మము సృష్టికి పూర్వము సచ్చిదానందస్వరూపుడు. ఇట్లనుటవలన బ్రహ్మము పురుషుడని కాదు. మూలస్థితియందు బ్రహ్మము స్త్రీ-పురుష భేదమును పొందియుండనేలేదు. ఐనను వ్యవహారసౌలభ్యము కొరకు 'డు' అను పురుష ప్రత్యయమును వాడుట. అప్పటి వాని స్థితి సత్+చిత్+ఆనంద అనునది. **సత్** అనగా 'ఉనికి' యని ఒక అర్థము. 'మంచి' యనునది వేరొకటి. ఈ రెండిటియొక్క కలయికయే ఈ 'సత్' అనుకొనవచ్చును. **'చిత్'** అనగా జ్ఞానము అని అర్థము. **'ఆనంద'** అనగా నిర్వికార, నిర్మల శుద్ధత్వము. ఈ మూడిటి సమాహారము వాని మూలస్థితి. అనగా 'ఉనికి' అను దానియందును, 'జ్ఞానము' నందును, ఆనందము నందును అంతర్భవించు, అంతర్లీనమైయుండు భావములన్నియును అని భావము. ఈ మూలస్థితి నిర్వికారమైనను దానియందు సత్త్వము, రజస్సు, తమస్సు అను మూడు గుణములు వికారముగ కలిగినవి. వీనినుండి కర్మయనునది కలిగినది. ఈ కర్మ సత్, అసత్ అను రెండు విధములైనది. వీనితోడి సంబంధము బ్రహ్మమునకు తనయందే యేర్పడియే యున్నది కదా. ఆ కారణమున బ్రహ్మము సదసత్ కర్మలును, సత్త్వరజస్తమోగుణములును తానే అనుకొనసాగినది. ఇదియే జీవస్థితి యనబడునది. ఇది తొలిగిపోవలెననిన బ్రహ్మము తన పూర్వపు మూలస్థితి నెఱుగవలసియున్నది. మార్గాంతరము లేదు.

అవతారికా:- త్రిగుణసమ్బన్ధనిబన్ధనైవ ఆత్మనస్తత్తద్గుణకర్మానుసారిణీ దేహలోకప్రాప్తి-రపి ప్రసక్తేత్యాహ --

శ్లో॥ అధోవృత్తిస్తమోవృత్తేర్మధ్యవృత్తిస్తు రాజసాత్।
ఊర్ధ్వవృత్తిస్తు సత్త్వేన సత్యవృత్తిర్విశుద్ధతః॥ 4

వ్యాఖ్యా:- అధోవృత్తిరితి। అజ్ఞానమోహాదికారేణ తమసి వృత్తిః వర్తనం యస్య కర్మణ-స్తదభిమానినో జీవాత్మనః పశుపక్షిమృగనాగాద్యశుభయోనిః యాతనార్థలోకప్రాప్తిశ్చ ప్రసజ్యతే ఇతి శేషః "అధో గచ్ఛన్తి తామసాః" ఇతి భగవద్గీతోక్తేః రాగతృష్ణాదికారణ-రజఃప్రధానాత్ కర్మణః సకాశాత్ తదభిమానినో జీవస్య మధ్యవృత్తిః విద్యాధర-యక్షరక్షోమనుష్యాదియోనిః సమానసుఖదుఃఖోదయలోకప్రాప్తిశ్చ భవతి । "మధ్యే

తిష్ఠన్తి రాజసాః"ఇతి గీతోక్తేః జ్ఞానసుఖాదికారణసత్త్వప్రధానకర్మణా తదభిమానిదేహినః ఋషిదేవతాదియోనిః స్వర్గమహర్లోకాది ప్రాప్తిశ్చభవతి। "ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థాః" ఇతి గీతోక్తేః తత్రాపి విశిష్టతః లుప్తరజస్తమోవృత్తిక-వైరాగ్యోపరతిహేతుక సాత్త్విక-కర్మణః సత్యవృత్తిః సత్యే హిరణ్యగర్భలోకే సత్యలక్షణే పరమాత్మని వా వృత్తిః స్థితిరుపతిష్ఠతే। గుణానాం ప్రకృతికార్యత్వేఽపి కార్యాకృతీనామనేకత్వాత్ ఫలానామపి అనేకత్వమితి భావః॥

**అవతారిక:–** మూడుగుణముల సంబంధమగు రచనయే ఆత్మయొక్క ఆయా గుణకర్మల అనుసరించిన దేహప్రాప్తియు, లోకప్రాప్తియు అని చెప్పబడినది.

**ప్రతిపదార్థము:–** తమోవృత్తేః=తమోగుణవర్తనమువలన, అధోవృత్తిః=అధమవర్తనము, రాజసాత్=రజోగుణసంబంధివర్తనమువలన, తు=అయితే, మధ్యవృత్తిః=మధ్యమమైన వర్తనము, ఊర్ధ్వవృత్తిః+తు=ఉత్తమ వర్తనమయిన, సత్యవృత్తిః=సత్త్వవర్తనము, విశుద్ధతః=విశేషముగ నిర్వికారమగుటవలన, సత్త్వేన=సత్త్వగుణముచేత, (లభతే=లభించును).

**తాత్పర్యము:–** తమోగుణము ప్రధానముగ గలవానియందు అధమవర్తనము, అనగా అతివికారమగు ప్రవర్తనము కలుగును. రజోగుణము ప్రధానమగు వ్యక్తిత్వమునందు మధ్యమవర్తనము, అనగా తగు మాత్రము వికారమగు ప్రవర్తనము చూడనగును. సత్త్వగుణము ప్రధానమైన వ్యక్తిత్వమునందు, అవికారవర్తనమువలన, ఉత్తమ-ప్రవర్తనము, అనగా సత్యమగు నడవడిక కలుగును.

**వివరణము:–** అధోవృత్తిః అని శ్లోకారంభము. "అధో గచ్ఛన్తి తామసాః" అను గీతావచనము ప్రమాణముగ తమోగుణమునందు ఎవని కర్మలు వర్తించునో ఆ కర్మల అభిమానిపురుషుడగు జీవునకు (జీవాత్మకు) పశువులు, పక్షులు, పాములు మొదలగువాని యోనులందు జన్మము,యాతనలకు యోగ్యమైన లోకమున నివాసమును సహజముగ కలుగునని అంతరార్థము. "మధ్యే తిష్ఠన్తి రాజసాః" అను గీతోక్తి ననుసరించి కర్మల సహవాసమున అట్టి అభిమానిపురుషడగు జీవునకు ఉత్తమ అధమముల మధ్యే మార్గమగు విద్యాధర, యక్ష, రాక్షస, మనుష్యాది యోనులందు జననమును తత్సమానసుఖదుఃఖములు కలుగు లోకములలో నివాసమును సంభవించును. "ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థాః" అను గీతావాక్యము ననుసరించి జ్ఞానము, సుఖము మొదలగువానికి కారణమగు సత్త్వగుణప్రధానమైన

కర్మచేత ఆ అభిమానపురుషునకు ఋషి, దేవత మొదలగు యోనులందు స్వర్గ, మహర్లోకాదులందును జన్మము కలుగును. అదియును విశేషముగ రజస్తమోగుణ-వృత్తిలేనట్టియు, వైరాగ్యాసక్తికి కారణమవు నట్టియు సాత్త్వికకర్మలు గలవారికి సత్యలోకమున అనగా హిరణ్యగర్భలోకమునగాని సత్యలక్షణుడైన పరమాత్మునియందు గాని జన్మముగాని స్థితిగాని కలుగును. గుణములకు ప్రకృతి కార్యమునందు గూడ కార్యరూపములందు అనేకత్వము, కలుగుటవలన వాని ఫలములకు గూడ అనేకత్వ ముండునని భావము.

అవతారికా:- గుణానుగతస్వభావభేదమూలకకర్మఫలానాం భేదాపత్త్యా తత్ఫలభోగార్థం సంసృతస్యాత్మనోఽనేకనామరూపభేదయోఽపి ప్రసక్త ఇత్యాహ -

శ్లో॥ కర్మణాం ఫలవైచిత్ర్యాద్వైచిత్ర్యం జన్మనామిహ।
దేహవైచిత్ర్యతో జీవే వైచిత్ర్యం భాసతే తథా ॥ 5

వ్యాఖ్యా :- కర్మణామితి। సత్త్వోద్రేకకర్మణాం ఫలం స్వర్గాది। రజఃప్రధానకర్మణో భూమ్యన్తరిక్షలోకస్థితిః ఫలమ్। తామసకర్మణో యాతనార్థస్థానప్రాప్తిః ఫలమ్। శుద్ధ-సత్త్వప్రధానకర్మణో హిరణ్యగర్భలోకప్రాప్తిః ఫలమ్। ఏతస్మాదేవ కర్మఫలవైచిత్ర్యాద్ జన్మవైచిత్ర్యమ్। స్వర్గాన్తరిక్షభూవివరాధికరణకసుఖదుఃఖాదిప్రాప్త్యర్థం దేవాది మనుష్యాది పశ్వాది బ్రహ్మార్ష్యాది జన్మేతి శరీరవైచిత్ర్యమ్। యథా కర్మవైచిత్ర్యాత్ ఫలవైచిత్ర్యం, ఫలవైచిత్ర్యాద్దేహవైచిత్ర్యం తథా దేహవైచిత్ర్యతో జీవవైచిత్ర్యమపి భాసతే। తత్త్వాత్మనోః సామ్యేఽపి ఇన్ద్రాదయో దేవా, వసిష్ఠాదయో మునయో, హరిశ్చన్ద్రాదయో రాజానః, శేషాదయో నాగా ఇత్యాది జీవవైచిత్ర్యం ప్రసిద్ధమ్। వస్తుతో బిమ్బప్రతిబిమ్బ-యోరభేదేనావికలమేవ జీవాత్మనో బ్రహ్మత్వమితి। అసదపి జీవవైచిత్ర్యం పుష్పగన్ధవద్ అవిద్యాకార్యదేహాధ్యాసేన స్వరూపాస్ఫూర్త్యా సదివ ప్రతీయతే ఇతి భావః॥

అవతారిక:- గుణముల ననుసరించి వచ్చు స్వభావములలో భేదములున్నవి. వాని మూలమున కర్మలలో భేదము, కర్మలననుసరించి ఫలములలో భేదము కలుగుచున్నవి. ఆ యా ఫలముల ననుభవించుటకై జన్మమును పొందిన ఆత్మలకు అనేకములుగ నామరూపభేదములు కలుగుట ఇట్టిదే అని చెప్పబడుచున్నది.

ప్రతిపదార్థము:- ఇహ=ఈ లోకమున, కర్మణామ్=కర్మలయొక్క, ఫలవైచిత్ర్యాత్=ఫలములలోని వైవిధ్యమువలన, జన్మనామ్=జన్మలయొక్క, వైచిత్ర్యమ్=వివిధత్వము,

భాసతే=ప్రకాశించుచున్నది, దేహవైచిత్ర్యతః=శరీరములవివిధత్వమువలన, తథా=అట్లే, జీవే=జీవునియందు, వైచిత్ర్యమ్=వివిధత్వము, భాసతే=ప్రకటమగుచున్నది.

**తాత్పర్యము:–** ఈ లోకమున కర్మలు వివిధములు. వాని ఫలములు వివిధములు. వానిని బట్టియే జన్మలు నానావిధములగుచున్నవి. అట్లే దేహములు వివిధములగుట–వలన జీవునియందు (జీవులయందు) వివిధత్వము ప్రకటమగుచున్నది.

**వివరణము:–** సత్త్వగుణముచేత ప్రేరణపొందిన కర్మలకు స్వర్గాదులు ఫలముగా లభించును. రజోగుణకర్మలకు భూమి, అంతరిక్షము ఇత్యాది లోకములు ఫలము. తమోగుణకర్మలకు యాతనామార్గమైన స్థానము ఫలము. శుద్ధసత్త్వకర్మలకు ఫలము హిరణ్యగర్భలోకప్రాప్తి. ఇట్లు కర్మఫలములలోని భేదము కారణముగ జన్మలలోని భేదము చెప్పబడినది. జన్మనుబట్టి దేహము కనుక దేహములలోని భేదము సహజము. కర్మనుబట్టి ఫలము, ఫలమునుబట్టి దేహము నానాత్వమును పొందుచుండగా తదనుగుణముగ జీవులు నానారూపులైయున్నారు. కాని ఈ వివిధత్వమువలన జీవాత్మ బ్రహ్మము కాకపోవుట యనునది లేదు. జీవుడు అసద్రూపుడైనను వానియందు సద్రూపబ్రహ్మము ప్రతిబింబభావమున ఉండనే ఉన్నది.

ప్రతి జీవికి నొక ప్రత్యేక రూపమున్నట్లే, ఒక ప్రత్యేక వ్యక్తిత్వముండును. ఈ వ్యక్తిత్వము వారి వారి కర్మలలో స్పష్టమగుచుండును. ఈ కర్మలకు ప్రేరణ సత్త్వ–రజస్తమో గుణములలో నేదియో ఒకదాని నుండి కలుగును. ఆ గుణమే ఆ జీవి వ్యక్తిత్వమును నిర్ణయించును. కాని తఱచుగా ఈ మూడు గుణములు కలిసియుండి, ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క గుణము శాసించుచుండును. అందుచే సాధారణ మానవులలో ఈ గుణకర్మలు మిశ్రమఫలములుగల కర్మలను ప్రేరేపించును. ఒకప్పుడు పరమ–సాత్త్వికుడనిపించిన వ్యక్తి వేఱొకప్పుడు దురహంకారి యనిపించును, దుర్మార్గు–డనిపించును. కొందఱిని మాత్రము మూడిట నేదియో యొక గుణము అధికాధికముగ శాసించుచుండును. ఇట్టి వారినే సత్త్వగుణ ప్రధానులు, రజోగుణప్రధానులు, తమోగుణప్రధానులు అనుట. ఇట్లు గుణము స్వభావమును లేక వ్యక్తిని నిర్వచించును. ఈ వ్యక్తియే అభిమానిపురుషుడు. వీడే గుణమునందు ప్రవర్తించువాడు, కర్మలజేయు వాడు,ఫలములనుభవించువాడును. వీడుగాక, ప్రతిజీవునియందు నొక ఆత్మయున్నది. ఇది నిర్వ్యక్తికము. ఇది బ్రహ్మము. కనుక సద్రూపము. ఇది నిర్వికారము, అవిచ్ఛిన్నము. ఈ ఆత్మ సత్యము. అభిమాని పురుషుడు వీని మిథ్యారూపము.

అవతారికా:- నను కర్మఫలభోగాన్తే స్వతః ప్రాప్తస్వరూపసమ్పదా జీవత్వనివృత్తిః భవిష్యత్యేవేత్యాశఙ్క్య ఫలభోగావస్థాయామపి పునః కర్మాన్తరప్రసక్త్యా న స్వస్వరూప సమ్పదుదయ ఇత్యాశయేనాహ-

శ్లో॥ అనన్త్యం కర్మణామిత్థమారోహాదవరోహతః।
పుణ్యాపుణ్యవిశేషేణ నిత్యా జీవస్య సంస్థితిః॥ 6

వ్యాఖ్యా :- అనన్త్యమితి। శుభాశుభకర్మఫలభోగార్థం స్వర్గాదౌ గమనమారోహణమ్। ఫలభోగానన్తరం పుణ్యపాపయోః శేషేణ పునః స్వర్గాదే చ్యుతిః అవరోహణమ్। ఏవం క్రమేణ కర్మణాం చానన్త్యమపరిక్షయః। ఇహ సత్కర్మకృత్యా తజ్జన్యపుణ్యఫలభోగార్థం దేవాదియోనిమాశ్రిత్య కృతసుకృతభోగస్య కిఞ్చిత్పుణ్యశేషేణ భూమౌ పునర్జన్మ సమ్బన్ధః తత్ర కృతస్య కర్మణః ఫలభోగాయ పునః స్వర్గాదౌ గమనమ్, ఏవం శుభకర్మణ్యోప్యా-రోహణమవరోహణం చ నియతమ్। అథాసత్కర్మ కృత్వాపి తజ్జన్యపాపభోగార్థం యాతనార్థాసద్యోనిమాశ్రిత్య కృతాశుభఫలభోగస్య కిఞ్చిత్పాపశేషేణ అదృష్టప్రేరితస్య భూమౌ పునరసజ్జన్మ ప్రసఙ్గః, తత్ర పునస్తామసకర్మప్రసక్తిః తత్కర్మఫలభోగార్థం తదనుసారిలోకగమనమ్ ఇత్యసత్కర్మణ ఆరోహావరోహౌ నియతౌ। ఉపసర్గవైశిష్ట్యాత్ పుణ్యపాపశేషమన్తరేణ దేహాన్తరానుత్పత్తిః సూక్తా భవతి। ఇత్యేవం ప్రకారేణ ఆరోహావరోహాభ్యాం జీవస్య సంస్థితిః స్వరూపానవమతిర్నిత్యా, కర్మనిర్వారమన్తరేణ దృఢమూలా। వస్తుతోఽనుపహతాపి సచ్చిదానన్దసమ్పత్తిః విస్మృతకణ్ఠమణేర్మణిరివ దేహాధ్యాసవశతః అస్మృతా సతీ జీవాత్మనః శోకమోహాదిజనికేవ అభూదితి భావః॥

అవతారిక :- కర్మఫలము ననుభవించిన తరువాత సహజముగ లభించిన తన తొల్లింటి రూపసంపద జీవత్వమునుండి ముక్తియే కదా అని విచారించి, ఫలము ననుభవించుచున్న దశలో కూడ మరల వేరొక కర్మముండుటచేత తన తొల్లింటి రూపసంపద కలుగుటయే లేదు అని చెప్పుచున్నాడు.

ప్రతిపదార్థము:- ఇత్థమ్=ఇట్లు, పుణ్య+అపుణ్యవిశేషేణ=పుణ్యము పాపము అను నివి మిగిలియుండుటచేత, కర్మణామ్=కర్మలయొక్క, అనన్త్యమ్=అంతులేనితనము, ఆరోహాద్=ఆరోహణమునుండి, అవరోహతః=అవరోహణము వరకు, జీవస్య=జీవుని యొక్క, సంస్థితిః=వ్యవస్థ, నిత్యా=నిత్యమైనది (అంతములేనిది).

తాత్పర్యము:- జీవించియుండగా చేసిన పుణ్యాపాపముల ఫలమును అనుభవించుటకు జీవుడు స్వర్గాది లోకములకు మరణానంతరము పోవును. కాని వాని ఫలము నక్కడ

నిశ్శేషముగ ననుభవించుటలేదు, కనుక ఆ భోగశేషము ననుభవించుటకు మరల జన్మించ వలసినదే. ఇట్లు భూమినుండి స్వర్గాది లోకములకును, అటనుండి మరల భూలోకమునకును ఎక్కుట, దిగుట అను వ్యవస్థ అంతరాయములేకుండ సాగుచునే యుండును.

**వివరణము:-** శుభాశుభకర్మల ఫలము ననుభవించుటకు స్వర్గాదులకు జీవుడు తరలి వెళ్ళుట శ్లోకములో ఆరోహణముగ చెప్పబడినది. అట్లే, స్వర్గాదులలోని అనుభవము తరువాత జీవుడు మరల భూమిని చేరుట అవరోహణముగ చెప్పబడినది. ఇది సత్కర్మల విషయమునను అసత్కర్మల విషయమునను సమానముగ నుండు వ్యవస్థయే. ఈ రెండిటి ఫలభోగమునకై జీవు డే లోకములకు వెళ్ళుననుదానిలోనే భేదము. ఏ లోకమునకు వెళ్ళినను ఫలభోగానంతరము భూమికే చేరును. కర్మశేషమే ఇందుకు కారణము. ఇట్లు క్రొత్తగా పొందిన జన్మలో జీవుడు తన తొల్లింటి కర్మశేషమును అనుభవించుచునే మరల క్రొత్తగా పుణ్యాపాపకర్మల నాచరించును. కర్మశేషము నీ జన్మలో భూమిపై ననుభవించి తొలిగించికొనును, కాని మరల ఈ జన్మలో చేసిన కర్మల ఫలముననుభవించుటకు మరలను స్వర్గాదులకు ప్రయాణము. ఇట్లు, మిగులు భోగము తఱుగదు, క్రొత్తగ కర్మఫలము పుట్టక మానదు. కనుక కర్మకు నశింపులేదు, భోగమునకు ముగింపును లేదు. ఇట్లిది అంతములేని వ్యవస్థయైనది. జీవుని స్వస్వరూపము వస్తుతః నిర్వికారమైనదేయైనను, శరీరమునందలి మోహవశమున మరపుదగిలి శోకమోహములకు కట్టుబడియున్నది.

**అవతారికా:-నను ఆరోహావరోహయోః ఫలభోగమూలత్వాత్ ఫలానాం చావిద్యామూల-త్వాత్తస్యాశ్చ బాధదర్శనాత్ కథమపి తదుపేక్షయా స్వరూపస్మృతిః భవేదేవ ఇత్యాశఙ్క్య, అవిద్యాయాః సాదిత్వే సర్వమేతత్ సమ్పద్యతే, న తు తదస్తీత్యాహ-**

**శ్లో॥ అవిద్యాయా అనాదిత్వాత్ కర్మణామపరిక్షయాత్।**
**కృతనాశాద్ద్విధా గత్యా స్వరూపాప్తిర్విదూరతః॥** 7

**వ్యాఖ్యా :- అవిద్యాయా ఇతి । త్రిగుణసామ్యలక్షణాయాః సూక్ష్మస్థూలదేహరూపేణ పరిణతాయా అజ్ఞానాభిన్నయా అవిద్యయా అనాదిత్వాత్ తన్మూలానామ్ ఏకాదశేన్ద్రియ కరణకానాం కర్మణాం చాపరిక్షయాత్ సమాప్త్యభావాత్ కృతస్య చ కర్మణో భోగమన్తరేణ నాశాభావాత్ ఆరోహావరోహయాత్రాయాశ్చ భోగార్థత్వాత్ తత్తద్దేహకృతకర్మఫల-భోగవాసనానుపక్షయా జీవాత్మనః స్వరూపాప్తిః సచ్చిదానన్దబ్రహ్మాత్వలబ్ధిః విదూరతః**

**విశేషేణ పారోక్ష్యం గతా। ఘనచ్ఛన్నదృష్టేః సూర్యాదర్శనమివ కర్మఫలభోగప్రవాహ-పాతేన స్వరూపాదృష్ట్యా ఆత్మనోఽ హం సుఖీ అహం దుఃఖీతి స్వారోపితాన్తఃకరణ-ప్రత్యయో నియత ఇతి భావః॥**

**అవతారిక:**- ఫలమనుభవించుటకే స్వర్గారోహణాదులు కల్గుట. ఫలమునకు మూలము అవిద్య కదా! కనుక ఫలములును, స్వర్గాదులును బాధకములే అగుచున్నవి. బాధకములను జీవి తిరస్కరించకుండదు కద! అందుకు దోహదపడునది స్వస్వరూప-స్థితి కావున అట్టి స్వస్వరూపము స్మృతికి వచ్చియే తీరునని వితర్కించి, ఇది యంతయు అవిద్యవలన కలుగుచున్నదే కాని నిజముగ నున్నది కాదనుచున్నాడు.

**ప్రతిపదార్థము:**- అవిద్యాయాః=అవిద్యకు, అనాదిత్వాత్=మొదలులేకుండుటవలన, కర్మణామ్=కర్మలకు, అపరిక్షయాత్=నశింపు లేకుండుటవలనను, కృత=చేయబడిన, నాశాత్=నాశమువలన, ద్విధా=రెండు విధములగు, గత్యా=నడతచేత, విదూరతః =దాని విశేషముగ, స్వరూపాప్తిః=తనదైన రూపమును పొందుట.

**తాత్పర్యము:**- అవిద్య అనాది. కర్మలు నశించనివి. వీనివలన కలుగు బాధ రెండు విధములు. ఈ కారణములవలన జీవికి తన సత్యమైన స్వరూపస్థితి ప్రత్యక్షముగ తెలియరాదు.

**వివరణము:**- సత్త్వము, రజస్సు, తమస్సు అను మూడు గుణలక్షణములు కలది అవిద్య. ఇది అజ్ఞానముకంటె వేరుకాదు. ఇదియే సూక్ష్మదేహము, స్థూలదేహము అని రెండుగనైనది. దీని మొదలు తెలియరాదు. దీనికి వ్రేళ్ళు ఐదు జ్ఞానేంద్రియము-లును, ఐదు కర్మేంద్రియములును మనస్సుతో కలిసి పదియునొక్కటి. వీని ద్వారా కర్మ జరుగును. ఈ కర్మ క్షీణించదు, నశించదు. దీనిని ఫలరూపమున జీవు-డనుభవించును, అందుకై స్వర్గనరకాదులకు తరలి పోవును. కాని అంతటితో కర్మ నశించదు, కొంత బలహీనమగును. ఐనను ఒక జన్మ గతించి వేరొక జన్మ వచ్చు-నప్పటికి పాపమో పుణ్యమో కొంత మిగిలియే యుండును. కనుక స్వర్గనరకాదులకు పోవుట, తిరిగి భూమికి వచ్చుట అనునవి సాగుచునే యుండును. ఇందువలన జీవాత్మకు తన మూలస్వరూపమైన సచ్చిదానందబ్రహ్మను గూర్చి జ్ఞానము కలుగ కుండును. మబ్బులు క్రమ్మినప్పుడు కంటికి సూర్యుడు కనరాని విధమున, కర్మానుభవము సాగుచుండగ జీవునకు తన బ్రహ్మత్వము పొడకట్టదు. కనుక నేను సుఖిని, నేను దుఃఖితుడనని తనకై తా నారోపించికొనిన అంతఃకరణవిశ్వాసము దృఢమై నియతమై పోవును.

అవతారికా:- నను తస్యా అనాదిత్వేఽపి కర్మణాం తు తత్కార్యత్వాదుపక్షయప్రసక్తిః అస్త్యేవేత్యాశఙ్క్య కర్మణామప్యనన్తపారత్వాత్ క్రమేణ భోగప్రదత్వా చ్చ న సమాప్తిరస్తీత్యాహ-

శ్లో॥ సఞ్చితం చీయమానం చ ప్రారబ్ధం కర్మ తత్ఫలమ్।
క్రమేణావృత్తిరేతేషాం పూర్వం బలవతోఽపి వా ॥ 8

వ్యాఖ్యా:- సఞ్చితమితి। కృతం, క్రియమాణం, ప్రారబ్ధం చేతి త్రివిధం కర్మ! తజ్జన్య-ఫలం పుణ్యం పాపం చ త్రివిధమేవ । తత్రాభుక్తం యత్కర్మ తత్ సఞ్చితమిత్యుచ్యతే। క్రియమాణం యత్కర్మ తత్సఞ్చీయమానం, యత్కర్మఫలభోగార్థమేతద్దేహోత్పత్తి స్తత్కర్మ ప్రారబ్ధమితి వ్యవహ్రియతే । ఏకస్యైవ కాలస్య భూతభవద్భవిష్యద్వ్యవహారవిషయమివ కర్మత్వేనైకరూపత్వస్యాపి కర్మణో భోగకాలావస్థాభేదేన త్రైవిధ్యమిత్యర్థః॥

తత్ర త్రివిధేషు కర్మసు మధ్యే జన్మనా జన్మభ్యాం జన్మభిర్వా ప్రారబ్ధభోగసమాప్తౌ సఞ్చితకర్మఫలభోగారమ్భః తత్సమాప్తౌ చ పూర్వే ప్రారబ్ధఫలభోగావస్థాయాం యత్ సఞ్చీయమానమితి వ్యవహృతం తత్ఫలస్య భోగారమ్భః। యద్వా సఞ్చితానాం శుభాశుభకర్మణాం మధ్యే యస్య పూర్వకాలికత్వం తస్య పూర్వం ప్రారమ్భః, తత్సమాప్తౌ తదనన్తరజాతస్యైవం వా క్రమేణావృత్తిః। అపి చ సఞ్చితకర్మణాం మధ్యే పౌర్వాపర్యమ-నపేక్ష్య యస్య కర్మణో బలవత్తరత్వం తస్యైవ పూర్వమారమ్భః। అథవా పీయూష-గ్రాహిన్యాయేన ఏకకాలావచ్ఛేదేన ప్రవృత్తానాం ప్రారబ్ధానామేవ కర్మణాం మధ్యే ప్రారబ్ధమపి దుర్బలం కర్మ తిరస్కృత్య బలవత్తరస్యైవ పూర్వమారమ్భః॥

కేచిత్తు బలవత్తరం సఞ్చితం పశ్చాత్-కృత్య అబలస్య సఞ్చితస్య అనారబ్ధత్వాత్ సఞ్చితానామేవ పౌర్వాపర్యవ్యతిక్రమో న ప్రారబ్ధానామ్ ఇత్యాహుః।సావకాశనిరవకాశ -నిర్ణయ-అసమ్భృత్త్యా, అసతి ప్రతిబన్ధే సర్వేషామేవ భోగ్యత్వాదఘటితఘటనైక సమ్భృతేరవిద్యాయాః కర్మసన్తతేస్తారతమ్యాగ్రహో న వైచిత్ర్యహేతురితి భావః॥

అవతారిక :- అవిద్య అనాదియే. కర్మయనునది దాని కార్యమే. ఐనను కర్మకు క్షీణించుట అనునది ఉండనేయున్నది కదా,అని ఇట్లు విచారించి, కర్మకుగాని దాని ఫలప్రదత్వమునకుగాని క్రమేణ సమాప్తి అనునది లేదని చెప్పుచున్నాడు.

ప్రతిపదార్థము:- సఞ్చితమ్=సంచితము, చీయమానం చ=సంచీయమానమును, ప్రారబ్ధమ్=ప్రారబ్ధము, (అను), కర్మ=కర్మయు, తత్ ఫలమ్=ఆ కర్మయొక్క సహజ

ఫలమును, ఏతేషామ్=వీనియొక్క, క్రమేణ+అవృత్తిః=క్రమముగ వర్తులమగుట అనునది, పూర్వమ్=ముందుగ, బలవతః అపి వా=బలవత్తరమైన దానికగునా?

**తాత్పర్యము:-** సంచితము, సంచీయమానము, ప్రారబ్ధము అని కర్మ మూడు విధములు. వీని ఫలములు గూడ మూడు విధములే. ఇవి ఆవృతమగుచుండును. ఈ ఆవృత్తిలో ఈ మూడిటిలో నేది బలవత్తరమో అది ముందునకు వచ్చును.

**వివరణము:-** జీవితమున యే క్షణమున నైనను మానవుని కర్మ మూడు విధములు. 1) ఆ క్షణమునకు ముందే ఈ జన్మలోనే చేసినది, 2) ఆ క్షణమున తాను చేయు-చున్నది. 3) జన్మించునప్పటికి పూర్వజన్మలో చేసినది. వీనిలో ఈ జన్మలో అనుభవించ-వలసియున్నది ప్రారబ్ధము. దీని ఫలరూపమైన సుఖదుఃఖముల ననుభవించుచునే, మరల కర్మలు చేయుచు ఫలానుభవమునకై స్వర్గాదులకు పోవుచు, శేషించిన కర్మతో మరల జన్మించుచు, ఇట్లీ కర్మ-భోగవర్తులము (చక్రము) తిరుగుచునే యుండును. కాలము ఒక్కటే స్రవంతియైనను భోగవ్యవహారములో భూత, వర్తమాన, భవిష్యత్తు-లనబడుచున్నట్లు భోగావస్థనుబట్టి కర్మయు మూడు విధములుగ వ్యవహరింప-బడుచున్నది. ఇట్లు జీవునకు అనుభవించక తీరని ఫలము సిద్ధమగుచునే యున్నది. బలవత్తరమేదో అది ముందుగ అనుభవమునకు వచ్చును. ఇది పుణ్యము కావచ్చును. పాపమైన కావచ్చును.

**అవతారికా:-** నను "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా" ఇతి భగవద్వచనాద్ జ్ఞానేన కర్మసమాప్తేరుక్తత్వాత్ కథం కర్మసమాప్తిర్న ఇత్యాశఙ్క్య కేషాఞ్చిజ్ జ్ఞాననాశ్యత్వే-ఽపి కేషాఞ్చిత్తు భోగనాశ్యత్వస్యైవ శ్రుత్యుక్తం న జ్ఞానేన కృత్స్నకర్మసమాప్తిరిత్యాహ-

శ్లో॥ ఉభయోర్జ్ఞానతో నాశో భోగాత్ ప్రారబ్ధకర్మణః।
క్షేత్రాగారోదరస్థానామన్నానామివ తద్భిదా ॥ 9

**వ్యాఖ్యా:-** ఉభయోరితి। పరోక్షాపరోక్షభేదేన జ్ఞానం ద్వివిధమ్। తత్ర "బ్రహ్మ అస్తి, మదుపాస్యం బ్రహ్మ" ఇతి యద్ జ్ఞానం తత్పరోక్షమ్। "బ్రహ్మ సత్యం, జగన్మిథ్యా, బ్రహ్మైవాఖిలం జగత్, ఘటాకాశమహాకాశయోరివ, నభస్థ-జలస్థచన్ద్రయోరివ జీవాత్మ-పరమాత్మనోర్నాస్తి భేదః, అతోఽహమస్మి బ్రహ్మైవ" ఇత్యాకారకం జ్ఞానమపరోక్షమ్। తయోర్మధ్యే పరోక్షజ్ఞానం జనకం, అపరోక్షజ్ఞానం తావత్ ప్రారబ్ధేతరకర్మనాశకం, ఏవం చాన్యం జ్ఞానమపరోక్షమేవ గృహ్యతే। తస్మాదుభయోః సఞ్చితసఞ్చీయమానయో-ర్నాశః బీజలోపః। ప్రారబ్ధకర్మణస్తు భోగేనైవ శాన్తిర్నాన్యథా॥

తత్ర నిదర్శనం యథా – క్షేత్రస్థితమన్నం సఞ్చీయమానం, గృహస్థితమన్నం సఞ్చితం, ఉదరస్థితమన్నం ప్రారబ్ధమ్। తత్ర క్షేత్రాగారస్థితయోరన్నయోః దానాదినా తాత్కాలికక్షయోఽపి సమ్భవతి, ఉదరస్థాన్నస్య తు భోగాత్ కాలపరిపాకాదేవ క్షయః। ఇత్థం యథాన్నస్య భిదా తథా కర్మభేదోఽపి। సఞ్చితసఞ్చీయమానయోరేవ కర్మణోర్ జ్ఞాననాశ్యత్వం నారబ్ధస్య।తథా చ "నాభుక్తం క్షీయతే కర్మ" ఇత్యాదౌ కర్మ-శబ్దస్య ప్రారబ్ధపరత్వం,'జ్ఞానాగ్నిః సర్వకర్మాణీ' త్యాదౌ సర్వశబ్దః సఞ్చితసఞ్చీయమాన-పర ఇతి మన్తవ్యమ్। అవిశేషణ కర్మభోగనాశయోరుక్తత్వేఽపి శ్రుతిస్మృతివచోబలాదేవ ఆచార్యైర్వ్యవస్థాయా ఉక్తత్వాత్ సంప్రత్యయాచ్చాప్రామాణ్యం నాశఙ్కనీయం ఇతి భావః॥

**అవతారిక :-** "జ్ఞానమను అగ్ని అన్ని కర్మలను భస్మము చేయును" అను భగవద్వచనమువలన జ్ఞానములచే కర్మసమాప్తి చెప్పబడినది కదా, మరి కర్మనాశము కాకుండుటెట్లు? అని వితర్కించి, ఒక కొంత కర్మ జ్ఞానమువలన నశించినను, మరికొంత కర్మ భోగమువలన మాత్రమే నశించును అను శ్రుతిప్రమాణముచే, జ్ఞానమువలన మొత్తము కర్మనాశము జరుగదని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము:-** ఉభయోః=రెండిటికి, జ్ఞానతః=జ్ఞానమువలన, నాశః=నాశము, భోగాత్=భోగమువలన, ప్రారబ్ధకర్మణః=ప్రారబ్ధకర్మకు, (నాశః=నాశము), తత్=అది (కర్మనశించుట), క్షేత్ర=పొలము, ఆగార=ఇల్లు, ఉదర=పొట్ట, స్థానామ్=(వీనిలో) ఉన్నట్టి, అన్నానామ్=అన్నములకు, ఇవ=వలె, భిదా=విభజనము.

**తాత్పర్యము:-** రెండువిధములైన కర్మ జ్ఞానమువలన నశించును. ప్రారబ్ధకర్మ భోగమువలన నశించును. కర్మనశించుట అనునది పొలములోనున్న అన్నము, ఇంటిలోనున్న అన్నము, కడుపులోనున్న అన్నము, ఇవి నశించుటను పోలినది.

**వివరణము:-** పరోక్షము, అపరోక్షము అని జ్ఞానము రెండు రీతులు. "బ్రహ్మమున్నది, బ్రహ్మము నాకుపాస్యము" అనునది పరోక్షము. "బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య, జగత్తంతయు బ్రహ్మమే, ఘటాకాశము – మహాకాశము, వీనిలోవలె, ఆకాశమునగల చంద్రుడు, జలములోగల చంద్రుడు, వీనిలోవలె, జీవాత్మ-పరమాత్మ అను వీనిలో భేదము లేదు, అందువలన నేను బ్రహ్మమునే" అనునిట్టి జ్ఞానము అపరోక్షము. పరోక్షజ్ఞానము జనకము. అపరోక్షము ప్రారబ్ధేతరకర్మనాశకము. సంచిత-సంచీయమాన కర్మలకు బీజలోపము. ప్రారబ్ధకర్మకు మాత్రము భోగముద్వారముననే శాంతి లేక నాశము, వేరుగా లేదు.

ఈ విషయమున నిదర్శనము - పొలములోని ఆహారము సంచీయమానకర్మ, ఇంటిలోనున్న ఆహారము సంచితకర్మ, కడుపులోని ఆహారము ప్రారబ్ధకర్మ. ఇందు పొలములోనున్నది, ఇంటిలోనున్నది కూడ దానాదుల మూలమున క్షీణించును, నశించును. కాని కడుపులోని ఆహారము కాలక్రమమున జీర్ణము కావలసినదే తప్ప మరెట్లును నశించదు కదా! అదే రీతిగా, సంచిత-సంచీయమానకర్మలు జ్ఞానమువలన నశించును. ప్రారబ్ధకర్మ అనభవించక తీరదు. "నాభుక్తం క్షీయతే కర్మ", అను నిట్టి వాక్యములలో కర్మ అనగా ప్రారబ్ధము. "జ్ఞానాగ్నిః సర్వకర్మణాం" అనునిట్టి వాక్యములలో సర్వశబ్దమున సంచితసంచీయమాన కర్మలుద్దిష్టములు.

**అవతారికా:- నను నాకృతమితి న్యాయేన,అకృతే కర్మణి ఫలానుదయతో భోగ్యాభావాదిష్టప్రాప్తిర్భవత్యేవ ఇత్యాశఙ్క్య పూర్వజన్మకృతకర్మఫలభోగస్య అవశ్యం-భావిత్వాత్ కర్మాకరణసంభవతోఽపి సఞ్చీయమానస్యోదయస్య దుర్వారత్వాద్ భోగ్యాభావోఽసిద్ధ ఇత్యాశయేనాహ -**

**శ్లో॥ పూర్వం ఫలతి దేహేఽస్మిన్ కృతమత్ర పరత్ర యత్।**
**అదృష్టత్వాద్ ద్వయోరేవ ఉత్కటమత్రైవ జన్మని॥ *10***

**వ్యాఖ్యా:- పూర్వమితి। పూర్వం పూర్వజన్మని కృతం కర్మ అస్మిన్ దేహే ఫలతి ఏతజ్జన్మ-భోగ్యం భవతి। అత్ర జన్మని కృతం యత్కర్మ తత్ పరత్ర జన్మాన్తరే ఫలతి। పూర్వజన్మ-కృతకర్మణ ఏతజ్జన్మకృతకర్మసంస్కారస్య చాదృష్టత్వాత్ అదృష్టశబ్దవాచ్యత్వాత్ శ్రుతి-స్మృతిభ్యామియం వ్యవస్థేత్యర్థః। ఉత్కటం తు కర్మ శుభమశుభమప్యేతజ్జన్మకృతం ఏతస్మిన్నేవ జన్మని ప్రారబ్ధమాక్రమ్య ఫలతి। సమాప్తిరపి ఉత్కటానుత్కటభోగావరోధేన అత్ర జన్మాన్తరే వా ఫలతి। ఉపస్థితేరస్యాదృష్టత్వాత్ నిరుక్తేరనవసరాత్ ఇతి భావః॥**

**అవతారిక:-** చేయబడినది కాదు అను న్యాయమున చేయబడని కర్మయందు ఫల-ముదయింపదు కనుక అనుభవించవలసినది లేకుండుటచే ఇష్టప్రాప్తి కలుగునే కదా, అని వితర్కించి, పూర్వజన్మలో చేసిన కర్మఫల మవశ్యమగుటవలనను, సంచీయమాన-కర్మ నిరోధింపరానిదైనందునను, కర్మచేయకుండుట సంభవమేయైనను, అనుభవింప దగినది ఉండనే ఉండును.

**ప్రతిపదార్థము:-** అస్మిన్ దేహే=ఈ శరీరమున, పూర్వం=గతించిన జన్మపు కర్మ, ఫలతి=అనుభవమునకు వచ్చును, అత్ర=ఈ జన్మలో, కృతం యత్=చేయబడినదేదో

అది, పరత్ర=రాబోవు జన్మమున, అదృష్టత్వాద్=తెలియనందువలన, ద్వయోః ఏవ= రెండిటిలోను, ఉత్కటం=తీవ్రమైనది, అత్ర ఏవ జన్మని=ఈ జన్మలోనే.

**తాత్పర్యము:-** పూర్వజన్మకర్మ ఈ జన్మలోను, ఈ జన్మకర్మ మరుజన్మలోను ఫలించును. వీనిలో తీవ్రతరమైనది ఈ జన్మలోనే అనుభవించవలసియుండును.

**వివరణము:-** పూర్వజన్మమున చేయబడిన కర్మలయొక్కయు, ఈ జన్మమున చేయబడిన కర్మల సంస్కారముయొక్కయు జ్ఞానము లేకపోవుటవలన శ్రుతులలోను స్మృతులలోను ఈ వ్యవస్థ చేయబడినదని అర్థము. ఈ జన్మమున చేయబడిన-దైనప్పటికి, తీవ్రమైన శుభాశుభకర్మ యేదైనను ఈ జన్మలోనే ప్రారబ్ధమును త్రోసిరాజని ఫలించును, అనగా అనుభవమునకు వచ్చును. కర్మ నశించుటయును అనుభవము-యొక్క తీవ్రతననుసరించియే ఈ జన్మమునగాని లేక మరియొక జన్మమునగాని ఫలించును. దీనియొక్క ఫలము తెలియరానిదైనందున విపులీకరణకు అవకాశము లేనందునను (ఈ వ్యవస్థ చేయబడినది) అని భావము.

**అవతారికా:-** నను జన్మోపలక్షితకర్మసమాప్తౌ కర్మోపలక్ష్యజన్మసమాప్తౌ వా భవేద్ ఇష్టప్రాప్తిరిత్యాశఙ్క్య జన్మకర్మణోర్జన్యజనకత్వనిర్ధారణే వినిగమనావిరహాదేకతరనాశో-ఽపి నిర్ణేతుమశక్య ఇత్యాశయేనాహ-

*శ్లో॥ జన్మమూలం చ కర్మైవ నిష్పత్తిః కర్మణాం జనేః*
*నాశోఽన్యోన్యాశ్రయాన్నాస్తి బీజాఙ్కురవదేతయోః॥* **11**

**వ్యాఖ్యా:-** జన్మమూలమితి। కృతకర్మఫలభోగార్థమేవ జన్మసమ్పద్యతే। అన్యథా అకృతాభ్యాగమప్రసఙ్గాత్। జన్మమూలం జన్మని నిమిత్తం కర్మైవ భవతి। "న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్" ఇతి భగవద్వచనాజ్జన్మని సతి పునః కర్మాన్తరోత్పత్తేః కర్మణాంనిష్పత్తిరుత్పత్తిః జనేర్జన్మత ఏవ। ఏవం చ జన్మకర్మణోః పరస్పరకారణత్వాన్నాశో బీజలోపో నాస్త్యేవ। యథా బీజాదఙ్కురోత్పత్తి స్తతః పల్లవశాఖాపత్రపుష్పఫలావయవక-వృక్షోత్పత్తిః తత్ర బీజాఙ్కురయోః అన్యోన్యాశ్రయః కైశ్చిదపి దుష్పరిహారః, ఏవం చ బీజాఙ్కురయోః యథా కార్యకారణత్వనియమో నాస్తి తథా జన్మకర్మణోరపి ఏకతరస్య కారణతా అన్యస్య కార్యతా ఇతి నియమో నాస్తి। ఇతి కారణనాశాత్ కారణనాశః కార్యనాశాత్ కార్యనాశః ఇతి నియామకానుశాసనాభావాదితి భావః॥

**అవతారిక :-** జన్మలో నిమిడియున్న కర్మసమాప్తిలో, లేక, కర్మలో నిమిడియున్న జన్మసమాప్తిలో ఇష్టసిద్ధి కలుగును కదాయని వితర్కించి, జన్మకర్మలకు జన్యజనకత్వ-సంబంధము వేదోక్తము కాకుండుటవలన, యే ఒక్కటియైన నశించునని నిశ్చయాత్మకముగ చెప్పుట అసాధ్యమనుచున్నాడు.

**ప్రతిపదార్థము:**-జన్మమూలమ్=పుట్టుకకు కారణము, కర్మఏవ=కర్మయే, చ=మఱియు, కర్మణామ్=కర్మలయొక్క, జనేః=పుట్టుకకు,నిష్పత్తిః=ఉత్పత్తికారకము,.అన్యోన్య=పరస్పరమైన, ఆశ్రయాత్=ఆధారమువలన, ఏతయోః=ఈ రెండిటికి (జన్మకర్మలకు), బీజ=విత్తనము, అంకురవత్=మొలకవలె, నాశః=నాశము, న అస్తి=లేదు.

**తాత్పర్యము:**- జన్మనుండి కర్మ, కర్మనుండి జన్మ అను పరస్పరాధారముచే ఏది మూలకారణమనునది అనిశ్చితము. చెట్టుముందా? విత్తుముందా? అన్నట్టిదే కనుక ఈ రెండిటిలో యే ఒక్కదానికిగాని నాశమున్నదని చెప్పలేము.

**వివరణము:**- కర్మఫలానుభవమునకే జన్మ. తాను చేసినది, చేయనిది, రెండును జన్మను కలిగించును. తాను చేసిన కర్మలనగా, తెలిసియో తెలియకో చేసిన పుణ్యాపాపములు. ఇట్లే విధిగా తాను చేయవలసియున్న కర్మలలో కొన్నిటిని తెలిసియో తెలియకో చేయక విడిచిన అకృతకర్మలు. ఇవి చేయని పాపము కూడ జన్మను కలిగించునదే. ఈ రెండు విధములలో నేదో యొక రీతి మానవుడెప్పుడును కర్మ చేయుచునే యుండును. శ్రీమద్భగవద్గీత (అ.3, శ్లో.5) "నహి కశ్చిత్ క్షణమపి **జాతు తిష్ఠత్యకర్మకృత్**" అనుటలోని అంతరార్థమిదియే. ఇట్లు నరుడు జన్మించి కర్మ చేయుచు, కర్మచేసి జన్మించుచు, సుడిబడి తిరుగుచుండును. జన్మ కర్మలకు పరస్పరము కార్యకారణ సంబంధమున్నది. కాని అసలు బీజము కర్మయా? లేక జన్మయా? అని తేల్చుట కుదురదు. చేయరానిది చేయుట, చేయదగినది చేయకుండుట, రెండును కర్మలే అనగా, విత్తనము నాటినందువలన మొలకవచ్చును, నాటనందువలన మొలకవచ్చును అన్నట్లైనది. మరి మొలక రాకుండుటెట్లు? సమాధాన మస్పష్టము. ఇది ఆదికార్యము, ఇది ఆదికారణము అను నిశ్చయమే లేనప్పుడు, కార్యము నశించినచో కార్యము నశించును, కారణము నశించినచో కారణము నశించును అను సూత్రమే యేర్పడదు కనుక కారణము నశించిన కార్యము నశించుననిగాని, లేక కార్యము నశించిన కారణము నశించుననిగాని చెప్పుట అశాస్త్రీయము.

అవతారికా:- జన్మకర్మగతేః కారణతాపరిభ్రమణేనాక్షయత్వం వివృణోతి -

శ్లో॥ వాసనా సూక్ష్మమూలం స్యాత్ స్థూలోత్పత్తిస్తు సూక్ష్మతః।
స్థూలతో వాసనోత్పత్తిరిత్థం జన్మ పునః పునః॥ 12

వ్యాఖ్యా:-వాసనేతి। సూక్ష్మమూలం లిఙ్గదేహకారణం వాసనైవ స్యాత్। వాసనా నామ అహమేవం స్యామ్, మమైవం స్యాదిత్యాది విషయాసక్తిరూపా అన్తఃకరణవృత్తిః। లిఙ్గ-శరీరం చ పఞ్చజ్ఞానేన్ద్రియ-పఞ్చకర్మేన్ద్రియ-పఞ్చవాయు-మనో-బుద్ధిరూపః సప్త-దశావయవకమదృష్టస్థానమ్। సూక్ష్మతో లిఙ్గదేహాత్ స్థూలదేహోత్పత్తిః। స్థూలాత్ పునర్వాసనాయాః సమ్భవః। యద్యపి వాసనాధికరణం లిఙ్గశరీరమేవ తథాపి స్థూలదేహం వినా నావిర్భావో విషయాసక్తేరిత్యభిప్రాయేణ స్థూలత్వే వాసనోత్పత్తి-రిత్యుక్తమ్। యస్మిన్ విషయే యదా వాసనోత్పద్యతే తదా తద్విషయజప్రాప్తిహేతుకం కర్మాచరణమ్। తతోఽదృష్టోత్పత్తిః। తచ్చాదృష్టం స్థూలదేహావసానే లిఙ్గదేహాన్తర్గతం సత్ స్థూలదేహాన్తరే భోగపదం భవతి। ఇత్థం పునః పునః జన్మప్రసఙ్గః। జన్మకర్మ-లిఙ్గస్థూలదేహవాసనానామాశ్రయాశ్రయిభావేన జన్మమరణలక్షణసంసారస్య దుస్తరత్వ-ముక్తమ్। విషయార్థవాసనయా భవాటవీం ప్రస్థితస్య జీవవణిజః అనేకసుఖ-దుఃఖనిదానకర్మసహాయస్య న పునరసాధారణకారణమన్తరేణ స్వాలయప్రాప్తిరితి భావః॥

అవతారిక:- జన్మకర్మల కారణత్వము ఉభయత్ర పారస్పర్యమై మారుచుండుటచేత అక్షయము.

ప్రతిపదార్థము:- వాసనా=అంతఃకరణవృత్తి, సూక్ష్మమూలమ్=సూక్ష్మస్థితిలో కారణము, స్యాత్=అగును, స్థూల+ఉత్పత్తిః+తు=స్థూలదేహముయొక్క పుట్టుక మాత్రము, సూక్ష్మతః=సూక్ష్మమునుండి, స్థూలతః=స్థూలము నుండి, వాసనా+ఉత్పత్తిః =వాసనయొక్క పుట్టుక, ఇత్థం=ఇట్లు, పునః పునః=మరల మరల, జన్మ=పుట్టుక.

తాత్పర్యము:- జీవుడు ఈ పాంచభౌతిక శరీరమును ధరించుటకు వాని లింగశరీరము కారణము. ఇది సూక్ష్మము. దీనికి కారణము వాసన, అనగా అంతఃకరణప్రవృత్తి. ఈ వాసనకు కారణము స్థూలశరీరము. ఇది పునర్జన్మచక్రము.

వివరణము:- కనబడు ఈ శరీరములో కనబడని శరీరమొకటి ఉన్నది. దానిని సూక్ష్మశరీరము, లింగశరీరము అందురు. కనబడు ఈ స్థూలదేహము జీవునకు

యేర్పడుటకు కారణము సూక్ష్మమైన ఈ లింగదేహము. ఎట్లు? వాసనలవలన. అసలు లింగశరీరలక్షణమేమి? ఇది ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, ఐదు ప్రాణములు, మనస్సు, బుద్ధి అను పదునేడు అవయవములు గలిగియుండును. ఈ అవయవము లన్నియు కనబడు ఈ స్థూలదేహమునకు నున్నవే. కాని ఇవి కన్పించు పరికరములు. వీనిలో కూడ కన్పించునవి జ్ఞానకర్మేంద్రియములు పది మాత్రమే. ప్రాణములు కనబడవు, కాని వానిని తెలియగలము. మనస్సు, బుద్ధి ఇంకను సూక్ష్మములు. ప్రాణములవలె కూడ వానిని గుర్తించలేము. ఈ స్థూలశరీర-యంత్రమును ఈ సూక్ష్మశరీరమే పనిచేయించుచుండును. ఇట్టి యంత్రము పనిచేయు చుండగా లింగశరీరమున వాసనలు ఉత్పత్తియై నిలిచిపోవును. వాసనలు అంతః-కరణప్రవృత్తులు, అనగా లోనుండి శరీరమునకు కలుగు ప్రేరణలు. వీనివలన శరీరసాధనముతో పనులు జరుగును. ఎట్లన, వీనికి గల విషయాసక్తి లక్షణమువలన. చేసిన కర్మలవలన ఈ వాసనలు పుట్టును. ఇవి స్థూలదేహము నశించగానే, లింగ-దేహమున నుండి వేరొక స్థూలదేహము పుట్టుటకు కారణమై, దానినాశ్రయించి సుఖదుఃఖానుభవములకు కారణమగుచుండును. దీనివలన పునర్జన్మలు. జన్మకర్మలకు, స్థూలసూక్ష్మదేహములకు, వాసనలకు ఇట్లు పరస్పరాశ్రయముండుటచేతనే జనన-మరణములు లక్షణములుగా గల సంసారము దాటశక్యముగానిదని చెప్పబడినది. అనేక సుఖదుఃఖకర్మవాసనలను తోడుగా తెచ్చికొని విషయాసక్తిచేత సంసారమను ఈ అరణ్యమున ప్రవేశించిన జీవుడనబడు వ్యాపారి యే అసాధారణమైన కారణమో లేకుండ మరల తన ఇంటికి చేరికొనలేడు, అని భావము.

అవతారికా:- అఖిలస్యాపి జన్మకర్మప్రవాహస్య వాసనామూలత్వాత్ తన్నాశాదిష్టప్రాప్తిః ఇతి వాసిష్ఠీం సమ్మతిం పురస్కృత్య శ్రీభగవత్పూజ్యపాదసమ్మతిదృఢీకరణాయ అన్యేషా-మపి పక్షపాతసమ్మతీరాహ-

శ్లో॥ వాసనానాశతో జన్మకర్మనాశం మనీషిణః
వాసనాయాః క్షయం కర్మనాశాదితి పరే జగుః॥ 13

వ్యాఖ్యా:- వాసనానాశత ఇతి శ్లోకచతుష్టయేన। మనీషిణో వసిష్ఠాదయో విషయాసక్త-చిత్తస్య మరణానన్తరం యస్మిన్ విషయే విశేషతోఽభ్యాసః తద్ విషయభోగాయ మాయాకల్పితం కర్మానుసారి స్థూలదేహమాశ్రిత్య ఫలమనుభవతీతి హేతోర్వాస-

నాక్షయమన్తరేణ జన్మకర్మణోః సమాప్తిః నాస్తీతి విషయాసక్తిరేవ పూర్వం త్యాజ్యా, తన్నాశజ్జన్మకర్మనాశ ఇత్యాహుః పరే ఆచార్యా యావత్కర్మప్రచారస్తావత్ పుణ్యాపాపాఙ్కు -రోత్పత్తిః, యావత్పుణ్యపాపే తావజ్జన్మనా భావ్యమ్ అతః కర్మక్షయం వినా వాసనాక్షయో నాస్తీతి కర్మసమాప్తిరేవ పూర్వం విధేయా ఇతి జగుః।

**అవతారిక:–** ఖిలముగాని జన్మకర్మప్రవాహమునకు గూడ కారణము వాసన కావున ఆ వాసన నశించుటచే ఇష్టప్రాప్తి అను వసిష్ఠసంబంధియైన సమ్మతిని పురస్కరించికొని శ్రీ భగవత్పూజ్యపాదుల సమ్మతిని ధృవీకరించుటకై అన్యులకు గూడ పక్షపాతసమ్మతి చెప్పబడినది.

**ప్రతిపదార్థము:–** మనీషిణః=పండితులు, వాసనానాశతః=వాసనలు నశించుట కారణముగా, జన్మకర్మనాశం=జన్మకర్మల నాశము, లేక, జన్మవలన కలుగు కర్మల నాశము, పరే=మరికొందరు, కర్మనాశాత్=కర్మనశించుటవలన, వాసనాయాః=వాసన యొక్క, క్షయమ్=నాశమును, ఇతి=అని, జగుః=చెప్పుదురు.

**తాత్పర్యము:–** పండితులు కొందరు, వాసన నశించినచో జన్మకర్మలు, (లేక, జన్మవలన జరుగు కర్మ) నశించునని చెప్పుదురు, మరికొందరు, కర్మ నశించుటవలన వాసన నశించునందురు.

**వివరణము:–** వసిష్ఠుదాది కొందరు పండితులు, విషయాసక్తునకు యే యే విషయము లందాసక్తియుండునో ఆయా విషయముల ననుభవించుటకు, మరణించిన తర్వాత కూడ, మాయచే కల్పించబడిన కర్మననుసరించి స్థూలదేహము నాశ్రయించి మరల జన్మించును, ఈ విషయాసక్తియే వాసన లేక సంస్కారము, ఇది సూక్ష్మమైన లింగ-దేహమును చేరి పునర్జన్మకు కారణమగును, కావున వాసన నశించకుండ జన్మకర్మలు నశించవు,ఈ కారణమున ముందుగ విడువవలసినది విషయాసక్తియే అని సిద్ధాంతము జేసిరి. మరికొందరు, కర్మయే పుణ్యాపాపములకు బీజము, కనుక ఇది ఉన్నంతవరకు జన్మ తప్పదు, జన్మతో కర్మ, కర్మతో పుణ్యాపాపముల బీజములు ఉండక తప్పదు, కనుక ముమ్ముందు కర్మనశింపు కొరకే ప్రయత్నించవలయునందురు.

తర్వాతి నాల్గు శ్లోకములలోను వాసన నశించుటే జన్మరాహిత్యమునకు సాధన మని చెప్పబడుచున్నది.

శ్లో॥ కర్మణో వాసనాయాశ్చ నాశో జన్మవినాశతః।
ద్వయోర్నాశాజ్జన్మనాశ ఇతి సమ్పన్నవాదినః॥ 14

శ్లో॥ విజ్ఞానాత్ కర్మణో నాశో విజ్ఞానాద్వాసనాక్షయః।
విజ్ఞానాజ్జన్మనాశోఽపి విజ్ఞానాత్ స్ఫూర్తిరాత్మనః॥ 15

వ్యాఖ్యా:- యావజ్జన్మ తావద్విషయాసక్తిః, యావద్విషయానురాగస్తావత్ కర్మప్రవృత్తిః తస్మాద్ యథా జన్మ న స్యాత్తథా ప్రయతేత ఇతి భాస్కరాదయో వదన్తి। సమ్పన్నవాదినో మహారాజాదయస్తు కర్మక్షయమన్తరేణ వాసనాసమాప్తేరసమ్భవాద్వాసనాసమాప్త్యన్తరం చ జన్మకారికారణాన్తరాభావాత్ జన్మసమాప్తిస్తావత్ కర్మసమాప్త్యధీనా ఇత్యాహుః। యాజ్ఞవల్క్యాదయస్తు జన్మనాశస్య వాసనానాశాధీనత్వాత్ తన్నాశస్య చ కర్మనాశాధీన-త్వాత్ స్వత ఏవ కర్మనాశస్యాసంభవాత్ కర్మ సమాప్తిం ప్రతి విజ్ఞానస్య కారణతామాశ్రిత్య మతన్తరముపేక్షన్తే విజ్ఞానాదితి। సదాకారాకారితవృత్తేరేవాత్ర విజ్ఞానశబ్దస్య వాచ్యత్వాత్ తాదృశవృత్తిమన్తరా కర్మక్షయాసమ్భవః। తస్మాత్ కర్మవాసనయోః సమాప్తిం ప్రతి విజ్ఞానస్య సాక్షాత్ కారణతా, జన్మసమాప్తిం ప్రతి పరమ్పరయా కారణతా। ఆత్మనః స్ఫూర్తిః ఆత్మబోధశ్చ విజ్ఞానస్యైవ ఫలం, తస్యైవ కృతిసాధ్యత్వావగమాద్ ఇత్యాహుః॥

ప్రతిపదార్థము:- జన్మవినాశతః=జన్మలేకుండుటచే, కర్మణః=కర్మకు, చ=మఱియు, వాసనాయాః=వాసనకు, నాశః=నాశము, ద్వయోః=రెండిటి, నాశాత్=నాశమువలన, జన్మనాశః=జన్మనశించుట, ఇతి=అని, సమ్పన్నవాదినః=సంపన్నవాదులు.

విజ్ఞానాత్=విజ్ఞానమువలన, కర్మణః=కర్మకు, నాశః=నాశము, విజ్ఞానాత్=విజ్ఞానమువలన, వాసనాక్షయః=వాసన నశించుట, విజ్ఞానాత్=విజ్ఞానమువలన, జన్మనాశః అపి=జన్మనశింపు కూడ, విజ్ఞానాత్=విజ్ఞానమువలన, ఆత్మనః=ఆత్మకు, స్ఫూర్తిః=ప్రేరణ.

తాత్పర్యము:- జన్మలేకున్న కర్మయు వాసనయు లేవు. కర్మ, వాసన లేకున్న జన్మలేదు. ఇట్లని సంపన్నవాదులందరు. విజ్ఞానము కలుగుటతో కర్మనశించును, అంతట వాసన నశించును, జన్మయును కలుగకుండును. విజ్ఞానముచే ఆత్మ ఉత్తేజితమగును.

వివరణము:- జన్మ ఉన్నప్పుడు విషయాసక్తి, దానిచే కర్మలలో జీవి ప్రవర్తించుట, కనుక జన్మ కలుగని విధమున ప్రయత్నించదగునని భాస్కరుడు మొదలగువారు చెప్పుదురు. మహారాజు మొదలగు సంపన్నవాదులేమో కర్మనశించుటకు ముందు

వాసన నశించలేదు కనుక, వాసన నశించుటకు ముందు జన్మకారణము వేరొకటి లేదు కనుకను, జన్మసమాప్తి కర్మసమాప్తికి లోబడియున్నది అని యందురు. యాజ్ఞవల్క్యుడు మొదలగువారు జన్మనాశము వాసనానాశమునకు, వాసనానాశము కర్మనాశమునకు లోబడియున్నవి కనుక, కర్మ తనంత తాను నశించదు కనుకను, కర్మసమాప్తికి మూలము విజ్ఞానమని చెప్పుదురు. విజ్ఞానమనగా సత్యసాక్షాత్కారము కనుక విజ్ఞానము కర్మను నశింపజేయును, అన్యథా అసంభవమందురు. ఇందు మూలమున, పరంపరచేత, జన్మసమాప్తికి కారణము విజ్ఞానమని తేలుచున్నది. విజ్ఞానమువలన ఆత్మ మేల్కొనును గూడ.

**అవతారికా:-** వైరాగ్యోదయం వినా జ్ఞానోదయాసమ్భవాత్ తదుదయం వినా చ వాసనాదిక్షయాసంభవాద్ వైరాగ్యమేవోత్తమమిష్టసాధనమితి నారదవామదేవాదయో వదన్తీత్యాహ -

శ్లో॥ వైరాగ్యాజ్ జ్ఞానసమ్పత్తిః వైరాగ్యాద్వాసనాక్షయః।
వైరాగ్యాత్కర్మనాశశ్చ కర్మనాశాజ్జనేర్లయః॥ *16*

**వ్యాఖ్యా:-** వైరాగ్యాదితి । వైరాగ్యం నామ విషయాత్యన్తానాసక్తి లక్షణమ్। పరోక్షాపరోక్ష-జ్ఞానోదయో వాసనాక్షయః, కర్మసమాప్తిశ్చ వైరాగ్యాదేవ జాయతే। జనేర్జన్మనో లయః సమాప్తిశ్చ వైరాగ్యాదేవేతి ఫలనిర్దేశః। జ్ఞానోదయం వాసనాకర్మసమాప్తీ చ ప్రతి వైరాగ్యస్య సాక్షాత్ పరమ్పరయా వా కారణతా చిన్తనీయా। అనన్తమహిమ పరమేశ్వరమాయాగుణలావణ్యలీలారత్నాకరం గాహమానానాం బ్రహ్మాంశానాం జీవానాం యథాదృష్ట ముపస్థితః శుక్తిశఙ్ఖప్రవాలముక్తారత్నలాభః స్వస్వపరమవినోద-హేతురేవ భవతీతి భావః॥

**అవతారిక:-** వైరాగ్యము లేకుండ జ్ఞానముదయించదు. జ్ఞానముదయించక వాసన మొదలైనవి నశించవు. కనుక ఉత్తమమైన ఇష్టసాధనము వైరాగ్యమే అని నారదుడు, వామదేవుడు మొదలగువారు చెప్పుచున్నారు.

**ప్రతిపదార్థము:-** వైరాగ్యాత్=వైరాగ్యమునుండి, జ్ఞానసమ్పత్తిః=జ్ఞానము అనబడు సంపద, వైరాగ్యాత్=వైరాగ్యమువలన, వాసనాక్షయః=వాసన నశించుట, వైరాగ్యాత్=వైరాగ్యమువలన, కర్మనాశః=కర్మ నశించుట, చ=మతియును, కర్మనాశాత్=కర్మ నశించుటవలన, జనేః=జన్మమునకు, లయః=నాశము.

**తాత్పర్యము:-** వైరాగ్యమువలన జ్ఞానము కలుగును. జ్ఞానమువలన వాసన, కర్మ నశించును. కర్మనశించగా జన్మ నశించును.

**వివరణము:-** వైరాగ్యమనగా ఇంద్రియ విషయములందు అమితమైన అనాసక్తి. ఇది కలుగగా పరోక్ష, అపరోక్షములను రెండు విధముల జ్ఞానము కలుగును. జ్ఞానము కలుగగా వాసన నశించును. దానిచే కర్మ నశించును. అంతట జన్మ నశించును. ఇట్లు జన్మరాహిత్యము వైరాగ్యమునకు ఫలమగుట స్పష్టము. జ్ఞానము కలుగుటయు, వాసన-కర్మ అనునవి నశించుటయును, వైరాగ్యమునకు దీటుగ సాక్షాత్ పరంపర కారణముగ అగునా అనునది ఆలోచించవలసిన విషయము. అనంతమైన మహిమగల పరమేశ్వరునియొక్క మాయాగుణలావణ్యముగల లీలాసముద్రమున మునుగుచున్న వారైన బ్రహ్మాంశగల జీవులకు అదృష్టము కొలది ముత్తెమో, శంఖమో, పగడమో, రత్నమో లభించుట వాని వాని పరమవినోదమునకు కారణమే అగుచున్నది, అని భావము.

**అవతారికా:-** నను లిఙ్గదేహస్య వాసనామయత్వాద్ వాసనాయాశ్చ అసార్వకాలికత్వాత్ తదభావే లిఙ్గసమాప్తౌ, తదభావే స్థూలదేహాద్యనుత్పత్త్యా సంభవతీష్టాప్తిరితి ఆశఙ్క్య కర్మక్షయాన్తరమన్తరా కాచనాపి మనోరథపద్ధతిర్న ఫలతీతి ఆచార్య సిద్ధాన్తసమ్మతి-మాహ-

శ్లో॥ పుణ్యపాపక్షయః కర్మక్షయాధీనస్తు జన్మినామ్।
పుణ్యపాపక్షయాధీనః సూక్ష్మదేహక్షయోఽన్తిమః॥ 17

**వ్యాఖ్యా:-** పుణ్యేతి। కర్మసమాప్తిమన్తరా పుణ్యపాపపరిసమాప్తిర్నాస్తి, పుణ్యపాపపరి-సమాప్తిం వినా లిఙ్గశరీరసమాప్తిర్నాస్తి। యావల్లిఙ్గశరీరం తావత్ స్వరూపప్రత్యయో దుర్లభః। అతః కర్మక్షయ ఏవ సర్వతో గరీయాన్। తస్మిన్ సతి జన్మినాం పుణ్యపాప-సమాప్తిః। తతో భోగప్రదభోగ్యయోరభావాత్ వాసనామయస్య లిఙ్గదేహస్య నాశః। స చ చరమః। తత్పదం స్వరూపసమ్పదుదయప్రతిబన్ధకపదార్థాన్తరాభావాత్। విమత-విశ్రాన్తిస్థాననిర్వృతిమన్తరా కార్యకారణభూతపుణ్యపాపాదిప్రవాహరూపేణ విద్య-మానత్వాత్ సప్తాశ్రయదేహబీజానష్ట్యా న జీవేష్టాప్తిరితి భావః।

**అవతారిక:-** లింగదేహము వాసనామయము. వాసనలు సార్వకాలికములు కావు. అందుచే వాసనలు లేకున్న లింగదేహముండదు. లింగదేహములేకున్న స్థూలదేహము

పుట్టదు. ఇట్లు జన్మరాహిత్యము కలుగునని వితర్కించి, కర్మ నశించుటకు ముందుగ మరి యే జన్మరాహిత్యపద్ధతి గాని ఫలించదను అచార్యసమ్మతిని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము:-** జన్మినామ్=జన్మించినవారికి, పుణ్యపాపక్షయః తు=పుణ్యపాపముల నశింపు మాత్రము, కర్మక్షయాధీనః=కర్మనశింపుపై ఆధారితము, అన్తిమః=చివరిదైన, సూక్ష్మదేహక్షయః=లింగశరీరనాశము, పుణ్యపాపక్షయాధీనః=పుణ్యపాపముల నశింపుపై ఆధారపడినది.

**తాత్పర్యము:-** పుణ్యపాపరాహిత్యము కర్మరాహిత్యమున జరుగునది. లింగశరీర-నాశము పుణ్యపాపరాహిత్యముపై ఆధారపడియున్నది.

**వివరణము:-** పుణ్యపాపములు జీవి చేయు కర్మనుబట్టి యేర్పడునవి. కనుక కర్మ చేసినంతకాలము జీవి పుణ్యమో పాపమో మూటగట్టుకొనుచునేయుండును. వద్దనిన్న కర్మ జీవి నంటకుండవలె. కానిచో, కర్మలవలన నేర్పడిన వాసనలు, లేక సంస్కారములతో లింగశరీరమేర్పడును. ఇట్లగుచున్నంతవరకు జీవికి తన నిజరూపము తెలియదు. అందువలన కర్మక్షయమే సాధింపదగినది. ఇదియే జన్మరాహిత్యమునకు సర్వోత్తమ మార్గము. కర్మక్షయము కాగా, జన్మించినవారికి పుణ్యపాపములనాశము, దానినుండి భోగము నిచ్చు భోగ్యవస్తువులు లేకపోవుట వలన, వాసనామయమైన లింగదేహము నశించుట. ఇది కడపటిది. ఎట్లనగా, స్వరూపసంపద ఉదయించుటకు ఆటంకమైన పదార్థము లేనందువలన. ఆటంక-పరచువానికి ఆశ్రయము నశించునంతలో కార్యకారణములైన పుణ్యపాపప్రవాహ రూపమున నుండుటవలన సప్తాశ్రయమైన దేహబీజము నష్టమై జీవికి ఇష్టప్రాప్తి కలుగునని భావము.

**అవతారికా:-** నను తర్హి పుణ్యపాపాశ్రయకర్మక్షయస్య ఇష్టసాధనత్వాత్ తత్ క్షయకర-కర్మణ్యేవ ప్రయత్నో విధేయ ఇత్యాశఙ్క్య ఇష్టాపూర్తాదివిహితకర్మణాం పాపక్షయకరత్వే ఽపి పుణ్యక్షయకరత్వాభావాత్తన్మాత్రభోగాదపి అరోహావరోహయాత్రా దుర్వారా ఇత్యాహ -

శ్లో॥ క్షయే సాధనబాహుల్యం పాపానాం నిగమోదితమ్।
ఇష్టాపూర్తార్చనాతీర్థక్షేత్రదానతపోజపాః॥ *18*

శ్లో॥ పుణ్యక్షయేఽ పి వేదోక్తే ప్రవృత్తిర్దుర్లభా నృణామ్।
స్వర్గాది సుఖహేతుత్వాత్ శేషాదిజ్యోద్భవ శ్రుతేః॥ 19

వ్యాఖ్యా:- క్షయ ఇతి। పుణ్యపాపక్షయే సతి భోగప్రదవస్త్వన్తరాభావాద్భోగక్షమదేహో నుత్పత్తౌ సమ్భవతీష్టాప్తిః తత్ర పాపానాం క్షయే క్షయార్థం సాధనబాహుల్యం శాస్త్రే వేదే ప్రతిపాదితం తదేవాహ - ఇష్టేతి। ఇష్టమగ్నిహోత్రాది। పూర్తం కూపారామాది। అర్చనా దేవపితృగురుప్రభృతీనాం పూజా। తీర్థాని గఙ్గాదీని, క్షేత్రాణి కాశీపుష్కర-ప్రభృతీని,దానాని గోదానాదీని।తపో బ్రహ్మచర్యాది ధర్మః।జపః ప్రణవవేదపాఠాదిః ఏతాని పాపక్షమకామనయానుష్ఠితాని చేత్ పాపక్షయసాధనాని। ఫలానుసన్ధానాపృక్తాని చేత్ అన్తఃకరణశుద్ధిహేతూని। స్వరూపజ్ఞానోదయే సన్నిపాత సమాప్తేరపేక్షితత్వాదేక-తరసమాప్తిర్న ప్రకృతేష్టసాధవమితి భావః।

నను పుణ్యక్షయస్యాపి ముక్తిం ప్రతి హేతుత్వే తత్క్షయకరకర్మాభావాత్ అనిర్మోక్ష-ప్రసఙ్గ ఇత్యాశఙ్క్య పాపక్షయకరకర్మవత్పుణ్యక్షయకరకర్మసత్వే అపి స్రక్చన్దనవనితాది రుచిరతరవిషయభోగలాలసానాం వజ్రప్రస్తరానుపమితహృదయానాం తత్ర ప్రవృత్త్య-భావ ఏవాత్మనో దేహాభిమానిత్వకర ఇత్యాశయేనాహ పుణ్యక్షయేపీతి। పుణ్యక్షయమన్తరేణ ముక్తేర్దుర్లభత్వాత్ పాపక్షయవత్పుణ్యక్షయోఽ పి వేదే ప్రతిపాదితః పుణ్యస్య కర్మణః క్షయో యస్మాత్తస్మిన్ పుణ్యక్షయే వేదోక్తే వేదే ప్రతిపాదితేఽ పి తస్మిన్ నృణాం ప్రవృత్తి-ర్దుర్లభా। అత్యన్తాభావాప్రదర్శనాత్పరిపక్వహృదయానాం సులభాపీత్యుక్తమ్। తత్రాప్రవృత్తౌ హేతుః పుణ్యం తావత్ స్వర్గాది సుఖసాధనం భవతి, యత్రానన్దకరం నన్దనం పీయూష -ధారా, సఙ్కల్పితపూరకః కల్పతరుః, అభిలషితపారదర్శకం పారిజాతసుమం, సన్మాన -మాననీయాని విమానాని, యత్ర నిర్జరత్వామరత్వప్రాప్తిః, ఏవంవిధస్వర్గప్రవర్తక-పుణ్యసమాప్తౌ అప్రవృత్తిర్న చిత్రమిత్యర్థః కిఞ్చ శేషాత్పుణ్యశేషాత్ ఇజ్యః ఉద్భవ ఉత్పత్తిస్తస్యాపి శ్రుతేర్వేదాదౌ శ్రవణాత్। పుణ్యశేషేణ శ్రోత్రియాదిసార్వభౌమాదిజన్మ భవతీతి శాస్త్రానుశాసనాదిత్యర్థః ఉభయత్ర సుఖప్రదవస్తుపరిత్యాగో వాస్తవార్థ-రసవిరసాః న అధికారిణో భవన్తీతి భావః।

అవతారిక:- అప్పుడు మరి పుణ్యపాపములకాశ్రయమైన కర్మనశింపునకు జన్మ-రాహిత్యమును సాధించు లక్షణమున్నందున ఆ కర్మయందే ప్రయత్నము విధి కదా అని విచారించి, విహితకర్మలకు పుణ్యక్షయకరత్వము లేదు కనుక పాపక్షయకరత్వము ననుభవించినందువలన కూడ ఆరోహావరోహయాత్ర తప్పదనుచున్నాడు.

ప్రతిపదార్థము:- పాపానాం=పాపములయొక్క క్షయే=నశింపునందు, నిగమ+ఉదితం =వేదములచే చెప్పబడిన, సాధనబాహుల్యమ్=సాధనల అనేకత్వము, ఇష్ట=అగ్ని హోత్రాదులు, పూర్త=బావులు, చెరువులు, విహారప్రదేశములు మొదలైనవి, అర్చనా= దేవ, పితృ, గురువులాది పూజ, తీర్థ=గంగానది మొదలైన పుణ్యనదీస్నానము, క్షేత్ర =కాశీ మొదలైన పుణ్యక్షేత్రదర్శనము, దాన=గోదాన, భూదానాదులు, తపః=తపస్సు, జపః=మంత్రజపము.

తాత్పర్యము:-పాపములను పోగొట్టుకొనుటకు వేదములు చాల సాధనములు చెప్పినవి. అగ్నిహోత్రాది నిష్ఠ, ప్రజోపయోగార్థము బావులు మొదలైనవి నిర్మించుట, గురువులు మొదలైనవారిని పూజించుట, గంగానది మొదలగువానిలో పర్వదినములలో స్నానము చేయుట, కాశీరామేశ్వరాది యాత్రలు చేయుట, గోదానాదులు, బ్రహ్మచర్యాది నియమములు పాటించుట, పవిత్రమంత్రములు జపించుట, ఇవి వేదవిహితములైన పాపవిమోచన కర్మలు.

ప్రతిపదార్థము:- పుణ్యక్షయే=పుణ్యము నశించుట, వేదోక్తే అపి=వేదముచే చెప్పబడిన నప్పటికిని, స్వర్గ+ఆది=స్వర్గము మొదలగు, సుఖ=సుఖములు, హేతుత్వాత్=కారణము వలన, నృణామ్=నరులకు, ప్రవృత్తిః=ప్రవర్తించుట, దుర్లభా=కష్టము, శేషాత్=పుణ్య శేషమువలన, ఇజ్యోద్భవః=పూజ్యతయొక్క ఉత్పత్తి, శ్రుతేః=వేదాదులందు వినబడును.

తాత్పర్యము:- పుణ్యము నశించు పద్ధతులు గూడ వేదముచే చెప్పబడినవి. కాని పుణ్యార్జనమువలన స్వర్గాది సుఖములు కలుగునని చెప్పబడినందున నరులు ఆ సుఖములచే ఆకర్షితులగుదురు కనుక వేదము చెప్పిన పుణ్యమును నశింపజేయు పద్ధతులలో ప్రవర్తించుట వారికి అతికష్టము. స్వర్గాదులలో అనుభవించగా మిగిలిన పుణ్యశేషము జన్మకారకమగును. పుణ్యశేషముతో జన్మించిన వారికి శ్రోత్రియులుగను, చక్రవర్తులుగను జన్మకలుగునని వేదము, శాస్త్రములు చెప్పుచున్నవి.

అవతారికా:- తత్త్వజ్ఞానోదయం ప్రతి పుణ్యపాపసమాప్తేరిష్ట సాధనత్వేఽపి కర్మ-సమాప్తిమ్ అన్తరా న పుణ్యపాపసమాప్తిరిత్యభిప్రాయేణాహ-

శ్లో॥ పుణ్యపాపాశ్రయః కర్మ హేతూ తే జన్మభోగయోః॥
బీజం కర్మైవ సర్వస్య తల్లోపోఽఖిలలోపనః॥ 20

**వ్యాఖ్యా:**- పుణ్యపాపాశ్రయ ఇతి। సదసల్లక్షణం కర్మ విహాయ పుణ్యపాపయోరనుత్పత్తేః కర్మైవ తయోరాశ్రయ ఉత్పత్తిస్థానమ్। వినా చ పుణ్యపాపే సాధనాభావాత్ భోగక్షమదేహో -నుత్పత్తిః అతస్తే పుణ్యపాపే జన్మభోగయోర్హేతూ, తస్మాత్ సంసారప్రవాహస్య బీజం కర్మైవ। కర్మలక్షణబీజసమాప్తిరఖిలానాం జన్మమరణోపలక్షితసకలసుఖదుఃఖాదీనాం లోపనో నాశకో భవతి। నిరవధిత్వస్వీకారాపేక్షయాసావధిత్వస్వీకృతేరేవ గురుత్వాదిత్యర్థః శాఖాపల్లవపత్రపుష్పఫలావయవకతరోర్మూలాశ్రయత్వాత్తదున్మూలనాదాశ్రితోన్మూలనమ్ అయత్నరకమితి భావః॥

**అవతారిక:**- తత్త్వజ్ఞానముదయించు విషయంలో పుణ్యపాపములు నశించుటకు ఇష్టసాధనత్వంలో కూడా కర్మసమాప్తిలేకుండ పుణ్యపాపములు నశించుట లేదు అను అభిప్రాయముతో ననుచున్నాడు.

**ప్రతిపదార్థము:**- పుణ్యపాప+ఆశ్రయః=పుణ్యపాపములకు ఆలంబనము, జన్మ భోగయోః=జన్మమునకును పుణ్యపాపఫలముల భోగములకును, హేతూ=రెండిటికిని కారణము, కర్మ=కర్మచేయుట, తే సర్వస్య=ఆ సర్వమునకు, బీజం=మూలకారణము, కర్మ+ఏవ=కర్మయే, తత్+లోపః=అది లోపించుట, అఖిలలోపనః=అన్నిటియొక్క లోపమును కలిగించునది.

**తాత్పర్యము:**- పుణ్యపాపములకు ఆధారము కర్మ. జన్మము కలుగుటకు, పుణ్యపాప-ఫలముల ననుభవించుటకు కారణము కర్మ. కనుక, ఈ మొత్తమునకు మూలము కర్మ. కర్మ నశించినచో ఈ సర్వము నశించినట్లే.

**వివరణము:**- సత్కర్మ, అసత్కర్మ అని రెండు లక్షణములు గలది కర్మ. సత్కర్మ-నుండి పుణ్యము, అసత్కర్మనుండి పాపము కలుగుచున్నవి. అనగా, పుణ్యపాపములు కలుగరాదనిన సదసత్ కర్మలలో నేదియు చేయరాదు. పుణ్యమో పాపమో కలుగనిది, సదసత్ కర్మలు కానిది, వేరుగ కర్మలేదు కదా! కనుక కర్మకు క్రియారూపము లేకుండవలె నన్నట్లయినది. క్రియారూపము బాహ్యదైహిక కర్మకు, ఆంతరమైన మానసకర్మకు గూడ నున్నది. ఒకటి లోక మెఱుగునది, మరియొకటి అంతరంగపతి కెఱుకపడునది. ఈ రెండును లోపించిన గాని క్రియారూపకర్మ లేనట్లు కాదు. అప్పుడిక జీవునకు తా ననుభవించవలసినది ఈ లోకముననైన పరలోకముననైన యే మున్నది? ఇట్లు భోగమునకు ఆలంబనము లేకపోవును. కనుక భోగార్థమే యేర్పడు ఈ శరీరముతో అవసరము తీరిపోవును. ఇట్లు చావుపుట్టుకలవలన నెడతెగక

సాగుచుండు సంసారమను ప్రవాహమునకు ఆదిమూలము కర్మయని తేలినది. ఈ మూలమునే త్రుంచివేయ గలిగినచో, అనగా కర్మరాహిత్యమును సాధించగలిగినచో, జన్మరాహిత్యము సహజప్రాప్తము. జన్మలేకున్న జీవునకింక సుఖదుఃఖములు, మరణము అనునవేవియు కలుగవు.

**అవతారికా:–** తస్మాత్ కైవల్యోదయస్య జ్ఞానోదయాధీనత్వాద్ జ్ఞానోదయస్య చాన్తః –కరణశుద్ధ్యధీనత్వాత్తస్యాశ్చ కర్మసమాప్త్యధీనత్వాత్ సైవ పరమపురుషార్థ ఇత్యాశయే– నాహ–

శ్లో॥ కర్మనిర్హరణం శ్రేయః పుంసాముద్దామచేతసామ్।
వైరాగ్యజ్ఞానసమ్ప్రాప్తిః కర్మనిర్హరణాశ్రయా ॥ **21**

**వ్యాఖ్యా:–** కర్మనిర్హరణమితి। అనన్తాపారదుఃఖప్రదజన్మమరణయోరభావః కథం కేన కదా స్యాత్? ఇతి ఉద్దామం బహునిర్విణ్ణం చేతో యేషాం తేషాం పుంసాం జీవాత్మనాం కర్మనిర్హరణం త్రివిధకర్మసమాప్త్యుపాయః శ్రేయః పరమకల్యాణమ్। యతో వైరాగ్యస్య ద్వివిధజ్ఞానస్య చ సమ్ప్రాప్తిః ఉత్పత్తిః కర్మనిర్హరణాశ్రయా కర్మసమాప్తిజన్యా। కర్మణి శిథిలతాం ప్రాప్తే విషయానురాగశైథిల్యోపస్థితౌ ఇష్టజ్ఞానఫలాసఙ్గాదయో వక్ష్యమాణాః స్వరూపసమ్ప్రద్భూమయః క్రమేణ ఉపతిష్ఠన్తే ఇతి భావః॥

**అవతారిక:–** ఈ కారణమువలన, కైవల్యోదయము జ్ఞానోదయమునకును, జ్ఞానోదయము అన్తఃకరణశుద్ధికిని, అదియును కర్మ సమాప్తికిని అధీనమైయున్నందున, కర్మసమాప్తియే పరమపురుషార్థమను భావముతో చెప్పబడినది.

**ప్రతిపదార్థము:–** ఉద్దామ=నిరంకుశమైన, చేతసామ్=మనస్సుగలిగిన, పుంసామ్= నరులకు (పురుషులకు), శ్రేయః=కోరదగినది, కర్మనిర్హరణమ్=కర్మను శేషము లేకుండ హరింపజేసికొనుట, వైరాగ్య=ప్రాపంచిక విషయములందనాసక్తి, జ్ఞాన=జ్ఞానసంపాదన యందు సిద్ధి, (ఈ రెండును కలుగుట), కర్మనిర్హరణ+ఆశ్రయా=కర్మను నిశ్శేషముగ నశింపజేసికొనుటపై ఆధారపడియున్నవి.

**తాత్పర్యము:–** మనస్సు నిరంకుశముగ చరించునది. కనుక అట్టి సాధారణులైన నరులకు కోరదగినది కర్మను నశింపజేసికొనుట. కర్మాసక్తివలన జ్ఞానము కలుగ కుండును. కనుక కర్మాసక్తిని విడువవలె, ఇంద్రియభోగములందాసక్తిని విడిచి జ్ఞానవంతుడగుటవలన కర్మనాశము సాధింపబడును.

వివరణము:- అంతములేని దుఃఖమును కలిగించు ఈ జననమరణములు లేకుండునట్టి స్థితి ఎట్లు? ఎవనిచేత? ఎప్పుడు సాధింపబడినది? అను ఈ ఆలోచనతో కర్తవ్యమూఢులైన నరులకు కర్మసమాప్తికి తగు నుపాయమును వెదకుటే శుభము. కర్మ అశాశ్వతము. దాని ఫలముగూడ అశాశ్వతము. దానియందాసక్తుడనగుటేల? అని ఆలోచించినప్పుడు జ్ఞానమునకు అంకురమేర్పడును. ఇది వృద్ధికాగా కర్మ-ఫలములతో అసంగ స్థితి కలుగును. అప్పుడిక సాధారణకర్మసైతము అకర్మయగును. ఇట్లు క్రమముగ కర్మ నశించును.

అవతారికా:- ఆపాతతో భిన్నత్వేన ప్రతీయమానాన్ వస్తుతః సమానార్థప్రతిపాదకాన్ అనేకాచార్యైరుపదిష్టాన్ కర్మనిర్హరణోపాయాన్ ప్రదర్శయతి -

శ్లో॥ కర్మతో యోగతో ధ్యానాత్ సత్సఙ్గాజ్జపతోఽర్థతః।
పరిపాకావలోకాచ్చ కర్మనిర్హరణం జగుః॥ 22

వ్యాఖ్యా:- కర్మత ఇతి శ్లోకచతుష్టయేన । జన్మమరణాదిలక్షణసంసారదావానల-సన్తప్తానాం సర్వథా కర్మనిర్హరణమన్తరేణ నిరతిశయసుఖసమ్ప్రాప్తేరనుదయాత్ కర్తవ్యమేవ కర్మనిర్హరణమ్। తచ్చ కథం సమ్పద్యతే? ఇత్యత్ర -

కర్మతః కర్మనిర్హారః పరమేశ్వరప్రీత్యర్థమనుష్ఠితేనేష్టాపూర్తాదికర్మణా అన్తఃకరణ-శుద్ధిద్వారా వైరాగ్యాదిసమ్పదుదయేన కర్మసమాప్తిరితి కేచిద్వదన్తి।

యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణాసవికల్పసమాధి-రూపాష్టాఙ్గయోగానుష్ఠానాదన్తఃకరణనిగ్రహే సతి విషయరతేః శైథిల్యాత్ కర్మనిర్హార ఇత్యపరే వదన్తి।

శ్రీగురూపదిష్టగణేశగౌరీభాస్కరహరిహరాదిరూపసగుణబ్రహ్మారాధన తత్స్వరూపచిన్తనలక్షణధ్యానతోఽన్తఃకరణశుద్ధిద్వారా విద్యానన్దోత్పత్త్యా కర్మనిర్హృతి-రిత్యన్యే వదన్తి।

సత్సఙ్గాత్ సతాం స్వాత్మపరమాత్మైకదృష్టీనాం సదాచారశిక్షార్పణపరాణాం విమలమనసాం సాధూనాం సఙ్గాత్ లాభాత్ పరిచర్యాతో వాన్తఃకరణశుద్ధ్యా శ్రీభగవదమలచరిత్రశ్రవణాది సమ్పదా కర్మనష్టిరిత్యపరే వదన్తి।

జపతః ప్రణవగాయత్రీవేదానాం గురూపదిష్టానాం కాలశ్రద్ధానతిక్రమణే జపనాచ్ఛుద్ధాన్తఃకరణానాం క్రమేణ కర్మనాశ ఇతి కేచిదాహుః।

అర్థతః శ్రుత్యర్థపరిజ్ఞానాన్మహావాక్యార్థపర్యాలోచనాదసదర్థపరిత్యాగేన సదర్థ-బోధనాద్వా శోధితాన్తఃకరణానాం ప్రాయో జీవో బ్రహ్మాభిన్న ఏవేతి కిఞ్చిల్లబ్ధవాసనా-నన్దానాం కర్మనివృత్తిరుదేతీతి కేచిదూచుః॥

పరిపాకావలోకాత్ పరిపాకాద్ ఘటీయన్త్రవత్ కాలచక్రక్రమమారూఢానాం జీవాత్మనాం కాలపరిణామతః మహాప్రలయే సతి స్వత ఏవ కర్మసమాప్తిరితి కే-చిదాహుః॥ అవలోకాద్యథా ఘటే దృష్టేఽస్య కర్తా కోఽపి స్యాదితి బుద్ధ్యాన్వేషణాత్ కులాలోఽవసీయతే తథా నానారూపజగదుదయస్థితిసంహృతికారకః కోఽప్య-సాధారణః పుమాన్ స్యాదితి జగదీశ్వరపర్యవసానకపర్యాలోచనాత్ కర్మక్షయ ఇతి కేచిదాహుః॥ యద్వా పరిపాకో విషయభోగపరిణామస్తదవలోకాత్ సురతాన్తే కాన్తావిలాస ఏతావానిత్యేవం రూపరసగన్ధస్పర్శశబ్దలక్షణకవిషయాణాం తత్తదవసర-ప్రాప్తభోగావసానే ఏతద్విషయభోగ ఏతాదృశః క్షణభఙ్గురపరిణామతో దుఃఖప్రదశ్చ ఇత్యాకారకపర్యాలోచనాత్ కర్మ స్వయమేవ క్షయం వ్రజతీతి పరే ప్రాహుః॥

**అవతారిక:–** చూడగనే వేర్వేరుగ తోచుచు నిజముగ సమానార్థముల ప్రతిపాదించునట్టి అనేకాచార్యులచే ఉపదేశింపబడిన కర్మనాశకములగు ఉపాయములను ప్రదర్శించు చున్నాడు.

**ప్రతిపదార్థము:–** కర్మతః=కర్మవశమున, యోగతః=యోగమువలన, ధ్యానాత్=ధ్యానమువలన, సత్+సఙ్గాత్=మంచివారితో చేరికవలన, జపతః=జపమువలన, అర్థతః=వేదార్థమును తెలియుటవలన, పరిపాక+అవలోకాత్+చ=కాలపరిపాకము నెఱుగుటవలనను, కర్మ=కర్మయొక్క, నిర్హరణం=నిశ్శేషనాశమును, జగుః=చెప్పు చున్నారు.

**తాత్పర్యము:–** కర్మవశమున, యోగవశమున, ధ్యానవశమున, సత్సంగవశమున, జపవశమున, కాలపరిపాకజ్ఞానమువలనను కర్మనిశ్శేషముగ నశించునని చెప్పుదురు.

**వివరణము:–** కర్మ నిశ్శేషముగ నశించినగాని ఈ సంసారప్రవాహమున కడ్డుకట్ట యేర్పడదు, అని ముందటి శ్లోకములు చెప్పెను కదా. ఇప్పుడా కర్మ నిశ్శేషముగ నశించుటెట్లు? అను దానికి వివిధోపాయముల నుపదేశించుచున్నాడు. ఈ ఉపాయములు మొదట చూడగనే (వినగనే) వేర్వేరుగ నున్నట్లనిపించును, కాని నిజమునకివి యన్నియు సమానార్థకములే. వీనిలో మొదటి ఉపాయము

(1) కర్మ:- కర్మచేత కర్మ నిశ్శేషముగ నశించుటేమి? కర్మయే కదా జననమరణాది సంసార ప్రవాహమునకు మూలము! అని విచారించగా, ఇక్కడ చెప్పబడిన కర్మ జీవుని బంధించు కర్మకాదనుట నిశ్చయము. కర్మ బంధహేతువు కాకుండుటెట్లు? అనగా, ఈశ్వరార్పణముగ ఈశ్వరప్రీతికై చేయబడు కర్మ బంధహేతువుకాదు అని పెద్దలు వివరింతురు. ఉదాహరణముగ, ప్రజాక్షేమమును కోరి, ఈశ్వరప్రీతిగ, ఈశ్వరార్పణమని, నిష్కాముడై (అనగా కీర్తిప్రతిష్ఠలయందు మనస్సునుంచక), నిరహంకారియై (కర్త తాను కాననియు, తాను నిమిత్తకర్తకాగా, సర్వకర్త పరమేశ్వరుడనియు జ్ఞానము కలిగి) చేసినచో లోకక్షేమంకరములగు కూపతటాకాదుల నిర్మాణము, దానములు ఇత్యాది కర్మలన్నియు జీవుని బంధించు వాసనోత్పాదకములు కాక అంతఃకరణశుద్ధిదాయకములగునని భగవద్గీత బోధించుచున్నది. కనుక అట్టి వైఖరితో నొనరింప బడిన కర్మయే ఇట ఉద్దిష్టము. ఇట్టి కర్మ జన్మను కలిగించదు కనుక, ఇది కర్మయేయైనను కర్మయొక్క ప్రాకృతికలక్షణమును తప్పుటవలన కర్మకానిదై నశించును. సర్వకర్మలను, అనగా నిత్యనైమిత్తిక కర్మలతో కలిసి అన్నిటిని, ఇదే వైఖరితో ఆచరించువానికి కర్మనిర్హరణము సాధ్యమని యొక మతము.

(2) యోగము:- ఇది రెండవ ఉపాయము. ఈ యోగస్వరూపమెట్టిది? అనగా, యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి అను ఎనిమిదంగములు కలిగినది. వీని గురించి విచారింతము -

(క) యమము: అనగా స్వాధీనమునందుంచికొనుట యని సామాన్యార్థము. దాని విపులీకరణమున, ఒక్కొక్కప్పుడు "అహింసా సత్యవచనం బ్రహ్మచర్యమకల్కతా। అస్తేయమితి పఞ్చైతే యమాఖ్యాని వ్రతాని చ॥" అని ఐదు ఉపాంగాలనే చెప్పగా, మరియొకప్పుడు "బ్రహ్మచర్యం దయాక్షాన్తిర్దానం సత్యమకల్కతా। అహింసాస్తేయ మాధుర్యే దమశ్చేతి యమాః స్మృతాః॥" అనియు, "ఆనృశంస్యం దయా సత్యమహింసా క్షాన్తిరార్జవమ్। ప్రీతిః ప్రసాదో మాధుర్యం మార్దవం చ యమా దశ॥" అనియు పాఠభేదమున పది ఉపాంగాలను చెప్పుదురు. విషయపరముగ నొక్కటే యైనను భాషాపరముగ వేర్వేరు పదములుపయోగింపబడినవి. అట్లే ఈ దశకములో మొదట జెప్పిన ఐదు ప్రధానములై మిగిలిన ఐదును వానిలో అంతర్లీనమైయున్న పర్యవసాయి-లక్షణములుగ తోచుచున్నవి. ఈ ఐదింటి లక్షణములు సంక్షేపముగ నిట్లు -

అహింస అనగా మనోవాక్ కాయకర్మలలో దేనిచేతగాని యే ప్రాణికిని కీడు చేయకుండుట, బాధ కలిగించకుండుట. సత్యవచనం అనగా మనసులో తా నెరిగిన దానినే మాటలలో రూపించుట. బ్రహ్మచర్యం అనగా స్త్రీవిషయక భోగముచే ఆకర్షితుడుగాక, భార్యయందైనను ఋతుకాలభోగమునే పొందుచు, సదా పరబ్రహ్మ-విచారమున మనస్సును చొప్పించి యుండుట. అకల్కతా అనగా నిర్మలత్వము. అస్తేయం అనగా మనసునగాని, వాక్కులలోగాని, కాయకర్మచేగాని అన్యధనము-లందాసక్తిలేక, అపహరింపకుండుట. దయ, దానము, ఓర్పు, మాధుర్యము, ప్రీతి, ప్రసాదము, మార్దవము, దమము ఇత్యాదులన్నియు వేఱుగ చెప్పబడినను, ప్రధాన-పంచకమున జేరునవే.

(గ) నియమము: తనకుదాను ఐచ్ఛికముగ యేర్పఱచికొనిన కట్టుబాటుకే నియమమని పేరు. ఇవి సాంఘిక, కౌటుంబిక, దైనందిన, రాజనైతిక, నైతిక ఇత్యాది రంగములందన్నిట కొందరు పెద్దలేర్పఱచికొని దానిని తప్పక చరింతురు. ఇట్టివి ఆధ్యాత్మికరంగమున ఆత్మసాధనకుపకరణములుగ చెప్పబడినవి పదియున్నవి: (1)తపస్సు, (2) సంతోషము, (3) ఆస్తిక్యము, (4) దానము, (5) ఈశ్వరపూజనము, (6) సిద్ధాంతశ్రవణము, (7) లజ్జ, (8) మతి, (9) జపము, (10) వ్రతము. వీనితో బాటు వర్ణాశ్రమధర్మపాలనము గూడ కర్తవ్యమని కొందఱందురు. అనగా, వ్యక్తి సంఘమున తాను యే వర్ణమునకు చెందియున్నాడో ఆ వర్ణమునకు విధించబడిన ధర్మములను, తాను యే ఆశ్రమమున (బ్రహ్మచర్య, గార్హపత్య, వానప్రస్థ, సన్న్యాస) నున్నాడో ఆ యాశ్రమమునకు విధించబడిన ధర్మములను పాలించుచుండవలె. పై జెప్పిన పదివిధముల నియమములను గూడ పాలించవలె. ఈ దశవిధనియమ-పాలనలో గూడ చాతుర్వర్ణ్యసమాజమున తా నే వర్ణమునకు చెందునో ఆ వర్ణమునకు విధించబడిన పద్ధతిలోనే ప్రవర్తించవలెనని భావము. తపస్సు, ఈశ్వరపూజనము, జపము, వ్రతము అను వీని విషయమున వర్ణాశ్రమములను బట్టి నియమపాలనలో భేదములుండును. ఫలితము మాత్ర మన్నివర్ణముల, ఆశ్రమములవారికి సమము. వీనిలో తపస్సు జ్ఞానముతో కూడిన శక్తిసాధన, కఠిననిష్ఠలతోడి ఆత్మసాధన. ధ్యానము ముఖ్యాంగము. నిష్ఠలు సాధనములు. దీని ప్రయోజనము, తపసా కల్మషం హన్తి, కల్మషమును తొలిగించికొని నిర్మలుడగుట. సంతోషము అనగా తనకు కలిగిన దానిని తృప్తితో నాస్వాదించుచు, లేని దానికై దుఃఖముగాని, అసూయగాని లేక శుద్ధమనస్కుడై యుండుట. ఆస్తిక్యము తొలుత వేదములందు విశ్వాసముంచుటగా

భావింపబడినది. క్రమేణ ఇది దైవవిశ్వాసముగ గుర్తింపబడినది. వీనితోబాటు ధర్మాధర్మములందు గూడ విశ్వాసముంచుట సంపూర్ణ ఆస్తిక్యమగును. **దానము** అనగా ధనవస్తువాహనాదు లేవియైనను ప్రతిఫలము నాశించక పాత్రులకిచ్చుట. ఇందు భగవదర్పణభావము ప్రధానము. **దీయతే అనుపకారిణే** అని, తన కెవ్వరివలన యెట్టి ఉపకారమును పూర్వము లేకుండెనో, ఇప్పుడుగాని మున్ముందుగాని యెట్టి ఉపకారము కలుగుట కవకాశములేకుండునో అట్టివారికి ఇచ్చివేయునది అని వివరణ. **ఈశ్వరపూజనము** భగవదర్చన నేమరక తన వర్ణాశ్రమములకు సరిపడునట్లు నిత్యము చేయుట. ఇది సాకారపరమాత్మను సేవించు పద్ధతి. **సిద్ధాంతశ్రవణము** అనగా, బ్రహ్మసూత్రములు, భగవద్గీత, జ్ఞానవాశిష్ఠము ఇత్యాది మహాగ్రంథములందు ప్రతిపాదింపబడిన మహావిషయ సిద్ధాంతములను తఱచు వినుచుండుట. ఇది జ్ఞానభక్తి విశ్వాసదాయకము. **లజ్జ** యనగా వినయశీలము. వాక్కునందుగాని వర్తనమునగాని తలపున గాని అహంకారము లేకుండుట, ఆడంబరము, ధూర్తత్వము లేకుండుట. **మతి** యనగా వేదవిహితకర్మలందు బుద్ధినుంచుట, వాని నాచరించుట. **జపము** అనగా యేదేనొక దేవతారూపమగు మంత్రమును శాంతమనస్కుడై నియమబద్ధముగ పలుమారు మననము చేయుట, స్మరించుట. ఇందు మొదటి సాధనస్థాయి వాచకము, అనగా మంత్రమును బిగ్గరగా పలుకుచు దానిపై మనస్సునుంచి మంత్రాధిదేవతను మనస్సున దర్శింపగోరుట. రెండవస్థాయి ఉపాంశువు. ఇచట మంత్రమును తాను మాత్రము వినగలుగునట్లు పలుకవలెను. మూడవస్థాయి మానసికము. ఇందు పెదవులు సైతము కదలక, శబ్దము బయల్వడక, మంత్రోచ్చారణము మనస్సునందే జరుగుచుండును. **వ్రతము** అనునది ఉపవాసాది దీక్షలతో కూడిన దేవతాపూజనము. ఒక్కొక్క వ్రతమున కొక్కక్క విధమగు దీక్షలు ఆచరణీయములై యుండును. ఇవిగాక సాధారణ దీక్షలు బ్రహ్మచర్య ఉపవాసాదులు గూడ పర్వదినములందు చెప్పబడినవి. ఇది సమగ్ర నియమ స్వరూపము.

**(చ) ఆసనము:** సామాన్యార్థమున ఆసనమనగా కూర్చుండుచోటు, కూర్చుండు రీతి, కూర్చుండుటకుపయుక్తమగు వస్తువు, పీట, కుర్చీవంటివి. యోగసాధన-విషయమున, స్వస్తిక, గోముఖ, భద్ర, వజ్ర మున్నగునవి ఎనుబది నాలుగు రీతులు లేక భంగిమలు ఆసనములుగ చెప్పబడినవి. ఇవి ఆరోగ్యమును కుదురుగ నుంచుటకును, వ్యాధి నిదానమునకును, వ్యాధినిరోధమున గూడ వైద్యవిధానముగ

చెప్పబడును. యోగసాధకునకు ఆసనశుద్ధి చాల ప్రాథమికాంశము. ఈ సందర్భమున ఆసనశుద్ధియనగా యోగాభ్యాసమునకు సరియగు ప్రదేశము నెన్నుకొని పులి లేక జింక చర్మమును నేలపై పఱచి తన సాధనకనువగు పద్మాసనమునో వేఱొక ఆసనమునో ఎన్నుకొని ఆ భంగిమలో నుండి ధ్యానము చేయుట.

(ఙ) ప్రాణాయామము: ప్రాణము ఉచ్ఛ్వాసనిఃశ్వాసముల ద్వారా శరీరమునకు జవమును జీవమును ప్రసాదించును. ఈ ప్రాణశక్తిని స్వాధీనపఱచికొనుటయే ప్రాణాయామము. ఇందు పూరక, కుంభక, రేచకములను మూడు ప్రక్రియలుండును. అనగా, గాలిని గుండెల నిండ పీల్చుట, పీల్చిన గాలిని క్రమముగ అధికాధిక కాలము అట్లే నిలిపియుంచుట, అట్లు నిల్పిన గాలిని మెల్ల మెల్లగా వదలుట యను ప్రక్రియలు. నాసికారంధ్రములు రెండు - ఇడ, పింగళ యనునవి - ఇవి నాడులు, కుడి ఎడమల నుండునవి. వీనిని మార్చిమార్చి గాలిని పీల్చి వదలుట కుపయోగింతురు. ఇది సాధారణ ప్రాణాయామము. విశేషముగ, ఈ ప్రక్రియలు జరుగుచుండగా ఇష్టదేవతాకమైన మంత్రమును జపించుదురు. ఇది గాక పంచ ప్రాణవాయువులను వశము జేసికొని వానిలో ప్రతియొక్క ప్రాణమునందున ఇతర నాలుగు ప్రాణములను చొప్పించి ఆ ప్రత్యేక ప్రాణశక్తిని విశేషముగ శక్తివంతము జేయుచు ఇట్లు పంచ ప్రాణములను శక్తివంతము చేయుట విశిష్టసాధన. ఇది ఆయుర్వృద్ధికరము. ఏకాగ్రతను సాధించుటలో అత్యంత ముపయోగకరము.

(ట) ప్రత్యాహారము: **విషయేషు విచలితానా మింద్రియాణాం బలాద్ ఆహరణం,** అనగా విషయభోగములందు విశేషముగ చలించుచున్న ఇంద్రియములను బలవంతముగ వాని నుండి మఱల్చి ఉదాత్త సద్విషయములయందు చొప్పించుట ప్రత్యాహారము. విషయభోగములనగా ప్రాపంచికమైన సుఖములు, ఇంద్రియ సుఖములు. ఇంద్రియములనగా కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు ఔండును. ఇవి విషయములందే అన్యమెఱుగక ప్రవర్తించుచుండును. వానిని వశవర్తులను జేసికొను సాధనయే ప్రత్యాహారము.

(డ) **ధ్యానం నిర్విషయం మనః, విజాతీయ ప్రత్యయాంతరావ్యవహితమేక చిన్తనం ధ్యానం,** ఇత్యాది నిర్వచనముల బట్టి ధ్యానమనగా మనస్సును ఒకే చింతన యందు లగ్నము చేయుట. ఇట్టి ఏకచిన్తన సగుణమైనచో ఏదేనొక దేవతామూర్తిని

మనసున నిల్పి మనసు నట్టేపట్టియుంచుట యగును, లేక నిర్గుణమైనచో పరమాత్మ-భావమున, యెట్టి మూర్తిరూపముగాని ఆధారముగాకయే, మనస్సును ఏకాగ్రము చేయుట యగును.

**(త) ధారణము: ఆత్మని మనోధారణమ్,** అనగా ఆత్మయందు మనస్సును నిల్పుట. ఈ నిల్పుటతోబాటు ఆ యాత్మ తానేయను భావమున స్థిరుడగుట.

**(ద) సమాధి:** మనస్సును లయించుట, అనగా దాని ఉనికియే లేదు అను పర్యంతము తాను యే మూర్తిని, లేక, యే భావమును ధారణచేసి ధ్యానించునో ఆ మూర్తితో, లేక, ఆ భావముతో తాదాత్మ్యము నొంది ఆనందమనుభవించుట. ఇది సవికల్పము లేక సవితర్కము అనగా సమాధిస్థితియందు ధ్యేయవస్తుజ్ఞానము భాసించు -చుండును. అవికల్పమునందు ధ్యాత, ధ్యేయ, ధాన్యములు ఒక్కటేయగుచు ధ్యాతకు తనను గురించి గాని, ధ్యేయవస్తువును గురించిగాని, తాను ధ్యానించుచున్నాననిగాని జ్ఞానము భాసించని విశుద్ధానందము కలుగును.

ఇది సమగ్ర యోగస్వరూపము. ఈ అష్టాంగములు సాధకుని క్రమపరిణామ-సిద్ధములు. వీని సాధనమువలన గూడ కర్మ నిశ్శేషముగ నశించునని కొందరి మతము. వీనిలో చేరినవే యైనను ధ్యానము, జపము ప్రత్యేకముగ చెప్పబడినవి.

**(3) ధ్యానము:-** గణేశుడు, గౌరి, భాస్కరుడు, విష్ణువు, శివుడు మొదలగు రూపములు గల సగుణబ్రహ్మోరాధనము, వారి రూపచింతనము, లక్షణముల ధ్యానించుట ద్వారా అంతఃకరణశుద్ధిని సాధించి, దాని ద్వారా జ్ఞానానందము ననుభవించుటవలన కర్మ నిశ్శేషముగ హరించునని మరికొందరి మతము. కాని ఇది యంతయు గురూపదేశము మూలముగ జరుగవలయును.

**(4) సత్సంగము:-** సత్+సంగము. సత్ అనగా మంచిది, ఉత్తమమును ఉదాత్తమైనది అని యొక అర్థము. సత్ అనగా సత్యమని వేరొక అర్థము. నిజమునకు, సత్యము ఉత్తమము, ఉదాత్తము. తద్భిన్నమైనది సత్ అనరానిదే. కనుక ఫలితార్థమొక్కటే. అట్టి ఉత్తమ, ఉదాత్త సత్యవిషయములందు, దాని నారాధించు సత్పురుషులందు, వారి సదాచారములందు తగులముగలిగి యుండుట సత్సంగము. దీనివలన గూడ అంతఃకరణశుద్ధి లభించును.

**(5) జపము:-** గురువులుపదేశి ్చిన ప్రణవమంత్రమునుగాని గాయత్రినిగాని వేదమంత్రములను గాని కాలము ి అతిక్రమించకుండ, అనగా సకాలమున, శ్రద్ధాళువై దినదినమును జపించుటచేత అం ఃకరణము శుద్ధమగునని కొందరందురు.

**(6) అర్థము:-** వేదార్థము నెఱుగు టవలన, మహావాక్యములను పర్యాలోచనచేయుట ద్వారా అసదర్థములను, అనగా వేదము సముద్దేశించని అర్థములను, భావములను పరిత్యజించుటవలన, సదర్థమును సాధించుటవలనను అంతఃకరణము శోధింపబడినదై తన్మూలమున జీవుడు బ్రహ్మమే అను కించిద్వాసనానందము కలిగి దాని నుండి కర్మనిర్హ్వణము జరుగునని కొందఱందురు.

**(7) పరిపాకావలోకము:-** పరిపాక మనగా కాలపరిణామము. జీవుడు కాలయంత్రము నెక్కియున్నవాడు. కాలము బావిలో నుండి నీరు తోడుట కుపయోగింప బడు చక్రము. జీవి యనగా నీరు తోడితెచ్చుపాత్ర. పరిణామ మనగా ఈ పాత్రను బావిలోతుల నుండి నీటితో సహ పైకిలాగు త్రాడు. కనుక కదలుచున్న కాలము జీవుని జన్మానుభవపరిణామఫలముగ సహజముగనే కర్మిష్ఠిని జేసి, జ్ఞానిని జేసి, నిష్కామిని జేసి, ఆత్మద్రష్టను జేసి బ్రహ్మానందానుభవమునకు యోగ్యుని చేసి, ఇట్లు పరిణామక్రమమున జీవుని కర్మను నిశ్శేషముగ ఉన్మూలించి జన్మరాహిత్యమునకు దారితీయునని కొందఱందురు. కుండను చూచి, దాని రూపాదులను విచారించి, దానిని చేసిన కుమ్మరి యొకడున్నాడని గ్రహించినట్లు బుద్ధితో అన్వేషించి ఈ భిన్నరూపజగత్తు సృష్టికిని, స్థితికిని, లయమునకును కర్తయైన అసాధారణపురుషుడొక డున్నాడని నిశ్చయబుద్ధి కలిగి తన్మూలమున జగదీశ్వరుని వెదకి పట్టుకొను ప్రయత్నముతో కర్మక్షయమును జీవుడు సాధించునని మరికొందఱందురు. పరిపాక మనగా ఇంద్రియవిషయానందమని అర్థముజేసి ఇంకను కొందఱు, సంభోగ-శృంగారమునకు పిమ్మట జీవుడెట్లు కాంతావిలాసవిభ్రమముల విలువ నెఱుగునో అట్లే ఇంద్రియము లందించు భోగములనుభవించిన మీదట నిదియంతయు క్షణికసుఖమును శాశ్వతదుఃఖమును కూర్చునదేయని క్రమముగ తెలిసికొని, విముఖుడై ఈశ్వరోన్ముఖుడై కర్మనిర్హరణమును కలిగించికొనునందురు.

కర్మనాశమునకు చెప్పబడిన ఈ యేడుపాయములును కొంత కొంత భిన్నముగ తోచినను ఫలరూపమున నొక్కటే, ఒకదానికొకటి అంతర్వ్యాపారములే యని పద్మపాదాచార్యులందురు.

**అవతారికా:-** నను యత్కరోషీత్యాది భగవదుక్త్యా బ్రహ్మణి సమర్పణాత్ కర్మనాశో నిర్వివాద ఇత్యాశఙ్క్య, సఞ్చీయమానస్యైవ భగవదర్పిత కర్మనాశ్యత్వం నేతరయో-రిత్యభిప్రేత్య దర్శయతి -

శ్లో॥ క్షయః సఞ్చీయమానానాం కర్మణామర్పణాత్పరే ।
న ద్వయోరుభయోర్ జ్ఞానాద్ భోగాత్ప్రారబ్ధకర్మణః॥ 23

వ్యాఖ్యా:- క్షయ ఇతి । ఉక్తత్రివిధకర్మణాం మధ్యే సఞ్చీయమానానాం కర్మణాం తజ్జన్యానాం పుణ్యపాపలక్షణఫలానాం వా పరే పరమేశ్వరేఽర్పణాత్ 'ఇదం మత్కృతం కర్మ పరమేశ్వరార్పణమస్తు' ఇత్యాకారకసఙ్కల్పాత్ క్షయో నిర్బీజత్వమ్। ద్వయోః సఞ్చితప్రారబ్ధకర్మణోరర్పణాన్న క్షయః అతీతావశ్యభోక్తవ్యయోః అర్పణాసమ్భవాదిత్యర్థః జ్ఞానాదుభయోః సఞ్చితసఞ్చీయమానయోః క్షయః సమాప్తిః ప్రారబ్ధస్య తు భోగాదేవ క్షయః ఏవం సఞ్చీయమాన కర్మణః పరమేశ్వరార్పణనాశ్యత్వం, సఞ్చితసఞ్చీయమాన -యోశ్చ జ్ఞాననాశ్యత్వం,ప్రారబ్ధస్య గత్యన్తరానుక్తత్వాద్భోగమాత్రనాశ్యత్వముక్తం భవతి॥

**అవతారిక:-** "యత్ కరోషి..." అను నిట్టి భగవద్వచనమువలన బ్రహ్మమునందు సమర్పింపబడుటవలన కర్మనాశము నిర్వివాదము కదా అని విచారించి, భగవదర్పిత-మైనందువలన సంచీయమానకర్మము మాత్రమే నశించునుగాని ఇతర కర్మలు కావని అభిప్రాయపడి ప్రదర్శించుచున్నాడు.

ప్రతిపదార్థము:- పరే=ఈశ్వరునందు, అర్పణాత్=అర్పించుటవలన, సఞ్చీయ మానానాం కర్మణాం=సంపాదించికొనబడుచున్న కర్మలకు, క్షయః=నాశము, న ద్వయోః=రెండిటికి కాదు, జ్ఞానాద్=జ్ఞానమువలన, ఉభయోః=రెండిటికి, భోగాత్=అనుభవమువలన, ప్రారబ్ధకర్మణః=ప్రారబ్ధకర్మకు.

**తాత్పర్యము:-** ఈశ్వరార్పణమువలన సంచీయమానకర్మ నశించును, సంచితము కాదు. జ్ఞానమువలన సంచిత సంచీయమానములు రెండును నశించును. ప్రారబ్ధము మాత్రము అనుభవమువలననే నశించును.

వివరణము:-కర్మలు మూడు విధములని చెప్పబడినవి. అవి, సంచిత, సంచీయమాన, ప్రారబ్ధములనబడు మూడు. వీనిలో సంచీయమానకర్మలకు, "నాచే చేయబడిన ఈ కర్మ పరమేశ్వరునియందు అర్పింపబడినదగుగాక!" అను రూపముగల సంకల్పము-వలన, ఈ కర్మలకు వాని పుణ్యపాపముల లక్షణముగల ఫలములకు బీజనాశము

కలుగును. కాని ఇట్టి అర్పణముచే సంచితసంచీయమానకర్మలు రెండిటికి బీజనాశము కాదు. కారణము, గడచిపోయిన కర్మల ఫలము, అనగా గతజన్మలలోని కర్మల ఫలము అవశ్యభోక్తవ్యమే గాని అర్పణయోగ్యముగాదు. జ్ఞానాగ్నియందు సంచిత, సంచీయమానములు రెండును బీజనాశమును పొందును, అనగా గత జన్మల కర్మలు, ఈ జన్మలోని కర్మలు, రెండును నిష్ఫలములు, నిర్బీజములు కాగలవు. ప్రారబ్ధకర్మకు మాత్రము అనుభవించుటచే గాక వేరొక గత్యంతరము చెప్పబడలేదు కనుక, దాని ఫలము ననుభవించక అది తీరదు. గత్యంతరము చెప్పబడలేదు అనగా వేదోక్తము కాదు అని భావము. ప్రమాణము వేదమే కదా!

అవతారికా:- అనర్పణాదపి కర్మనిర్హార ఇతి మతాన్తరం దర్శయతి -

శ్లో॥ అనర్పణాదసఙ్కల్పాదకృతేః పరభావతః।
కర్మనిర్హరణం ప్రాహుః సాఙ్ఖ్యమార్గవిచిన్తనాత్ ॥ 24

వ్యాఖ్యా:- అనర్పణాదితి । కాలతః స్వభావతో వా ప్రాప్తం కర్మ కర్తవ్యం, అర్పకార్పణ అధిష్ఠానయోర్జీవబ్రహ్మణోరేకత్వాదేకస్యైవాధికరణకర్తృభావాసంభవాత్ సేవ్యసేవకభావే భేదస్య ప్రతీయమానత్వాదర్పణాపేక్షయానర్పణమేవోత్తమమ్ ఇత్యవధూతసంమతాద-నర్పణాత్ సఞ్చితసఞ్చీయమానయోర్ధ్వంస ఇతి కేచిదాహుః।

కర్మ కర్తవ్యమితి శ్రద్ధాబుద్ధ్యా స్నానసన్ధ్యోపాసనాదినిత్యనైమిత్తికకర్మ కర్తవ్యమ్। ఏతస్మాత్కర్మణ ఇదం ఫలముత్పత్స్యతే, తత్ఫలభోగాయ స్వర్గాదౌ గన్తవ్యమిత్యాద్యను-సన్ధానం సఙ్కల్పః, తదచిన్తనాత్ కర్మసమాప్తిరిత్యపరే వదన్తి।

అన్యే తు అకృతేః పఙ్కప్రక్షాలనన్యాయేన కృతే కర్మణి ఫలభోగభియా అర్పణా-నర్పణవిధేరపేక్షితత్వాదకృతే కర్మణి శుభాశుభయోరనుత్పత్త్యా సుఖాసుఖభోగాభావే హర్షశోకలక్షణవృత్త్యభావాదానన్దావాప్త్యా కర్మసమాప్తిరిత్యూచుః।

అపరే తు పరభావతః పరస్య పరమేశ్వరస్య భావనయా కర్మకర్తాపి ఈశ్వరః ఫలభోక్తాపీశ్వరో, నాహం కర్తా భోక్తావేతి అహం ప్రత్యయవిషయీకృతసాక్ష్యన్తర్యామిణః కర్మకర్తృత్వఫలభోక్తృత్వారోపబుద్ధ్యా ప్రారబ్ధేతరకర్మణః క్షయ ఇతి బ్రువతే।

ఇతరే తు సాఙ్ఖ్యమార్గచిన్తనాత్ । పూర్వమీశ్వరో నిర్గుణో జ్యోతిః స్వరూపః తదనన్తరం తస్యైవ "ఏకోఽహం బహు స్యామ్" ఇతీచ్ఛయా త్రిగుణలక్షణా మాయా

ఉపస్థితా, తస్యాం చైతన్యచ్ఛాయాపాతేన మహత్తత్త్వసంభవః, తతస్త్రివిధ అహంకారః తమోఽధికాత్ తస్మాత్క్రమేణశబ్దాకాశ - స్పర్శవాయు - రూపవహ్ని - రసజల - గన్ధపృథివీనాముత్పత్తిః రజోఽధికాదహఙ్కారాత్ పఞ్చజ్ఞానేన్ద్రియపఞ్చకర్మేన్ద్రియ సంభవః సత్త్వ గుణోద్రేకాదహఙ్కృతేరన్తఃకరణస్య ఏకాదశేన్ద్రియాధిష్ఠాతృదేవతానాం చావిర్భావః తతః పఞ్చీకృతభూతసఙ్ఘాత్ చతుర్విధజీవవిహారాలయ బ్రహ్మాణోత్పత్తిః ఏవమూర్ణనాభలీలస్య భగవతః విహారాన్తే పునః సంహారేచ్ఛాయాముత్పన్నాయాం ప్రాణినః ప్రాణేషు లీయన్తే ప్రాణా, అన్నేఽన్నం పృథివ్యాం, సా గన్ధే, స జలే, తద్రసే, సోఽగ్నౌ, స రూపే, తద్వాయౌ, స స్పర్శే, స ఆకాశే, స శబ్దే, స తామసాహమి, ఇన్ద్రియాణి రాజసాహమి, సాన్తఃకరణతదధిష్ఠాతృదేవాః సాత్త్వికాహమి, తత్సన్నిపాతో మహత్త్త్వే, తన్మాయాయాం, సా బ్రహ్మణి లీయతే, పునరేకమద్వితీయం బ్రహ్మైవేతి సాఙ్ఖ్యమార్గః, తస్య విచిన్తనాత్ ప్రత్యహం భావనాత్ కర్మబన్ధాత్ ప్రముచ్యతే ఇత్యాహుః

యద్వా సాఙ్ఖ్యమార్గః ప్రకృతిః కర్త్రీ పురుషః పుష్కరపలాశత్ నిర్లేపః, న కర్తా, న భోక్తా, న సుఖీ, న దుఃఖీ ఇత్యుపాసనామార్గస్తస్య విచిన్తనాత్ కర్మశాన్తిరిత్యలం విచిత్రశక్తి పరమేశ్వరవిభూతీనాం విచిత్రమతీనామృషీణాం ఉక్తయోఽపి విచిత్రేత్యాహుః ॥

**అవతారిక:-** అనర్పణమువలనను కర్మనిర్హారమను మతాంతరము చెప్పబడుచున్నది.

**ప్రతిపదార్థము:-** అనర్పణాత్=అర్పించకుండుటవలన, అసఙ్కల్పాత్=సంకల్పించ కుండుటవలన, అకృతేః=చేయబడకుండుటవలన, పరభావతః=ఈశ్వరుని భావించుట వలన, సాఙ్ఖ్యమార్గవిచిన్తనాత్=సాంఖ్య మార్గమున ఆలోచించుటవలన, కర్మనిర్హరణమ్ =కర్మనాశమును, ప్రాహుః=చెప్పుదురు.

**తాత్పర్యము:-** కర్మఫలము నర్పించకుండుటవలనను, కర్మఫలము ననుభవించవలెనని సంకల్పించకుండుటవలనను, కర్మ చేయకయే ఉండుట వలనను, ఈశ్వరభావములో కర్మచేయుటవలనను, సాంఖ్యదర్శనపద్ధతి ననుసరించుటవలనను, కర్మ నిశ్శేషముగ నశించునందురు.

**వివరణము:-** సంచిత, సంచీయమానములను రెండు విధముల కర్మల నిశ్శేషనాశమే ఇచట చర్చింపబడుచున్నది. ఇవి నిర్బీజము లెట్లగును? అనగా, ఫలోత్పత్తి లేకుండు టెట్లు? అనునది చర్చ. కర్మ ఉండియు, దానికి ఫలోత్పత్తి లేకుండుటకు ఐదు

కారణములు చెప్పబడుచున్నవి, (1) అనర్పణము, (2) అసంకల్పము, (3) అకృతి, (4) పరభావము, (5) సాంఖ్యమార్గమునందు విశ్వాసము. ఇవి యైదును వేర్వేరుగ ప్రతిపాదించబడినవి. ఇందు -

**(1) అనర్పణము:-** అర్పించకుండుట అని ఈ పదమునకర్థము. ఈ సందర్భమును బట్టి, ఇచ్చట కర్మఫలము నర్పించకుండుట యను నర్థము గ్రాహ్యము. అనర్పణమునకు కారణమేమి? అనగా, కాలవశముననో లేక స్వభావవశముననో జీవునకు కర్తవ్యమైనది కర్మ అనుభావము మూలము. ఆ యా కాలములందు ప్రదేశములందు తత్తదాచారవ్యవహారానుసారము సిద్ధించు కర్మయొకటి, స్వభావము చేత, అనగా తన జన్మావరణమును, జన్మతః తనదైన గుణనిష్ఠానుసారము తాను చేయకుండలేని కర్మ మొకటి, ఈ రెండును కర్తవ్యకర్మలు, అనగా చేయక తప్పించికొనలేని కర్మలు. జీవుడు తన దేశమిది యని, కాలమిది యని, కుటుంబమిది యని భావించకుండ లేడు. కనుక దేశకాలాదులు వాని ఆలోచనలను ప్రభావితము చేసియే తీరుని కనుకను, మనో వాక్ కాయ కర్మలు ప్రతి జీవికి జన్మచే యేర్పడియే యున్నవి. ఇవి కర్తవ్యములు. ఇట్లే ప్రతి జీవికిని తనదైన గుణప్రాధాన్యముండియే యున్నది. సత్త్వగుణప్రధానుడు సాత్త్వికుడు గాక, సాత్త్వికకర్మలు చేయక మనలేడు. రాజసికుడు, తామసికుడు గూడ నిట్లే తమ కర్మలకొక పరిధిని స్వభావసిద్ధముగ తామే యేర్పఱచికొని యుందురు. వారి వారి కవి తప్పించికొనరాని కర్మలు. ఇట్టి కర్మల ఫలములను కర్త ఈశ్వరార్పణమని, ఈశ్వరునకు వాని భోక్తృత్వాధికారము నర్పించునప్పుడు, భోక్తయగు ఆ దేవుడును కర్తయగు ఈ జీవుడును ఒక్కరేయను తత్త్వార్థమున, సేవ్యసేవకభావమునందు తత్త్వార్థవ్యతిరేకముగ ఇర్వురును వేఱె యను భావము ప్రస్ఫుటము కనుక, అర్పణము కంటె అనర్పణమే మేలు అని అవధూతమతము. ఈ భావమున, అనగా కర్తవ్యకర్మలాచరించుచు కర్తవ్యభావముననే మనసునుంచి, ఫలమర్పింపవలెనా? లేదా? యను డోలాయమానస్థితి లేకుండ స్థిరుడైనవాడు అవధూత. ఇట్టి వాని కర్మలు నిర్జీవములై కర్మనిశ్శేషముగ నశించునని కొందఱందురు. ఇట్లు అనర్పణమునకు **అసంకల్పము** తోడు. సంకల్పమనగా, ఈ సందర్భమున, కర్తవ్యమైన కర్మను చేయుచు, ఇదివో ఈ కర్మచేయుటవలన ఈ ఫలము కలుగును, ఇట్లు కలిగిన ఫలము ననుభవించుటకు స్వర్గాది లోకములకు నేను పోవలసియుండును, అను నిట్టి జ్ఞానమున కలుగు ఫల, ఫలభోగస్పృహ. ఇట్టి స్పృహయే లేనిచో కర్మ కేవలము కర్తవ్యభావముననే స్థిరము. ఇందు

కర్తృభావముసైతము కనరాకుండుట గమనార్హము. ఇట్టి అసంకల్పము ఫలోత్పత్తిరహితకర్మకాలవాలము, కనుక కర్మనిర్హరణ సాధకమని కొందఱి భావము. కర్మచేయుట ఉన్నచో, ఫలభోగముండును. ఇది సిద్ధము. కర్మయే లేనిచో శుభాశుభ-ఫలములుండవు. ఇదియు సిద్ధమే. ఫలోత్పత్తిలేదు. అందువలన వీని కతీతమగు శాశ్వతానందము కలుగును. అనగా, కర్మచేసి, దాని ఫలమును సుఖాసుఖరూపమున అనుభవించక తప్పదను భయముచే, ఆ ఫలమును వదిలించికొనుటకై తదుచిత కర్మలు చేయుట కంటె, అసలు కర్మ చేయకేయున్నచో కర్మసమాప్తి స్వభావోక్తియే కదా! అని తలచి కర్మచేయకుండుట అకృతి. ఇందువలన కూడ కర్మ నిశ్శేషముగ నశించునని మఱియు కొందరందురు. ఇది అడుసు త్రొక్కనేల? కాలు కడుగనేల?, Prevention is better than cure అను వైఖరి. దీనినే పఙ్కప్రక్షాలనన్యాయ మందురు. బుద్ధిజీవియగు మానవునకైనను, యోగికైనను కర్మయే చేయకుండుట అసాధ్యము కదా! ఎవడును ఒక్క క్షణమైనను కర్మచేయక ఉండలేడనునది గీతావాక్యము కదా! అని విచారించగా, సాధారణ ప్రాణికర్మలు గాక విశేషకర్మలిచట నుద్దేశించబడినవని తోచును. ఇక మరికొందరు, ఈశ్వరుడే కర్మ, ఈశ్వరుడే కర్త, ఈశ్వరుడే భోక్త, ఇందేదియు నేను కానను విశ్వాసముతో జీవి తనలోని అహంకార-భావసాక్షియైన అంతర్యామికే కర్మకర్తృత్వమును, ఫలభోక్తృత్వమును అర్పించి, అందువలన కర్మక్షయమును సాధించ వచ్చును అని యందురు. ఇది పరభావము, పరుడు కాని జీవునియందు పరుడని బుద్ధిజేయుట. ఇప్పటికి చెప్పబడిన ఈ నాల్గు మార్గములును సంచితకర్మను, సంచీయమానకర్మను హరించునే కాని ప్రారబ్ధకర్మను హరించలేవు. ప్రారబద్ధకర్మ మాత్రము ఫలానుభవము ద్వారముననే నశించునని ముందే చెప్పబడినది. ఇక నైదవది సాంఖ్యమార్గము. అదేమి? యన, సృష్టికి ముందు ఈశ్వరుడు నిర్గుణుడైన జ్యోతిస్వరూపుడు, తదనంతరము అట్టి ఈశ్వరునిదైన "నే నొక్కడను, మిక్కిలిగ నౌదును" అను కోరికచే గుణత్రయలక్షణ యైన మాయ యేర్పడెను, ఈ మాయయొక్క చైతన్యచ్ఛాయపడుటవలన మహత్తత్త్వము యేర్పడెను,దాని నుండి మూడు విధములైన(వైకారికాహంకారము, తైజసాహంకారము, భూతాద్యహంకారము అనునవి) అహంకారమేర్పడెను, తమోగుణాధిక్యమువలన ఈ అహంకారమునుండి క్రమముగ శబ్దప్రాధాన్యముగల ఆకాశము, స్పర్శప్రాధాన్యముగల వాయువు, రూపప్రాధాన్యముగల అగ్ని, రసప్రాధాన్యముగల జలము, గంధప్రాధన్యముగల భూమి అనునవి జనించినవి, రజోగుణాధిక్యముగల అహంకారమువలన

పంచజ్ఞానేంద్రియములును, పంచకర్మేంద్రియములును సంభవించినవి, సత్త్వ-ప్రధానమైన అహంకారమునుండి అంతఃకరణముయొక్క, ఏకాదశేంద్రియముల కధిష్ఠాతలైన దేవతలయొక్కయును ఉద్భావమయ్యెను, అపై ఇట్లు ఐదైదుగా చేయ-బడిన (పఞ్చీకరణమ్) భూతసంఘమునుండి నాలుగు విధములైన జీవవిహారాలయ మగు బ్రహ్మ పుట్టుకయు, ఇట్లే భగవంతుని సాలీడు వైఖరిదైన (ఎట్లు సాలీడు తన నాభి నుండి దారమును వెలువరించి దానితో గూడు నల్లికొనియుండునో అట్టి లీలగా) ఈ సృష్టి విహారాంతమునందు మరల భగవంతుని సంహారేచ్ఛయందు, పుట్టిన ప్రాణుల యొక్క ప్రాణములు వాయువున, అన్నము అన్నమైన పృథివి-యందును, అది గంధమున, అది జలమున, అది రసమున, అది అగ్నిలో, అది రూపమున, అది వాయువులో, అది స్పర్శలో, అది ఆకాశములో, అది శబ్దములో, అది తామసాహంకారములో, ఇంద్రియములు రాజసాహంకారములో, అది అంతః-కరణముతో చేరిన అధిష్ఠానదేవతలతో కలిసి సాత్త్వికాహంకారములో, ఈ మొత్తము మహత్తత్త్వములో, అది మాయలో, అది బ్రహ్మములో లీనమై, మరల రెండవది లేని కేవల బ్రహ్మము ప్రతిష్ఠితమగుననుట సాంఖ్యమార్గము. ఈ మార్గమున సంపూర్ణ విశ్వాసము కలిగి, దానినే ప్రతిదినము భావించుటవలన గూడ కర్మబంధము తొలిగి పోవునని చెప్పుదురు. అనగా, ప్రకృతియే కర్త లేక కర్త్రీ, పురుషుడు (అనగా ఈశ్వరుడు) నీటిలోని పద్మము నీటి నంటక యున్నట్లుండువాడు, కర్తయుగాడు, భోక్తయుగాడు, సుఖియుగాడు, దుఃఖియును గాడు, అను నిట్టి ఉపాసనాపద్ధతి మనసుకెక్కియుండుట వలన కర్మవికారము శాంతించుననుటే పరమేశ్వరుని విభూతులయొక్క విచిత్రశక్తికిని, విచిత్రమతులైన ఋషులయొక్క వాక్కులకును చాలునని చెప్పుదురు.

అవతారికా:- కర్మక్షయకామానాం మననశీలానాం దైవ్యా మాయయా స్వస్వసిద్ధాన్త-రక్షాపరాణాం మునీనామప్యసాధారణకర్మనిర్ధారణోపాయానవగత్యా కర్మపరిపాకఫల-భోగసమాప్తిమార్గోఽతిగహన ఇత్యాశయేనాహ -

శ్లో॥ మునీనాం మతవైచిత్ర్యాత్ పరమార్థావిభావనాత్,
*కాలకర్మగుణక్రాన్త్యా గహనా కర్మణో గతిః॥* 25

వ్యాఖ్యా:- మునీనాం సనకవసిష్ఠభృగుయాజ్ఞవల్క్యనారదప్రభృతీనాం మతవైచిత్ర్యాత్ కర్మతో యోగతో ధ్యానాదిత్యాదిమతానాం వైచిత్ర్యాద్ భిన్నార్థదర్శనాత్ కర్మణః

త్రివిధస్యాపి క్రియాకలాపస్య గతిః సఞ్చితమేతావదేవ ఈదృశమేవ, ప్రారబ్ధం చైతావదేవేదృశమేవ అతఃపరం క్రియమాణకర్మఫలమేతాదృశమేవ భావీతి పరిజ్ఞానం గహనా నిర్వక్తుమశక్యా। కిఞ్చ పరమార్థస్యోపనిషత్ప్రతిపాదిత-అర్థస్య అవినాభావాత్ కర్మపరత్వోపాసనాపరత్వబ్రహ్మపరత్వశేషత్వ శేషిత్వాది-అపర్యాలోచనాచ్చ కర్మ-గతిర్గహనా ।

అపరం చ, కాలకర్మగుణాక్రాన్త్యా చ। కే చిన్మృతా జాయన్తే, కేచిజ్జన్మానన్తర-మేవ మ్రియన్తే, కేచిద్బాల్యే కేచిత్కౌమారే కేచిద్యౌవనే కేచిద్వార్థకే ఏవం కాలాక్రాన్తిః కాలాధీనత్వమ్। యద్వా గతదినాదౌ కృతమ్ ఏతద్ ఏతదద్య కరణీయం, శ్వ ఏతత్కర్తవ్యమితి వా కాలాక్రాన్తిః తథా చ కర్మ గతిర్గహనా। ఏతత్కర్మ మదిష్టసాధనం మత్కృతిసాధ్యం చేత్యాదిః కర్మాక్రాన్తిః, తథా చ కర్మగతిర్గహనా । రజసి ఉదితే రాగాదౌ ప్రవృత్తిః, తమస్యుదితే హింసాదౌ ప్రవృత్తిః, సత్త్వోదయే సదసద్వివేకే శ్రీభగవ-చ్చరిత్రశ్రవణాదౌ వా ప్రవృత్తిరిత్యాదిః గుణాక్రాన్తిః అనయా చ కర్మగతిర్దుర్జ్ఞేయా।

యద్వా అస్మిన్ కాల ఏతత్కర్తవ్యమితి కాలకర్మాక్రాన్తిః, యథా ఋతౌ గర్భాధానం, స్పన్దనాత్ప్రాక్ పుంసవనం, అష్టే మాసి సీమన్తోన్నయనం, జాతే జాతకర్మ, ఏకాదశేఽహ్ని నామకర్మ, పఞ్చమే షష్ఠే మాసి వాన్నప్రాశనం, తృతీయవర్షాదౌ చూడాకర్మ, గర్భాష్టమే జాతాష్టమే వా ఉపనయనం, అమాదౌ శ్రాద్ధమిత్యాది తథా చ కర్మగతిర్గహనా। అథవా, ఏతత్కాలే కృతస్య కర్మణోఽయం గుణ ఇతి కాలకర్మగుణాక్రాన్తి। యథా సాయం ప్రాతరుపాసితా సన్ధ్యా బ్రహ్మలోకప్రదా। పఞ్చమే ఉపనీతో బ్రహ్మవర్చసీ భవతి, అమాయాం శ్రాద్ధకృత్ ఆయుష్మాన్ భవతి, భానౌ సూర్యారాధక ఆరోగ్యవాన్ భవతి, పుత్రవాన్ భవతీత్యాది। ఏతయా చ కర్మగతిర్దురూహా, అపరిజ్ఞాత మూలాగ్రేత్యర్థః। అనిర్వచనీయాదిమాయాగుణాశ్రయాణాం కర్మణామనన్త-పారత్వం న వైచిత్ర్యకరమితి భావః ॥

అవతారికా:- మననశీలురును, కర్మనాశమునందు కోరికగలవారును అయియున్న మునులకు గూడ దైవీమాయచేత తమ తమ సిద్ధాంతములను రక్షించికొనుటలో తత్పరులైయున్నవారికి అసాధారణకర్మలు నిశ్శేషముగ నశించునుపాయము నిశ్చయాత్మకముగ తెలియకుండుటచే కర్మపరిపక్వతవలన కలుగు ఫలము ననుభవించుట యనునదెట్లు సమాప్తి చెందు నను విషయము చాల క్లిష్టమగు-చున్నదను భావముతో నిట్లనుచున్నాడు.

ప్రతిపదార్థము:- మునీనామ్=ము[నుల]యొక్క, మతవైచిత్ర్యాత్=సిద్ధాంతభేదము వలన, పరమార్థ+అవిభావనాత్=చరమస[త్య]మునుగూర్చి స్పష్టమగు అవగాహన లేకపోవుట-వలన, కాల=కాలముయొక్క, క[ర్మ=]కర్మయొక్క, గుణ=గుణముయొక్క, క్రాన్త్యా=పరిణామముచేత, కర్మణః=కర్మయొ[క్క], గతిః=నడత, గహనా=అర్థమగుట కష్టము.

తాత్పర్యము:- కర్మపరిణామము [అ]ర్థముకాదు. ఎందుచేతననగా, కర్మయనునది కాలము నాశ్రయించునది. కాలమే గతిశీలమైనది. కాగా, కర్మ ఎల్లకాలములలో నొకే విధముగ పరిణమించదను[ట] లౌకికసత్యము. ఇట్లే, కర్మ జీవుని గుణము నాశ్రయించునది కూడ. గుణము[లు] ప్రధానముగ మూడేయైనను, వాని తీవ్రతల స్థాయిలనేకములు. ఇట్లు కర్మభిన్నత్వము, దాని తీవ్రతాభిన్నత్వము కలుగుట కర్మను గూర్చిన దిశాజ్ఞానము నిశ్చయాత్మకముగ కలుగుట కష్టము. ఇందుచే సహజముగ మహాత్ముల మార్గము ననుసరింపవచ్చుననిపించును. కాని ఆలోచనాపరులైన మునులలో సైతము మతభేదములు[ం]డుటచేత విషయము మరింత క్లిష్టమగుచున్నది. మునులు గూడ పరమసత్యము నెఱుగకుండుటేమి? అనగా, దైవీమాయకు లోబడుట చేత అనవలెను. ఇక సామాన్యులు ఈ దైవీమాయకు లొంగకుండగలరా? ఈ ఈ కారణములవలన కర్మయొక్క పరిపాక మెట్లుండునో స్పష్టముగ తెలియరాదు.

వివరణము:- మునులనగా సనక, వశిష్ఠ, భృగు, యాజ్ఞవల్క్య, నారదాదులని భావము. వీరిలో నొకరు కర్మచేత కర్మనశించునని, యోగముచే కర్మక్షయమగునని మరియొకరు, కాదు కాదు, ధ్యానముచే నశించునని ఇంకొకరు, ఇట్లనుటవలన మొదలు సంచిత, సంచీయమాన, ప్రారబ్ధకర్మలనగా ఇట్టిట్టివను జ్ఞానమే అనిశ్చితము, అనిర్వాచ్యము. పైగా కర్మపరత్వము, ఉపాసనాపరత్వము, శేషత్వము ఇత్యాది ఉపనిషదర్థములను పర్యాలోచింపకుండుట కూడ కర్మ గహనత్వమునకు కారణములు. కర్మయొక్క కాలాధీనత్వమును, గుణాధీనత్వము గూడ కారణములే. కర్మయొక్క మూలము, అగ్రము తెలియరానివి. ఒక్కమాటలో, కర్మ, కాలగుణముల నాశ్రయించి నట్లే, ఈ మొత్తము మాయను ఆశ్రయించునవగుటచే ఈ గహనత్వము సహజమే.

అవతారికా:- నను బ్రహ్మప్రతిపాదకానాం మహావాక్యోపలక్షితానాం జీవోపదేశ-కరాణాం వేదకల్పతరూణాం జాగ్రతాం సతాం,కో వాసౌ జీవశోకావసర ఇత్యాశఙ్క్య తేషామనేకాభిలషితమార్గప్రదర్శకత్వాత్ తత్సిద్ధాన్తగ్రహణభీరూణాం సంశయాపన్న మానసానాం న కదాపీష్టాప్తిరిత్యాశయేనాహ -

శ్లో॥ వేదానాం మఙ్గలార్థత్వాన్మార్గాణాం వ్యభిచారతః।
అసఙ్గాదపి తీర్థానాం ముక్తిర్జీవస్య దూరతః॥ 26

వ్యాఖ్యా:- వేదానామితి । యద్యప్యుపాయేన క్రమతః పరమార్థతో వా జీవస్య ప్రాణిమాత్రస్య స్వరూపలబ్ధిర్వేదేషు ప్రతిపాదితైవ, తథాపి తేషాం మఙ్గలార్థత్వాత్ సిద్ధాపి ముక్తిః దూరతః పరోక్షనిష్ఠైవ । యేషాం స్వర్గోమఙ్గలార్థత్వేనాభిప్రేతస్తేషాం "స్వర్గకామః అశ్వమేధేన యజేత" ఇత్యాదినా అశ్వమేధో నిరూపితః। యేషాం సార్వభౌమత్వం పురుషార్థత్వేనాభిమతం తేషాం 'సార్వభౌమకామో రాజసూయేన యజేత' ఇత్యాదినా రాజసూయోఽభిహితః। యేషాం గోలోకో మఙ్గలత్వేనాభిమతస్తేషాం "గోలోకకామః తచ్ఛతసహస్రేణ యజేత" ఇత్యాదినా గోసహస్రప్రదానలక్షణో యాగోఽభిహితః। యేషామభిచార ఏవ మఙ్గలత్వేనాభిమతస్తేషాం "శ్యేనేనాభిచరన్ యజేత" ఇత్యాదినా శ్యేనయాగః ప్రోక్తః। ఇదముపలక్షణం, యేషాం యద్యన్మఙ్గలత్వేనాభిమతం తత్తత్ప్రతిపాదకవేదవాక్యానామప్యనేకత్వాత్ సా తదైవ। కిఞ్చ మార్గాణాం వ్యభిచారతోఽపి మార్గాణాముపాసనానామారోహావరోహయాత్రాకారిత్వాత్ ఏకార్థాప్రతిపాదకత్వాత్ పరమార్థాప్రతిపాదకత్వాద్వా "ప్రతిష్ఠాకామో రోదసీ ఉపాసీత", "ప్రజాకామః ప్రజాపతిం", "విద్యాకామస్తు గిరీశం", స్త్రీకామోఽప్సర ఊర్వశీం", "వసుకామో యక్షేశమ్", "ఆరోగ్యకామో భాస్కరం", "ధనకామో హుతాశం", "జ్ఞానకామో మహేశం", "మోక్షకామో జనార్దనమ్", "అపమృత్యునిరాశకామో మృత్యుఞ్జయం", "నిర్విఘ్నకామో గణేశమ్", "ఆపద్వినాశకామో జగదమ్బికామ్" ఇత్యాదౌ సర్వేషాం శ్రుతిస్మృతిప్రోక్తత్వాత్ ఇష్టానిష్టనిర్ణయస్య ముఖ్యగౌణనిర్ణయస్య చ వక్తుమశక్యత్వాదన్తఃకరణశుద్ధ్యాదికరమార్గస్య పరోక్షత్వాత్ స్వరూపాప్తిరపి పరోక్షా ఏవ।

కిఞ్చ, తీర్థానామసఙ్గాదపి తీర్థానామయమేవ స్వరూపప్రాపకః పన్థాః ఇత్యాది సిద్ధాన్తోపదేశకగురూణామ్ అలాభాద్, "ఇదమేవాన్తఃకరణశోధకం కర్మ", "వైరాగ్యజనకమిదమేవ కర్మ", సాక్షాత్ పరమ్పరయా వా ముక్తిదాయకమితి సిద్ధాన్తశాస్త్రాణాం వా అసఙ్గాదపరిజ్ఞానాద్, ఆసామేవ దేవతానామవతారో ముక్తికర ఇతి మత్వ్యాద్యవతారాణామసఙ్గాత్ పరమార్థతోఽనభిజ్ఞానాత్ స్వరూపసమ్బన్ధో దూరతః। శ్రుతీనాం త్రైగుణ్యవిషయత్వాదనేకత్వేన ధ్యేయధ్యానయోః సత్యత్వాసత్యత్వయోరనిర్ణయాత్ సశ్రద్ధానుష్ఠానాభావేన అన్తఃకరణశుద్ధ్యభాన్న స్వరూపదర్శనమితి భావః॥

**అవతారిక:-** బ్రహ్మమును ప్రతిపాదించినవారును, వేదవాక్యములను లక్ష్యముగ జేసికొనినవారును, జీవులకు ఉపదేశమును కలిగించువారును, వేదకల్పులైనవారును, జాగరూకులైనవారును అగు సత్పురుషులకు కలుగగల జీవశోకావసరమేమియగునా యని విచారించి, వారియొక్క అనేకములగు అభిలషింపదగిన మార్గములను ప్రదర్శించు కారణమున ఆ యా సిద్ధాంతముల గ్రహించుటయందు భీరువులగు సంశయాత్ములకు ఇష్టాప్తి ఎప్పటికిని లేదు గదా యను భావమున చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము:-**వేదానామ్=వేదములయొక్క మఙ్గలార్థత్వాత్=శుభముదెల్పు లక్షణము -వలన, మార్గాణామ్=మార్గములయొక్క వ్యభిచారతః=విశేషవైవిధ్యమువలన, తీర్థానామ్=పుణ్యతీర్థములయొక్క అసజ్ఞాద్+అపి=పరిజ్ఞానము లేకపోవుటవలనను, జీవస్య=జీవునకు, ముక్తిః=ముక్తి, దూరతః=పరోక్షము.

**తాత్పర్యము:-** వేదములు శుభఫలములను దెల్పునవి. శాస్త్రములచే చెప్పబడిన మార్గములనేకములు. పుణ్యతీర్థముల విషయమున పరిజ్ఞానరాహిత్యము. ఈ కారణములవలన జీవునకు ఇష్టమైన మోక్షప్రాప్తి పరోక్షముగ ప్రస్తావితమేయగు చున్నది.

**వివరణము:-** మానవాళి కిష్టమైన లౌకిక అలౌకిక ఫలములను గూర్చి ఋగ్, యజుస్, సామ, అథర్వవేదములు చెప్పును. స్వర్గసుఖములను కోరువానికి "**స్వర్గకామః అశ్వమేథేన యజేత**", స్వర్గమును కోరువాడు అశ్వమేథయాగము చేయవలెను అను నిరూపణనిచ్చునది వేదము. ఇట్లే, "**సార్వభౌమకామో రాజసూయేన యజేత**", "**గోలోక కామః తచ్ఛతసహస్రేణ యజేత**", అను వాక్యములచేత చక్రవర్తికాగోరువానికి రాజసూయము, గోలోకమును కోరువానికి లక్షగోవుల దానమును చెప్పబడినవి. క్షుద్రశక్తులను స్వాధీనము చేసికొనుటయే మంగళదాయకమని తలచువారికి సైతము "**శ్యేనేన అభిచరన్ యజేత**", డేగరూపమున యంత్రమును నిర్మించి మంత్రములతో యజించునది, అనుచు శ్యేనయాగము చెప్పబడినది. ఇది వేరొకరికి అపకారమగుటే తనకు కాగల ఉపకారమని యెంచు దుర్బుద్ధులు చేయునది. వారికి గూడ ఇష్టాప్తి మార్గము చెప్పబడినది. ఇట్లు మంచిచెడ్డలను భేదమెంచక ఎల్లరకు అభిహితమార్గముల నుపదేశించునది వేదము. ఇట్టి వేదమువలన మోక్షసాధకోపాయము ప్రత్యక్షముగ చెప్పబడలేదు. కనుక "**ముక్తిః దూరతః**" అనుట. ఇక దేవతోపాసనములు నానా-రూపములు, నానావిధములు. ఎట్లన, లౌకికముగ గౌరవము, ఉన్నతి కోరువారు

రోదసినుపాసింపవలెనని (ప్రతిష్ఠాకామో రోదసీ ఉపాసీత), సంతానమును కోరువారు ప్రజాపతి నుపాసింపవలెను, (ప్రజాకామో ప్రజాపతిం), విద్యను కోరువారు గిరీశుని (విద్యాకామస్తు గిరీశం), స్త్రీసాంగత్యము కోరువారు ఊర్వశిని (స్త్రీకామోఽప్సర ఊర్వశీం), బంగారమును కోరువారు కుబేరుని (వసుకామో యక్షేశం), ఆరోగ్యమును కోరువారు సూర్యుని (ఆరోగ్యకామో భాస్కరం), ధనమును కోరువారు అగ్నిని (ధనకామో హుతాశం), జ్ఞానమును కోరువారు మహేశుని (జ్ఞానకామో మహేశం), (మోక్షకామో జనార్దనం) మోక్షార్థి జనార్దనుని, అకాలమృత్యుపరిహారమునకై మృత్యుంజయుని (అపమృత్యునిరాసకామో మృత్యుఞ్జయం), విఘ్ననివారణకు గణేశుని (నిర్విఘ్నకామో గణేశం), ఆపదలను తొలిగించుటకై జగదంబను (ఆపద్వినాశకామో జగదంబికాం), అనుచు నిట్లు ఇష్టార్థసాధనకు శ్రుతి స్మృతులుపాయముల నందఱకు ఉపదేశించినవి. కాని ఇష్టనిర్ణయమును మాత్రము అంతఃకరణశుద్ధికి వదలివేసినవి. ఇది నేటి విజ్ఞానశాస్త్రముల వైఖరికి సమానమైన వైఖరి. నేడు విజ్ఞానశాస్త్రములు గూడ తాము ప్రతిపాదించి, సూచించి, వస్తురూపమును అందించువాని ప్రయోగ-వైలక్షణ్యమును వారి వారి అంతఃకరణశుద్ధికే వదిలివేయుచున్నవి కదా! వాని నిష్ఠ సత్యప్రకటనమునందేగాని ప్రయోగమున గల్గు అశుభఫలితములందు కాదు. ఇట్టిదే వేదశాస్త్రాదుల వైఖరియు. కనుకే స్వస్వరూపజ్ఞానప్రాప్తి పరోక్షమనుట. మఱియు నిట్లే తీర్థసేవన విషయము గూడ. అంతఃకరణశోధకకర్మ ఇదియే. ఇదియే వైరాగ్యమును కలిగించు కర్మ, ఇట్లు విస్పష్టమైన నిర్దిష్ట జ్ఞానము లేదు. ఈ యీ అవతారములనుపాసించుట ముక్తినిచ్చు ననుటయు లేదు. ఇక వేదములును త్రిగుణాత్మకములై ధ్యేయ-ధ్యానములకు, సత్య-అసత్యములకు నిరూపణ చేయలేదు. అందుచేత అనుష్ఠానమున శ్రద్ధలోపించుట, అంతఃకరణము శుద్ధము గాకుండుట యను కారణములవలన ఆత్మదర్శనము కలుగదని భావము.

అవతారికా:-నను కర్మణాం వేదవిహితత్వాదఙ్కురోత్పత్త్యా బీజసమాప్తిరివ ఫలోత్పత్త్యా స్వయమేవ కర్మసమాప్తౌ ఇష్టాప్తిః సమ్భవతీతి చేత్ కర్మవిశ్రాన్తికరణామనేకత్వాత్ కరణానేకత్వస్య చ శ్రుత్యుక్తత్వాత్ ఫలవైచిత్ర్యకృతభోగవైచిత్ర్యేణ బీజసంస్థితేరభావాత్ న సంసిద్ధిలేశోఽపీత్యభిప్రాయేణాహ -

శ్లో॥ విధినా నియమేనాపి కర్మణాం పరిసఙ్ఖ్యయా ।
విశ్రాన్తీ రాగతశ్చాపి గతిర్నాస్త్యేవ పఞ్చమీ॥ 27

**వ్యాఖ్యా:- విధినేతి । కర్మణాం సన్ధ్యోపాస్త్యగ్నిహోత్రాదీనాం విశ్రాన్తిశ్చతుర్భిరేవ । తత్ర "అహరహః సన్ధ్యాముపాసీత", "సాయంప్రాతరగ్నిహోత్రం జుహుయా" దిత్యాది శ్రుతివిహితానాం కర్మణాం విధినా పూర్వవిధినా విశ్రాన్తిః తేషామపూర్వవిధ్యాశ్రయత్వ-మిత్యర్థః। "బ్రాహ్మణస్య పాలాశః", "క్షత్రియస్య ఖాదిరః", "వైశ్యస్యౌదుమ్బరో దణ్డః" "పఞ్చ పఞ్చనఖా భక్ష్యాః", "పర్వవర్జమృతౌ వివాహితామేవ గచ్ఛేద్" ఇత్యాది-కర్మవాక్యానాం నియమేన నియమవిధినా విశ్రాన్తిః నియమవిధ్యాశ్రయత్వమ్। "యథా కామీ భవేద్వాపి" ఇత్యాదౌ, "నిత్యాస్తు జన్తోర్న హి తత్ర చోదనా" ఇత్యుక్త్యా ఆమిషమద్యసేవాదౌ కర్మణాం రాగతో విశ్రాన్తిః, తేషాం రాగాశ్రయత్వమ్। "అకామః కర్మ కుర్వీత", "ఆసు నిర్వృత్తిరిష్టా", "నైష్కర్మ్యాత్ సంస్కారః క్షీయతే" ఇత్యాద్యుక్త్యా ఫలానుసన్ధానరహితకర్మణాం పరిసఙ్ఖ్యయా నివృత్తిరూపేణ విధినా విశ్రాన్తిః। కర్మణాం పఞ్చమీ గతిః పఞ్చమం ప్రవర్తకం నాస్తి। కుత్రచిత్కర్మ పూర్వవిధినా ప్రవృత్తిః, కుత్రచిత్ కర్మణి రాగతః ప్రవృత్తిః, కృతచిత్కర్మణి నియమేన ప్రవృత్తిః, కృతచిత్ కర్మణి పరిసఙ్ఖ్యాశ్రయః ఇచ్ఛానిచ్ఛాపరేచ్ఛాభిరేకతరనివృత్తావపి ప్రవృత్తికారణబాహుల్యాత్ ఫలతోఽపి క్రియాతోఽపి స కర్మసమాప్తేరవసర ఇతి భావః॥**

అవతారిక:- మొలక మొలచుటతో విత్తనము నాశనమైనట్లే ఫలోత్పత్తితో కర్మ స్వయం సమాప్తమై ఇష్టసిద్ధి కలుగుచున్నది కదా! అనినట్లయితే, కర్మల కాశ్రయములు, ఫలముల, తద్భోగముల వైవిధ్యము, ఈ కారణములవలన బీజనిర్ణయము లేకుండుట చేత కర్మనుండి స్వభావసిద్ధముగ విమోచనమే లేదను అభిప్రాయముతో ఇట్లను చున్నాడు.

ప్రతిపదార్థము:- కర్మణాం=కర్మలకు, విశ్రాన్తీ=ఆశ్రయము, విధినా=విధిచేత, నియమేన +అపి=నియమముచేతను, పరిసఙ్ఖ్యయా=నివృత్తిచేత, రాగతః +చ+అపి=అనురక్తిచేతను కూడ, పఞ్చమీ=ఐదవదైన, గతిః=మార్గము, న+అస్తి+ఏవ=లేనేలేదు.

**తాత్పర్యము:-** విధి, నియమము, పరిసంఖ్య, రాగము అను ఈ నాల్గును కర్మలకు ఆశ్రయములు, లేక, ప్రేరకములు. ఇవిగాక వేరొక ఐదవ ప్రేరకము లేనే లేదు.

**వివరణము:-** కర్మలు వేదవిహితములు. వీనికి ప్రేరణ ఎటనుండి లభించును? అనుదానికి (1) విధి నుండి, (2) నియమమునుండి, (3) పరిసంఖ్య నుండి, (4) రాగము నుండి అని పద్మపాదుల వివరణము. ఇందు,

(1) విధి అనగా, వేదవిధి. ప్రతిదినము సంధ్యనుపాసింపుడు (అహరహః సన్ధ్యాముపాసీత), సాయంప్రాతః కాలములందు అగ్నిలో హవనము చేయుడు (సాయంప్రాతరగ్నిహోత్రం జుహుయాత్), అనునిట్టి వేదవాక్యములచే కొన్ని కర్మలు నిర్దేశింపబడి ప్రేరేపించును.

(2) నియమము, అనగా పాటించవలసిన ఆచారము. బ్రాహ్మణునకు మోదుగు దండము (బ్రాహ్మణస్య పాలాశః), క్షత్రియునకు చంద్రదండము (క్షత్రియస్య ఖాదిరః), వైశ్యునకు మేడికర్ర దండము (వైశ్యస్యోదుమ్బరో దణ్డః), ఐదు గోళ్ళుగలవి కృతజులైన బ్రాహ్మణులచే భుజింపదగినవి (పఞ్చనఖా భక్ష్యా యే ప్రోక్తాః కృతజై - ర్ద్విజైః), ఇట్టి వేదవాక్యములచే తెలుపబడిన నియమములు ఆయా కర్మలను ప్రోత్సహించును.

(3) పరిసంఖ్య అనగా నివృత్తిరూపకర్మ. కామములేనివాడై కర్మచేయుము. (అకామః కర్మ కుర్వీత), నిష్కర్మవలన సంస్కారము నశించును. (నైష్కర్మ్యాత్ సంస్కారః క్షీయతే), అను నిట్టి వాక్యములు నివృత్తిమార్గమున చేయు కర్మలకు ప్రేరకములు.

(4) రాగము అనగా కోరిక. మద్యమాంససేవనము, స్త్రీలాలస ఇత్యాది కర్మలకు కోరికయే చోదకము. యథా కామీ భవేద్వాపి అను వాక్యము దీనికి ప్రమాణము. ఐదవ ప్రేరకమనునది లేదు.

అవతారికా:- నను కర్మజన్యఫలభోగస్య సుఖరూపత్వాత్ తత్ప్రాప్తేరేవ ఇష్టాప్తి లక్షణ-త్వాత్ కిమపరాద్ధం కర్మణా? యతోఽయం తత్సమాప్తౌ భవతాం పరికర ఇత్యాశఙ్క్య, తాదృశసుఖస్య సాతిశయత్వాద్ ఫలభోగస్య చ సుఖాసుఖానుభవలక్షణత్వాత్ జన్య-ద్వైవిధ్యాన్యథానుపపత్త్యా జనకద్వైవిధ్యసిద్ధౌ ఉభయోః ఫలత్వావిశేషేణ తస్యాపి ఫల్గుత్వాత్ నిరతిశయసుఖప్రాప్తౌ ప్రవృత్తానాం తత్సమాప్తౌ ప్రవృత్తిః అర్థ్యార్థతా ఇత్యాశయేనాహ -

శ్లో॥ ధర్మాధర్మాత్మకం కర్మ తజ్జత్వం పాపపుణ్యయోః।
తదధీనస్తు భోగః స్యాద్దేహోత్పత్తి స్తదర్థికా ॥ 28

వ్యాఖ్యా:- ధర్మాధర్మాత్మకమితి। కర్మ తావద్ ద్వివిధం ధర్మలక్షణమధర్మలక్షణమితి। తత్ర నిత్యం నైమిత్తికం చ ధర్మరూపమ్ అభిచారాదికమధర్మరూపం కామ్యం తు కర్మోభయరూపమ్। పుణ్యపాపే తు తజ్జన్యే, ధర్మజన్యం పుణ్య మధర్మజన్యం పాపమ్।

**ఏతేన ధర్మపుణ్యయోరధర్మపాపయోశ్చ న పర్యాయత్వం కిన్తు జన్యజనకత్వమితి సూచితమ్। ధర్మాత్మా పుణ్యాత్మేతి సామ్యప్రతీతావపి కర్తృత్వభోక్తృత్వావస్థాభేదమాశ్రిత్య విరోధపరిహారః సుఖదుఃఖానుభవరూపభోగశ్చ తదధీనః పుణ్యపాపయోరధీనస్తదా-యత్త ఇత్యర్థః ధర్మపుణ్యవత్ పుణ్యసుఖయోరపి సంసర్గః సమ ఇత్యర్థః, తద్వత్పాప-దుఃఖయోరపి।దేహోత్పత్తిశ్చ తదర్థికా భోగప్రయోజనికా,దేహమన్తరేణ భోగాశ్రయాన్తరా-భావాదిత్యర్థః ధర్మాధర్మపుణ్యపాపానాం స్థూలసూక్ష్మలక్షణభేదావగమాత్ కార్యకారణ-భావస్య చ అనియతత్వేన కర్మగతేర్గహనత్వమితి భావః॥**

**అవతారిక:-** కర్మవలన కలిగిన ఫలానుభవము సుఖరూపమైనందువలన, అట్టి సుఖప్రాప్తికి ఇష్టాప్తిలక్షణమున్నందువలన కర్మచేత నగు అపరాధమేమి? ఇది ఆ సుఖసమాప్తియందు ఎందువలన పరికరము అగుట? అని విచారించి, అట్టి సుఖమునకు అతిశయత్వముండుటవలన ఫలభోగమునకు గూడ సుఖ అసుఖ అనుభవ లక్షణముండుటవలన కలిగిన ద్వివిధత్వము వేరు విధముగ కలుగ కుండుటచేత జనకద్వివిధత్వము సిద్ధించుటలో ఫలత్వమునందు భేదము లేకుండుట-చేతను, ఆ ఫలత్వము గూడ అప్రధానమైనందునను నిరతిశయసుఖప్రాప్తియందు ప్రవర్తించువారికి ఆ నిరతిశయసుఖసమాప్తియందు ప్రవర్తించుట తగియున్నదను భావమున చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము:-** కర్మ=కర్మ, ధర్మ+అధర్మ+ఆత్మకం=ధర్మాధర్మములు కేంద్రముగ గలది, పాపపుణ్యయోః=పాపపుణ్యములకు, తత్=అది (కర్మ), జత్వం=పుట్టుకయైనది, భోగః తు=భోగమేమో, తత్=వానికి (పాపపుణ్యములకు), అధీనః=వశమైనది, దేహ+ ఉత్పత్తిః=దేహము యొక్క పుట్టుక, తత్=అది (భోగము), అర్థికా=ప్రయోజనముగా గలది, స్యాత్=అయియున్నది.

**తాత్పర్యము:-** కర్మకు కేంద్రము లేక కీలకము ధర్మమో అధర్మమో అగుచున్నది. అట్టి ధర్మము అధర్మము పాపమునకు పుణ్యమునకు కారణములగుచున్నవి. ఈ పాపపుణ్యములననుసరించియే ఫలభోగమను సుఖదుఃఖములు కలుగుట. ఈ ఫలభోగముకొరకే దేహమనునది యేర్పడియుండుట.

**వివరణము:-** కర్మ రెండు విధములు. (1) ధర్మము నాశ్రయించినది, (2) అధర్మము నాశ్రయించినది. కనుక కర్మకు ధర్మాధర్మములలో నేది ఆశ్రయమో దాని లక్షణములను -వర్తించును. ఇక నిత్యకర్మ నైమిత్తికకర్మ అనునవి ధర్మము నాశ్రయించునవి. నిత్యకర్మ

ప్రతిదినము చేయదగిన సంధ్యావందనాదులు. ఇవి వర్ణాశ్రమధర్మము లాధారముగ ప్రవర్తిల్లునవి. ఈ కర్మలాచరించుటవలన పుణ్యము సమకూరును. ఇట్లే నైమిత్తికకర్మ-లనగా అమావాస్యనాడు పితృతర్పణము, దేవతాతర్పణము, ఉపాస్యదేవతాజపము ఇత్యాది కర్మలు. ఇవి కూడ ధర్మము నాశ్రయించునవే కనుక పుణ్యము నార్జించునవే. ఇక అభిచారకర్మలు, అనగా అపకారబుద్ధితో క్షుద్రదేవతోపాసన, జప, హోమాదులు చేయుట అనునివి అధర్మము నాశ్రయించునవి, పాపము నార్జించునవి. ఇవిగాక కామ్యకర్మ యనునది ఏదేని యొక కోరికతో దానిని ఫలింపజేసికొను లక్ష్యముతో చేయునది. ఇవి ఒకచో ధర్మము నాశ్రయించినవై పుత్రకామేష్టివలె పుణ్యప్రదములు కాగా వేరొకచో అధర్మము నాశ్రయించి పాపమును కలిగించునవి. ఇట్లు ధర్మ-పుణ్యములకు, అధర్మ-పాపములకు తండ్రి-బిడ్డల సంబంధమే తప్ప ఒకదానికొకటి సమానార్థకములు కావు. లోక ప్రతీతియందు ధర్మాత్ముడు పుణ్యాత్ముడనుటకు కారణము ధర్మాత్ముడు వాని ధర్మాశ్రయకర్మఫలమగు పుణ్యమునకు భోక్తయగుటే. ఈ పుణ్యపాపములకు సుఖదుఃఖములు ఫలానుభవరూపములు. ధర్మము > పుణ్యము > సుఖము, అధర్మము > పాపము > దుఃఖము ఇది పరిణామక్రమము. ఈ పరిణామము దేహమునకు ప్రయోజనము. ధర్మాధర్మములకు, పుణ్యపాపములకు స్థూలసూక్ష్మలక్షణభేదములు ఎఱుగరానివైనందునను, ఏది కారణము? ఏది కార్యము అనుటలో స్పష్టమగు నియమము లేనందునను కర్మగతి గహనమని భావము.

అవతారికా:- ఇత్థం కర్మసమాప్తేరిష్టసాధనత్వం ప్రతిపాద్య అకరణేన ఫలాననుసన్ధానేన చ తత్సమాప్తిం వికల్ప్య కుతోఽప్యశక్యం తదకరణం నిరస్యతి -

శ్లో॥ కర్మాభావః ఫలాభావో ద్వివిధా కర్మనిర్వృతిః
ఇన్ద్రియాణాం స్వతో వృత్తేః కర్మాభావస్త్వసంభవః॥ 29

వ్యాఖ్యా:- కర్మాభావ ఇతి। కర్మణో నిర్వృతిః సమాప్తిర్ద్వివిధా, కర్మాకరణాత్ కర్మజన్య-ఫలాననుసన్ధానాచ్చేతి। తత్ర తావత్ కర్మాభావః కర్మాకరణం తు న సంభవతి, తత్ర హేతురిన్ద్రియాణాం చక్షురాదీనాం స్వతః స్వభావత ఏవ వృత్తేః ప్రమాతృచైతన్యేచ్ఛా-మన్తరేణాపి రూపాదివిషయేషు ప్రవృత్తేః అనభిప్రేతానామనిష్టానాం చ రూపరసాదీనాం సమ్ముఖసిద్ధేః కర్మాభావః అసమ్భవోఽసమ్పన్న ఇత్యర్థః। వస్తుశక్తేః స్వభావ-సిద్ధత్వాదేకాదశ విషయీకరణకైకాదశవిషయ సాక్షాత్కారస్యైవ కర్మత్వాదేకస్మిన్ విషయే

తద్గ్రాహకస్య కస్యాప్యేకస్య విషయిణః సార్వదికసంబన్ధస్య పరిహర్తుమశక్యత్వాదితి భావః॥

అవతారిక:- ఇట్లు కర్మసమాప్తికి ఇష్టసాధనత్వమును ప్రతిపాదించి, ఈ కర్మసమాప్తికి అకరణము, ఫలానుసంధానము మార్గములుగ చెప్పి, అకరణము ఎట్లును అసాధ్య మనుచున్నాడు.

ప్రతిపదార్థము:- కర్మనిర్వృతిః=కర్మసమాప్తి, ద్వివిధా=రెండు రీతులు, కర్మ+అభావః =కర్మలేకుండుట, ఫల+అభావః=ఫలము లేకుండుట, స్వతః=స్వయముగ (సహజముగ) వృత్తేః=ప్రవృత్తి కలిగిన, ఇన్ద్రియాణాం=ఇంద్రియములకు, కర్మ+ అభావః+తు=కర్మలేకుండుట మాత్రము, అసంభవః=జరుగదు.

తాత్పర్యము:- రెండు విధములుగ కర్మ సమాప్తమగును: (1) కర్మయే లేకుండుట, (2) కర్మకు ఫలము లేకుండుట. వీనిలో, కర్మయే లేకుండుట జరుగనే జరుగదు. కారణము, ఇంద్రియములు స్వయం ప్రవృత్తములగుట.

వివరణము:- ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, మనస్సు పనిచేయకుండనుండుట ప్రకృతి విరుద్ధము. వీనిలో ఒక్కొక్కదాని కొక్కక్క ప్రవృత్తి విషయము స్వభావము. ఇవి వ్యష్టిగను సమష్టిగను పనిచేయుచునే ఉండును. కనుక కర్మ తప్పనిది. దానికి ఫలమును ప్రకృతి సిద్ధమే. కాగా, కర్మను దాని సహజఫలమునకు అనుసంధింపకుండినచో కర్మ నశించును.

అవతారికా:- సమానదోషదృష్టికరణకోభయకర్మఫల-అననుసన్ధానస్యైవ ఇష్ట-సాధనత్వాదభ్యర్హితత్వాత్ తేనైవ తత్సమాప్తిమఙ్గీకరోతి -

శ్లో॥ ఫలాభావః ఫలానిచ్ఛా దోషదృష్ట్యైవ కర్మణి।
కర్మనిర్హార ఏవాయం కార్యకారణలోపనః॥ 30

వ్యాఖ్యా:- ఫలాభావ ఇతి । ఫలాభావో నామ కర్మణి ఫలానిచ్ఛా, ఏతస్మాత్కర్మణ ఇదం ఫలం మమ స్యాదితి ఇచ్ఛాభావః స చాజ్ఞానాద్దోషదృష్ట్యా చ భవతి । తత్ర దోషదృష్ట్యైవ యత్ర ఫలానిచ్ఛా అయమేవ కర్మనిర్హారో భవతి । దోషదృష్టిశ్చ ఇదం కర్మ ఫలానుసంహితం చేత్పుణ్యపాపజనకం భవిష్యతి । తచ్చ క్షయిష్ణు, పరిణామతో దుఃఖప్రదం,పరిశేషతో జన్మప్రదం చ భవిష్యతి,తస్మాత్ ఫలానుసన్ధానం న

మదిష్టసాధన మితి వైరాగ్యగర్భిత తథావిధదృష్ట్యా కృతే కర్మణి పురుషస్య ఫలప్రసక్తిరేవ న సమ్భవతి। అయమేవ కర్మనిర్హారః, కార్యకారణలోపనో భవతి, కార్యాణాం పుణ్యపాపాదీనాం కారణానాం తదాశ్రయాణాం సూక్ష్మస్థూలశరీరాదీనాం లోపనో బీజభర్జకో భవతి । 'యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే' ఇతి భగవదుక్తేః। దోషదృష్ట్యా కృతోఽపి ఫలానుసన్ధానరహితే కర్మణి న పుణ్యపాపోదయః, తదభావే భోగప్రదవస్త్వన్తరాభావాద్ భోగాశ్రయదేహానుదయతః ప్రారబ్ధభోగాన్తే స్వరూపసమ్ప్రాప్తి-రవసితేతి భావః॥

**అవతారిక:-** సమానముగ దోషదృష్టిని కలిగించునట్టి రెండు విధముల కర్మయొక్క ఫలమును అనుసంధించకపోవుటకే ఇష్టసాధనత్వమువలన, గౌరవమువలన, దానిచేతనే కర్మసమాప్తిని అంగీకరించుచున్నాడు.

**ప్రతిపదార్థము:-** కర్మణి=కర్మయందు, ఫల+అభావః=ఫలము లేకుండుట, ఫల+అన్+ఇచ్ఛా=ఫలమునందు కోరిక లేకుండుట, దోషదృష్ట్యా ఏవ=దోషదృష్టిచేతనే, అయమ్=ఇది, కార్యకారణలోపనః=కార్య-కారణములను లోపింపజేయునదైన, కర్మనిర్హార ఏవ=కర్మను నిశ్శేషముగ హరించునదే.

**తాత్పర్యము:-** కర్మ విషయమున దోషదృష్టితోనైన ఫలము లోపించుట యనగా ఫలమునందు కోరిక లేకుండుటే. ఇది కార్యకారణబంధమును నశింపజేసి కర్మను నిశ్శేషముగ నశింపజేయును.

**వివరణము:-** కర్మ ఉండగా ఫలము సిద్ధము. కనుక కర్తకు ఆ ఫలానుభవము గూడ సిద్ధమే. కర్మ ఉండియు ఫలోత్పత్తి లేకుండుట అసాధ్యమా? కాదు. కర్మకు సిద్ధమైన ఫలమునందు అనుభవించవలె అను కోరిక లేకపోయినచో, ఫలమును లేనట్లే యగును. అనగా, కర్త కర్మచేయునప్పుడు తాను కర్తనని భావించుట, తాను చేయు కర్మకు ఇట్టి ఫలము సిద్ధమగునను జ్ఞానముతో ఆ ఫలముననుభవించు కోరికయే ప్రేరణగా కర్మచేయుచున్నాడు కనుక ఫలానుభవము (తాను కోరినదే కదా) దోషమనుట కుదరదు. అనుభవరూపమైనది దుఃఖమైనప్పుడది దోషమని నెపపెట్టినను పోదు. అసలు దోషమెక్కడ నున్నదనగా, కర్మను కర్తృత్వము వహించి నెత్తికెత్తుకొనుటలోనున్నది. అట్లేల జీవుడు ప్రవర్తించుచున్నాడు? ఫలముగా సుఖము లభించునను ఆశచే, ఆ సుఖము నందలి రుచిచే. కర్మచేయక ఎట్లైన తప్పదు కదా యనిన, దాని ఫలము క్షీణించునదనియు, పరిణామమున సుఖము క్షీణించగా

దుఃఖమును కలిగించుననియు, శేషించిన కర్మ జన్మను సిద్ధముచేయుననియు, విచారించి, చేయక తప్పని కర్మను విధిగా మాత్రము చేయుచు దాని నిష్టసాధనము కాదని వైరాగ్యబుద్ధితో నిస్సంగుడైన జీవుడు కర్తృత్వమునుండి విముక్తుడగును. అప్పుడిక వాని కర్మకు ఫలమే యేర్పడదు, భోగమును కలుగదు. ఇదియే కర్మ నిశ్శేషముగ నశించుట. దీనివలన కర్మకు కారణత్వమును, ఆ కారణమునకు మరల కర్మరూపమును, కలుగుట కవసరముండదు. అనుభవార్హమైన శరీరధారణతో మరల జన్మయు నుండదు. ఇది బీజనాశకమగు వైఖరి. భగవద్గీతలో శ్రీకృష్ణుడు గూడ, ఎవడు కర్మఫలమును త్యజించునో వాడే త్యాగియనబడుచున్నాడు. (యస్తు కర్మఫల-త్యాగీ స త్యాగీత్యభిధీయతే), అని బోధించెను. అజ్ఞానమువలన దోషదృష్టి కలిగినను, అట్టి దృష్టి ఫలమును చూచినను, జీవుడు దాని నపేక్షించని వైఖరి గలిగియున్నచో, పుణ్యపాపములుద్భవించవు, సుఖదుఃఖఫలములుండవు, కనుక ప్రారబ్ధమును మాత్ర మనుభవించి జీవుడు స్వరూపసంపత్తిని పొందును.

అవతారికా:- నను ఫలస్య విహితకర్మమాత్రజన్యత్వాత్ "నాచిన్తితముపతిష్ఠతే" ఇతి న్యాయేనాజ్ఞానాదపి కృతస్య కర్మణః ఫలానుత్పాదకత్వాత్ కథం "దోషదృష్ట్యైవ" ఇత్యవధారణమ్? ఇత్యాశఙ్క్య అకర్మవికర్మణోరపి వేదవిహితత్వాత్ ఫలజనకత్వస్య దుర్వారత్వాత్ త్రివిధఫలాననుసన్ధానస్యైవ ఇష్టప్రతిపాదకత్వం నిశ్చిత్య ఫలసఙ్ఖ్యానం దర్శయతి -

శ్లో॥ వేదోక్తత్వాదనాదిత్వాత్ కర్మాకర్మవికర్మణామ్ ।
హేయోపాదేయతాజ్ఞానాత్ త్రివిధం కర్మణః ఫలమ్॥ 31

వ్యాఖ్యా:- వేదోక్తత్వాదితి । కర్మ వర్ణాశ్రమానురోధేనోక్తమ్, అకర్మ ఉక్తానాచరణమ్, వికర్మ విరుద్ధాచరణమితి త్రయాణామపి వేదోక్తత్వాదత ఏవానాదిత్వాత్ వేదానాదిత్వేన తదనాదిత్వోపలక్షితానన్తపారత్వాచ్చ, ఇదం త్యాజ్యమిదం గ్రాహ్యమితి పరిజ్ఞానతో-ఽపి కృతస్య త్రివిధస్య కర్మణస్త్రివిధమేవ ఫలముత్పద్యతే ఇతి శేషః కర్మఫలం శాన్తయోనిప్రాప్తిః, అకర్మఫలం ఘోరయోనిప్రాప్తిః, వికర్మఫలం మూఢయోనిప్రాప్తిః । ఏవం చాజ్ఞానాదకర్మణా వికర్మణా వావశ్యంభావ్యత్వాత్ కర్మఫలాననుసన్ధానేన స్వర్గాది నివృత్తావపి వస్తుశక్తేర్దుర్వారత్వాత్ ఫలద్వయానివృత్త్యా న కర్మ సమాప్తేః అవసర ఇతి భావః।

**అవతారిక:–** ఫలము విహితకర్మమువలన మాత్రము పుట్టినదగుటవలన, నాచిన్తిత-ముపతిష్ఠతే అను న్యాయమున అజ్ఞానము వలన చేయబడిన కర్మకైనను ఫలము కలుగుట యనునది ఎట్లు "దోషదృష్టిచేతనే" అను నిశ్చయము? అని చింతించి అకర్మకు వికర్మకు గూడ వేదవిహితత్వమున్నందున ఫలజనకత్వము దాటరానిదగుట వలన మూడు విధములైన ఫలములను లక్షించకుండుటకే ఇష్టమును పొందుటను నిశ్చయించి ఫలమును గణించుటను చూపుచున్నాడు.

ప్రతిపదార్థము:– కర్మ=కర్మ, అకర్మ=అకర్మ, వికర్మణామ్=వికర్మలకు (అను ఈ మూడు విధముల కర్మలకు), వేద=వేదముచేత, ఉక్తత్వాద్=చెప్పబడుట అనునది ఉండుటవలన, అనాదిత్వాత్=(కావున) మొదలు లేనిదైయుండుటవలన, హేయ=వదలదగినది, ఉపాదేయతా=స్వీకరింపదగినది అను, జ్ఞానాత్=జ్ఞానమువలన, కర్మణః=కర్మయొక్క, ఫలమ్=ఫలము, త్రివిధమ్=మూడు విధములు.

వివరణము:– కర్మ అనగా వర్ణాశ్రమముల భేదమున వేర్వేరుగ వారివారికి ఆ యా ఆశ్రమములందు ఆచరణీయములని చెప్పబడినది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు జాతులవారికిని బ్రహ్మచర్యము, గార్హపత్యము, వానప్రస్థము, సంన్యాసము అను నాలుగు ఆశ్రమములలోను పాటించదగినది అని వేదముచే చెప్పబడినది కర్మ అనబడును. ఇట్లు చెప్పబడిన కర్మ చేయకుండుట అకర్మ అనబడును. చెప్పబడిన కర్మకు విరుద్ధముగ చేయుట వికర్మ. ఈ మూడిటిని గూర్చి వేదము ప్రస్తావించినది. వేదము అనాది కనుక ఈ త్రివిధ కర్మయు అనాదియే. కాగా, ఇది చేయదగినది, ఇది చేయరానిది అను పరిజ్ఞానముతో చేయబడినదైనను త్రివిధ కర్మకు త్రివిధఫలము కలుగును. కర్మ, అనగా, వేదోక్త కర్మ, చేసినందున కలుగు ఫలము సాధుజీవులందు జన్మము, అకర్మ, అనగా వేదోక్తకర్మ చేయకుండుట వలన కలుగు ఫలము క్రూరప్రాణులందు జన్మము, వికర్మ, అనగా వేదవిరుద్ధకర్మ-వలన కలుగు ఫలము మూర్ఖప్రాణులందు జన్మము. ఇట్లు అజ్ఞానమువలన గాని అకర్మవలన గాని వికర్మచేగాని కర్మను ఫలముతో అనుసంధానముచేయకుండుటచే స్వర్గాది ఫలానుభవమునందు గూడ వస్తుశక్తి దాటరానిదగుటవలన ఫలద్వయము-నుండి నివృత్తి లేకుండుటచే కర్మసమాప్తి కవకాశము లేదని భావము. అకర్మ వికర్మలను రెండు కర్మలకు కలుగు ఫలములే ఫలద్వయము.

అవతారికా:- నను ఫలవత్కర్మణశ్చ సాదిత్వాస్వీకృత్యా, పటదాహే తన్తుదాహవత్ ఫలసమాప్తౌ తత్ఫలజనకకర్మసమాప్తిరపి స్యాదేవ ఇత్యాశఙ్క్య ప్రారమ్భకాన్తరాసత్వే ఽ విద్యాయాశ్చ సాదిత్వే తథా స్యాదపి నేత్రసమ్మీలనమన్తరా తథా అఙ్గీకారస్యానల్ప-దోషావహత్వాదవిద్యానిబన్ధనం కర్మణశ్చానాదిత్వం ప్రతిపాదయతి -

శ్లో॥ అవిద్యాయాస్తు సాదిత్వే కృతనాశాకృతాగమౌ।
అపతేతామతస్తస్యాస్తథాత్వే తచ్చ కర్మణః॥ 32

వ్యాఖ్యా:- అవిద్యాయా ఇతి । అవిద్యాయాస్త్రిగుణసామాన్యలక్షణాయా అజ్ఞానాపర-పర్యాయాః సాదిత్వే స్వభావతోఽదృష్టరాహిత్యేనైవ జన్మాది స్యాత్। తథా సతి కృతానాం కర్మణాం తస్మిన్నేవ జన్మని ఫలసమాప్త్యనిశ్చయాత్ కృతనాశః, ఫలభోగానుమితానాం అకృతానామపి కర్మణామాపాతశ్చ స్యాత్। ఇదమపి ఉపలక్షణం, స్వభావతో జన్మని జన్యజనకకర్తవ్యాకర్తవ్యాది వ్యవహారలోపశ్చ స్యాత్ । ఏకోదరప్రసూతానాం వైషమ్య-నిర్ణయశ్చ లుప్తః స్యాత్ । అతోఽనాదిత్వమ్ అవిద్యాయాః స్వీకర్తవ్యమేవ । తస్యా అవిద్యాయాస్తథాత్వేనాదిత్వే సిద్ధే కర్మణశ్చ ప్రవాహరూపేణ తదనాదిత్వం సిద్ధమ్। కారణనాశాత్ కార్యనాశస్య కార్యనాశాత్ కారణనాశస్య చ వివక్షాధీనత్వాత్ కార్యరూపేణ పరిణతాయా అపి ప్రకృతేః పరమేశ్వరేక్షణప్రభావేణాఘటిత-ఘటనాచతురాయాః స్వస్యా అనాదిత్వం స్వకార్యస్యానన్తపారత్వం న శాస్త్రవిరుద్ధమితి భావః॥

అవతారిక:- ఫలించు కర్మకు మొదలున్నదనుటను త్రోసిపుచ్చి, వస్త్రము కాలుటలో పోగులు కాలుట ఇమిడియున్నట్లు, ఫలము నశించగా ఆ ఫలమునకు కారణమైన కర్మ కూడ నశించెననుట ఉన్నదే కదా, అని విచారించి, వేఱొక ప్రారంభకము లేకుండుటచే, అవిద్యకు గూడ అట్లే మొదలు లేదనుట సిద్ధమే యైనను తెప్పపాటు వ్యవధిలోనైనను అట్టి అంగీకారము అనల్పదోషాకరమగుటవలన అవిద్యతో కర్మకు గల అనాది బంధమును ప్రతిపాదించుచున్నాడు.

ప్రతిపదార్థము:- తు=అయితే, అవిద్యాయాః=అవిద్యయొక్క, స+ఆదిత్వే=మొదలు కలదనుటలో, కృత=చేయబడినదాని, నాశ=నశింపు, అకృత=చేయబడనిదాని, ఆగమౌ =రాకడ అను రెండును, కర్మణః=కర్మకు, ఆపతేతామ్=అపాదింపబడినవి (వచ్చి పడినవి), అతః=ఈ కారణమున, తస్యాః=అవిద్యయొక్క, తథాత్వే=అనాదిత్వమునందు, తత్+చ=అదియును (కర్మయును).

**తాత్పర్యము:-** అవిద్యకు మొదలున్నది అనినచో, చేసినది నశించును, చేయనిది వచ్చిపడును అని కర్మను గూర్చి అనినట్లేయగును. అందుచేత అవిద్యయు కర్మయు అనాది యనుటే పొసగును.

**వివరణము:-** అవిద్య సత్త్వరజస్తమోగుణలక్షణములు కలది. అజ్ఞానముకంటె వేరుకాని పర్యాయపదము. దాని ఆరంభము, స్వభావసిద్ధముగ, కనరాకుండగనే జన్మము మొదలగునవి సంభవించెను. అది యట్లుండగా, చేసిన కర్మలకు అదే జన్మలో ఫలానుభవమని నిశ్చయించుట కుదురదు, ఏలన, ఒక జన్మమున చేసిన కర్మల ఫలము ననుభవించుటయు చేయని కర్మల ఫలానుభవము వచ్చిపడుటయు కలదు, కార్యకారణ, కర్తవ్య–అకర్తవ్య ఆది వ్యవహారముయొక్క లోపమును స్వభావతః జన్మలో కలదు. ఒకే తల్లిబిడ్డలలో భేదము కలుగుటకు గూడ కారణము నిశ్చయింప-రానిది. అందువలన అవిద్య అనాది యని అంగీకరించవలసినదే. అవిద్యయొక్క అనాదిత్వ మిట్లు సిద్ధముకాగా కర్మకు గూడ ప్రవాహరూపమున (జన్మజన్మలకు) ఆ అనాదిత్వము సిద్ధమేయగును. కారణము నశించుటవలన కార్యము నశించుటయును, కార్యము నశించుటచే కారణము నశించుటయును అనునివి ప్రయోజనమున-కధీనములు కనుక కార్యరూపమున పరిణమించినదే యైనను ప్రకృతికి పరమేశ్వరుని దృష్టి సోకుటవలన అఘటితఘటనాసామర్థ్యము ప్రాప్తించును. కావున ప్రకృతి అనాది, దాని కార్యమనాది, అనుట శాస్త్రవిరుద్ధము కాదు.

**అవతారికా:-** నను స్వేచ్ఛాప్రవృత్తకర్మణోఽనిష్టఫలాజనకత్వేన ఇష్టఫలస్య చ అభిమతత్వాత్ తదుపస్థితౌ తదుపస్థితావానన్దావిర్భావాత్ ప్రాప్తా స్వరూపసంపజ్జీవేనేత్యాశఙ్క్య, కర్మబీజస్యానాదిత్వాత్ సఞ్చితసఞ్చీయమానయోః అదృష్టత్వాదనిచ్ఛాపరేచ్ఛాతో–ఽపి ప్రవృత్తత్వాదనిష్టఫలాజనకత్వస్య వక్తుమశక్యత్వాజ్జీవస్థితిరఖర్వా ఏవేత్యాశయే-నాహ-

> శ్లో॥ ఇచ్ఛానిచ్ఛాపరేచ్ఛాతః కర్మ స్యాదేవ కర్మిణామ్।
> ఫలభోగస్య భావ్యత్వాదజరా జీవసంసృతిః॥ 33

**వ్యాఖ్యా:-** ఇచ్ఛేత్యాది । ఇదం కర్మ మదిష్టసాధనం మత్కృతిసాధ్యం చేతి ఇచ్ఛయాపి కర్మణి ప్రవృత్తిః విషయవిషయిసార్వదికసమ్బన్ధసత్త్వేనానిచ్ఛయాపి కర్మ జాయతే ఏవ। 'ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి। భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥' ఇతి భగవద్గీతావచసా పరేచ్ఛాతః అపి కర్మ సమ్భవత్యేవ।

ఇత్థం సన్తతప్రవృత్తకర్మసమ్బన్ధవతాం కర్మిణాం కర్మఫలప్రసవాయ ప్రసూతానాం జీవాత్మనాం ఫలభోగస్య కర్మజన్యపుణ్యపాపహేతుకస్య సుఖదుఃఖభోగస్యావశ్యకత్వాద్ భోగకాలేఽపి కర్మాన్తరోత్పత్తేరనివార్యత్వాజ్జీవస్య ఆత్మనః సంసృతిర్దేహసమ్బన్ధః అజరాప్రౌఢైవ। ఫలవైగుణ్యదృష్టిమన్తరా కర్మలతా దృఢమూలైవేతి భావః॥

అవతారిక:- తనకు తానై కోరికతో చేసిన కర్మకు ఇష్టఫలము లభించును కదా, ఇదియు తాను కోరినదే యగుటవలన దానిని పొందుటలో ఆనందమే కలుగుచుండుటవలన స్వస్వరూపసంపద జీవునిచే పొందబడినదే కదా, అని ఇట్లాలోచించి, కర్మబీజము అనాదియగుటవలన సంచితసంచీయమానకర్మలు తెలియరానివై నందునను, కోరకయే కర్మ ప్రవృత్తమగుచుండుటవలనను, దైవేచ్ఛవలన గూడ కలుగుచుండుటవలనను, అనిష్టఫలము లభించదనుటకు శక్యము కానందునను జీవుని స్థితి మార్పులేనిదే అను భావమున నిట్లనుచున్నాడు.

ప్రతిపదార్థము:- కర్మిణామ్=కర్మచేయువారికి, ఇచ్ఛా(తః)=(తన) కోరికవలన, అనిచ్ఛా(తః)=(తాను) కోరకుండగనే, పర+ఇచ్ఛాతః=ఈశ్వరేచ్ఛవలన, కర్మ=కర్మ, స్యాద్+ఏవ= ఉన్నదే, ఫలభోగస్య=ఫలానుభవముయొక్క, భావ్యత్వాద్=నిశ్చయము వలన, జీవ= జీవునియొక్క, సంసృతిః=ప్రవాహరూప లౌకిక జీవితము, అజరా= క్షీణించనిదే (నిత్య యౌవనము కలిగినది).

వివరణము:- ఈ కర్మ నా కిష్టమైన ఫలమును పొందుటకు సాధనము, ఇది నాకు చేయుటకు సాధ్యమే అను నిశ్చయముతో ఫలము నాశించి, తెలిసి జీవుడు కర్మ ఆచరించుట కద్దు. తన ప్రమేయము లేకుండ గూడ విషయమునకు విషయితో (అనగా లోకమునగల వస్తుజాలముతో ఇంద్రియజ్ఞాన సంబంధము కలిగిన జీవునకు) గల సార్వత్రిక సంబంధముచేత కర్మ యేర్పడుట గూడ కలదు కదా! "అర్జున! మాయచేత యంత్రమునందలి బొమ్మలవలె సర్వభూతములను భ్రమింపజేయుచు సర్వభూతముల హృదయస్థానమున ఈశ్వరుడున్నాడు" (ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి । భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥) అను భగవద్గీతావచనము ననుసరించి ఈశ్వరేచ్ఛవలన గూడ కర్మ సంభవించునదే. ఇట్లు కర్మఫలము ననుభవించటకే జన్మించిన జీవాత్మలు కర్మతో నిత్యసంబంధము కలిగిన వారు. వారికి కర్మ తప్పనిదే, ఫలానుభవమును తప్పనిదే. ఫలానుభవసమయమున గూడ మరల వేరుగ కర్మచేయుటయు తప్పనిదే. ఇందువలన జీవునకు, అనగా జీవుడైన ఆత్మకు దేహముతో సంబంధము నిత్యమే.

**అవతారికా:–** నను ఫలాననుసన్ధానస్య కర్తురిష్టసాధనత్వేఽపి కృతాత్ కర్మణః ఫలా-నుత్పత్తౌ కృతనాశాదిదోషో దుర్వార ఇత్యాశఙ్క్య అన్తఃకరణశుద్ధిద్వారా వైరాగ్యాది ఫలోత్పాదకత్వేన సఞ్చితనాశకత్వేన సఞ్చీయమానానుత్పత్త్యా చ న కృతనాశాది దోషాప్తిరిత్యాశయేనాహ –

శ్లో॥ అఫలం చేత్కృతం కర్మ శుద్ధ్యర్థం నాశయేచ్చితమ్।
ప్రారబ్ధావశ్యభోగ్యత్వాత్ కృతాత్ కిఞ్చిన్న చీయతే ॥ 34

**వ్యాఖ్యా:–** అఫలమితి। కర్మణః సతతప్రవృత్తత్వాత్ కర్మకర్తృకత్వం జీవాత్మని పర్యవసిత-మేవ। సిద్ధే చ కర్మణః కర్తవ్యత్వే సంసృతిభీరుభిః శరీరిభిః శ్రద్ధయా కర్తవ్యమ్ । తచ్చ ఆరోహావరోహయాత్రానిర్విణ్ణైః ఫలాభిసన్ధిరహితమేవ క్రియతే । తాదృశం చ కర్మ కర్తృఫలాభిసన్ధిరహితమపి శక్తియుక్తమ్ ఏవ స్యాత్ । శక్తిశ్చ ఫలమేవ । తథా చ సమ్పన్నం కర్మ శుద్ధ్యర్థమన్తఃకరణశుద్ధ్యర్థం చితం సఞ్చితం నాశయేదేవ। సఞ్చితాప-సారణం వినా చిత్తశుద్ధేరభావాత్ । ప్రారబ్ధకర్మభోగస్య తు నైర్బాధ్యం సుస్థితమేవ । ప్రారబ్ధకర్మఫలభోగావస్థాయాం చ కృతాత్ కర్మాన్తరాత్ కిఞ్చిదపి జన్యజనకం పుణ్యపాపాది న చీయతే సఞ్చీయమానం న భవతి । శ్రుతదృష్టానుభూతకర్మఫలైః సత్పురుషైః కథమపి కృతం కర్మ ఫలాకాఙ్క్షారహితం చేత్ అన్తఃకరణశుద్ధివైరాగ్యాది ముక్తాఫలం ఫలతీతి భావః।

**అవతారిక:–** ఫలానుసంధానము లేనట్టి కర్మకు, కర్తయొక్క ఇష్టసాధనత్వంలో చేయ-బడినదైనను, ఫలోత్పత్తి లేకుండుటలో కృతనాశము మొదలైన దోషము దాటరానిదే కదా, అని విచారించి అంతఃకరణశుద్ధి ద్వారమున వైరాగ్యాది ఫలోత్పత్తిచే సంచితకర్మనాశము చేతను, సంచీయమానకర్మ ఉత్పత్తి కాకుండుటచేతను కూడ కృతనాశాది దోషప్రాప్తి యను భావముతో నిట్లనెను.

**ప్రతిపదార్థము:–** శుద్ధి+అర్థం=అంతఃకరణశుద్ధిని కోరి, కృతం కర్మ=చేయబడిన కర్మ, అఫలం చేత్=ఫలములేనిదైనచో, చితమ్=సంచితమును, నాశయేత్=నశింప జేయును, ప్రారబ్ధ=ప్రారబ్ధకర్మఫలము, అవశ్య భోగ్యత్వాత్=తప్పక అనుభవింపవలసిన దైనందువలన, కృతాత్=చేయబడిన కర్మవలన, కిఞ్చిత్=కొంచెము, న చీయతే= ఫలించదు.

**తాత్పర్యము:–** అంతఃకరణశుద్ధి లక్ష్యముగ చేయబడిన కర్మకు లౌకికఫలము లేదు కనుక సంచితము నశించును. ప్రారబ్ధము అనుభవించక తీరనిది. కనుక అంతః-కరణశుద్ధికై చేయబడిన కర్మకు అనుభవించక తీరని సుఖదుఃఖములుండువు.

వివరణము:- నిరంతరము కర్మ జరుగుచునే యుండును. అందుచే జీవాత్మయందు కర్మకర్తృత్వము సంక్రమించియే యున్నదగును. సుఖదుఃఖముల ననుభవించుటకు పిరికిపడువారు శ్రద్ధగా తమ కర్తవ్యకర్మను చేయవలెను. అదియును జననమరణ-యాత్రల గూర్చి చింతితులైనవారు ఫలాపేక్షలేకయే చేయవలె. ఇట్టి కర్మ కర్తకు ఫలాపేక్షలేనిదైనను శక్తికలిగినదే యగును. శక్తికూడ ఫలమే. అట్లే అంతఃకరణ-శుద్ధి కొరకై, లౌకిక ఫలానుభవమునకై కాక, చేయబడిన కర్మ సంచితకర్మఫలమును నశింపజేయును. ఏలన, సంచితము నశించక చిత్తశుద్ధి కలుగదు కనుక. ప్రారబ్ధకర్మ-ఫలము ననుభవించుట యను దానికెట్లును బాధకము లేదు. ప్రారబ్ధకర్మఫలము ననుభవించు స్థితిలో చేసిన ఇతర కర్మలకైతే పుణ్యపాపాదుల కూడికయుండదు. ఫలాపేక్షలేని సత్పురుషుల కర్మ అంతఃకరణమును శుద్ధిచేసి వైరాగ్యమును కలిగించి ముక్తిని ఫలముగ నిచ్చును.

**అవతారికా:-సదోషవ్యపదేశఫలరాహిత్యేన కర్మణః పరమపురుషార్థత్వం ప్రతిపాదయతి.**

*శ్లో॥ భవేద్వైరాగ్యతో జ్ఞానం విరక్తిశ్చ పరోక్షతః।*
*అన్తఃకరణశుద్ధ్యా ద్వే సాఫలాదేవ కర్మణః॥* 35

**వ్యాఖ్యా:- భవేదితి। వైరాగ్యతః విగతవిషయరాగసమ్పత్త్యా జ్ఞానం "బ్రహ్మాస్మి, జీవో బ్రహ్మైవ" ఇత్యపరోక్షజ్ఞానాఙ్కురగర్భితపరోక్షజ్ఞానం భవేత్ ఉదేతి । విరక్తిర్వైరాగ్యం చ పరోక్షతః "బ్రహ్మాస్తి తచ్చ సచ్చిదానన్దలక్షణం వివర్తాధిష్ఠానం చ" ఇత్యాద్యాకారక-పరోక్షజ్ఞానతో భవేత్ । తే చ ద్వే వైరాగ్యపరోక్షజ్ఞానేఽన్తఃకరణశుద్ధ్యా భవతః॥ సా చ చిత్తశుద్ధిరఫలాత్ ఫలానుసన్ధానరహితాత్ కర్మణః సాకాశాద్ భవత్యేవ । ఇత్యవధారణా-దఫలం కర్మ చిత్తశుద్ధేరన్తరఙ్గమితి సూచితమ్॥ క్రమసోపానారోహణస్యైవ అభిమతార్థ-ప్రాపకత్వాదవ్యభిచారిత్వాత్ చ ఇతి భావః॥**

**అవతారిక:-** సదోషమని పేర్కొనబడిన కర్మకు ఫలరాహిత్యమున్నందున పరమ-పురుషార్థసాధకత్వము చెప్పబడుచున్నది.

**ప్రతిపదార్థము:-** వైరాగ్యతః=విరాగమునుండి, జ్ఞానమ్=జ్ఞానము, చ=మఱియు, పరోక్షతః=పరోక్షజ్ఞానము నుండి, విరక్తిః=విరాగము, భవేత్=సంభవించును, ద్వే=రెండు, అన్తఃకరణశుద్ధ్యా=అంతఃకరణశుద్ధివలన, సాఫలాద్+ఏవ=సఫలతనుండియే, కర్మణః=కర్మకు.

తాత్పర్యము:- విషయములందనురాగము నశించుటవలన జ్ఞానము, పరోక్షజ్ఞానము-వలన విరాగము జనించును. అయితే ఈ రెండును అంతఃకరణము శుద్ధిజెందుటవలన యేర్పడును. ఇది కర్మకు సఫలత.

వివరణము:- వైరాగ్యమువలన "బ్రహ్మమున్నది, జీవుడు బ్రహ్మమే" అను నిట్టి జ్ఞానము కలుగును. ఇది పరోక్షము, అనగా అనుభవమునకు రాని జ్ఞానము, ప్రత్యక్షము కాదు. కాని దీని గర్భమున అపరోక్షజ్ఞానబీజమున్నది. ఇక వైరాగ్యము "బ్రహ్మమున్నది, అదియు సచ్చిదానందలక్షణము గలది, వివర్తమైన చక్రమైనదియును" అను నిట్టి రూపముగల పరోక్షజ్ఞానమువలననే సంభవించును. వైరాగ్యపరోక్షజ్ఞానములు రెండును అంతఃకరణశుద్ధివలన కలుగును. అదియును ఫలాపేక్షలేని కర్మనుండి కలుగునదే. ఇట్టి జ్ఞానము చిత్తశుద్ధికి మూలము.

అవతారికా:- ఫల్గుతరస్వర్గాదిఫలరహితస్య కర్మణో బృహత్తరకార్యకారిత్వాద్యోగా-ద్యపేక్షయా పూజ్యత్వమభినయేన దర్శయతి -

శ్లో॥ సర్వేషామేవ భావానామన్తర్భావోఽత్ర కర్మణి।
అఫలే కర్మనిర్హారే ప్రోక్తానామన్తరఙ్గతః॥ 36

వ్యాఖ్యా:- సర్వేషామితి। కర్మనిర్హారార్థం సనకాదిభిః ప్రోక్తానాం విశేషేణ కథితానాం భావానాం కర్మతో యోగతో ధ్యానాదిత్యత్ర కథితానాం కర్మాదికర్మసమాప్త్యుపాయానాం సర్వేషామేవ అత్ర అఫలే రుచ్యర్థవేదోక్తఫలాననుసన్ధానరహితే కర్మణి అన్తర్భావః। తత్ర హేతుః అన్తరఙ్గతః అన్తరఙ్గత్వాత్। యోగాదీనాం సాపేక్షకత్వాద్వాసనావశతో వ్యభిచారిత్వాత్ కర్మశేషత్వాద్విశేషణాత్ చిత్తశుద్ధేర్బహిరఙ్గత్వమపి కర్మణా కర్మనిర్హారః ఇత్యత్ర కృతస్య కర్తవ్యేనేతి వ్యాఖ్యాతవ్యమ్। ఏవం చ 'కర్మత' ఇత్యత్ర కర్మశబ్దో యోగాదీతరకర్మపరోఽపి విశేష్యో వా అనుసన్ధేయః। అన్యథా స్వరూపాఖ్యా విషత్రసఙ్గః స్యాత్। తాటస్థ్యే కర్మణా ఇష్టాపూర్తాదినేతి వ్యాఖ్యా। విశేష్యత్వే యోగతః కర్మతః యోగలక్షణకర్మణా కర్మనిర్హారః। ఏవమగ్రేఽపి ధ్యానరూపేణ కర్మణేత్యాద్యూహ్యమ్। ఇష్టాపూర్తాదికర్మణాపి వ్యభిచారిఫలరాహిత్యేనైవాన్తఃకరణశుద్ధేః యమనియమాదిరూప-యోగానుష్ఠానకర్మణోఽపి వాసనారహితస్యైవ చిత్తశుద్ధిహేతుత్వాత్। ఉపాసనా-యాశ్చాత్మేతరానుసన్ధానరహితాయాః శుద్ధికారణత్వాత్। సత్సఙ్గాదపి విషయవిశేష-భోగవాఞ్ఛానాన్విష్టాత్ కదాచిత్ ప్రారబ్ధవశతో మిలితాదపి సా నేతి। ప్రణవాది

జపకర్మణో౽ పి హిరణ్యగర్భాదిలోకప్రాప్తి ఫలరాహిత్యేనైవ తజ్జనకత్వస్య లభ్యమాన-త్వాత్। శ్రుత్యర్థపర్యాలోచనస్యాపి అతీవార్వాచీనదమ్భాదిఫలాస్పృక్తస్యైవైతచ్ఛోధకత్వాత్। ఏవమేవ పరిపాకావలోకనాదీనామపి విషయవాసనాఫలరహితానామేవ శుద్ధిద్వారా కర్మసమాప్తికరత్వమ్। అత ఏవ సర్వాస్తర్భావో ౽న్తరఙ్గత్వం చ సమ్పన్నమిత్యవధేయమ్। మూలకృతస్యాలవాలస్య స్కన్ధశాఖాపత్రపుష్పాద్యుపకారిత్వం స్వతః సిద్ధమితి భావః॥

**అవతారిక:**- నిస్సారమైన స్వర్గాది ఫలములేని కర్మకు గొప్పకార్యమైన యోగాది అపేక్షయుండుటచేత పూజ్యత కలదని ప్రదర్శించుచున్నాడు.

**ప్రతిపదార్థము:**- అత్ర=ఇక్కడ, అఫలే కర్మణి=ఫలసంబంధములేని కర్మయందు, భావానామ్=కర్మసమాప్తికగు ఉపాయములకు, సర్వేషామ్+ఏవ=అన్నిటికిని, కర్మనిర్హారే =కర్మ నిశ్శేషమగుటలో, ప్రోక్తానామ్=ముందే చెప్పబడినవానికి, అన్తరఙ్గతః =అంత రంగమువలన, అన్తర్భావః=అంతర్భావము.

**తాత్పర్యము:**- ఫలము, అనగా లౌకికఫలము నపేక్షింపక చేయబడిన కర్మకు అంతకు మించిన యోగఫలము లభించును. కనుక కర్మసమాప్తికై చెప్పబడిన ఉపాయము-లన్నిటిలో గూడ ఈ ఫలము చేరియేయున్నది.

**వివరణము:**- కర్మ నిశ్శేషమగుటకై సనకాదులచే విశేషముగ చెప్పబడిన కర్మ సమాప్త్యుపాయములు, కర్మ, ధ్యాన, యోగములనునవి కలవు. ఇవి యన్నియు వేదోక్తఫలాపేక్షలేని కర్మలందు వర్తించునవి. అంతరంగశుద్ధియే కారణము, లేక ఈ కర్మకు ప్రేరకము. యోగాదులు సాపేక్షకములు, వాసనావశమున కర్మశేష-ముండుటచే చిత్తశుద్ధికి గల బహిరంగత్వము గూడ కర్మచే కర్మనాశము అను కర్తవ్యము –చేతనే అని వ్యాఖ్యానించదగును. ఇట్లే 'కర్మతః' అనుచోట కర్మశబ్దమునకు యోగము కంటె భిన్నమైన ఇతర కర్మలనియే భావము గ్రాహ్యము. లేనిచో, 'స్వరూపము' అనుదానికి విపత్కరమైన ప్రసంగమునకు తావుండును. స్వరూపమనగా తనదైన రూపము అని కదా బీజార్థము. యోగముచే సాధించునది ఆత్మజ్ఞానము, ఆత్మరూప-దర్శనము కనుక కర్మచే కర్మసమాప్తి యనినప్పుడు, యోగము కూడ కర్మయే కదా అను ప్రశ్నకు తావివ్వక, తదితర కర్మలనే గ్రహించవలసియుండును. తటస్థమైన కర్మచేత అనగా ఇష్టాపూర్తాది కర్మలచేత అని వ్యాఖ్యానింపదగును. అంతఃకరణశుద్ధికై యమనియమాది రూపమైన యోగానుష్ఠానకర్మలకును వాసనారహితమైన చిత్తశుద్ధి

చెప్పబడియున్నందున తదతిరిక్తఫలరాహిత్యమే ఇష్టాపూర్తాదికర్మలకు సంభావ్యము. ఆత్మేతరమునకు అనుసంధింపబడని ఉపాసనకే శుద్ధి. సత్సంగమునకు గూడ విషయ-భోగవాంఛలయందు రుచిని తొలగించుటద్వారముననే శుద్ధిచేయు శక్తి కలుగుట. ప్రణవజపము మొదలగు వానివలన కూడ శుద్ధి తత్ఫలత్యాగమువలననే కలుగుచున్నది. వేదార్థచింతనకైనను ఇంతియే. కర్మపరిపాకము విషయవాసనాజనకము. వాసనారాహిత్యముతోనే శుద్ధి సిద్ధించును. ఈ శుద్ధి ద్వారముననే కర్మసమాప్తి సాధ్యము.

అవతారికా:- శోధకత్వాశోధకత్వేఽసమీక్ష్య ఫలత్వావిశేషాభిమానినాం సత్తమాధి-కారిణాం వా సమ్మతిమాహ -

శ్లో॥ *ఫలత్వాదీశ్వరప్రీతేరర్పణాదర్పణేతరత్।*
*వరమిత్యాహురాచార్యాః కర్మణః కర్మకౌశలాః॥* **37**

వ్యాఖ్యా:- ఫలత్వాదితి । కర్మసు ప్రారబ్ధావస్థోపస్థితేషు స్నానపానభోజనశయన-గమనాదిలక్షణేషు కౌశలమాత్మస్మృతీతరేష్టానుసన్ధానరాహిత్యేన ప్రవర్తనం యేషాం తే కర్మకౌశలా ఆచార్యా అవధూతానుయాయినః "అనేన కర్మణేశ్వరః ప్రీయతే, ఈశ్వరప్రీతయే ఏతత్కర్మాహం కరిష్యే, ఏతత్కర్మ పరమేశ్వరార్పణమస్తు" ఇత్యాదావీశ్వర-ప్రీతేరపి ఫలత్వాదన్తర్ముఖతాప్రతీతౌ అపి పరోక్షత్వేనాత్మనో భానాత్ కర్మణోఽర్పణా- పేక్షయా తదితరత్ అనర్పణమేవ వరం విశేషతః కర్మనిర్వాహకమితి వదన్తి। మతానాం మాయాకల్పితత్వాత్తదభిమానినాం స్వాభిమతార్థస్థాపనం చ చిత్రమితి భావః॥

అవతారిక:- శోధకత్వ-అశోధకత్వములను రెండిటిని చక్కగా భావించక, ఫల-ముండుట లేకుండుట యను రెండిటియందును అభేదభావముగలవారియొక్క లేక, ఉత్తమాధికారులయొక్క సమ్మతిని చెప్పెను.

ప్రతిపదార్థము:- కర్మకౌశలాః ఆచార్యాః=కర్మనిష్ఠగల వారైన ఆచార్యులు, ఈశ్వరప్రీతేః =పరమేశ్వరుని ప్రీతికొరకు, కర్మణః=కర్మలయొక్క అర్పణాత్=అర్పించుటకంటె, ఫలత్వాద్=ఫలోత్పత్తి కారణముగ, అర్పణ+ఇతరాత్=అర్పించకుండుటే, వరమ్= శ్రేష్ఠము, ఇతి=అని, ఆహుః=చెప్పుచున్నారు.

**తాత్పర్యము:-** తానుచేయు కర్మలకు వేరుగ ఉద్దిష్ట కామ్యఫలము లేకున్నను,

సహజముగ కర్మోద్భవమగు ఫలమును సైతము కర్త ఈశ్వరుని ప్రీతికే వదిలివేసిన వాడైనను, ఈ ఈశ్వరార్పితకర్మలకు గూడ ఫలము సిద్ధమై ఆ ఫలము కర్తయొక్క ఆత్మను (లేక కర్తను) పరోక్షముగ ప్రకాశింపజేయును అను అంతర్ముఖత్వమున్నందు-వలన, కర్మలను ఈశ్వరార్పణము చేయుటకంటె చేయకపోవుటే మేలని కర్మ-నిపుణులైన అచార్యులందురు.

వివరణము:- కర్మలకు ఫలము సిద్ధించును. అయిన ఆ ఫలమును కర్మమాలిన్యము-నుండి పవిత్రీకరించుటయున్నదా? లేదా ? అని విచారించిన, ఫలమును ఈశ్వరార్పణము గావించి నిష్కామియై చేసిన కర్మ పవిత్రకర్మ యగుననునది పెద్దలు చెప్పునది. ఆ పెద్దలలో కర్మకుశలురైన అవధూతల ననుసరించువారు, అనగా స్నానపానభోజనశయనాది కర్మలందు ఆత్మనుంచనివారు, ఇట్లందురు. ఈ కర్మచేత ఈశ్వరుడు సంతోష పెట్టబడుచున్నాడు, ఈశ్వరప్రీతికై నేను ఈ కర్మను చేయుదును, ఈ కర్మ ఈశ్వరున కర్పింపబడినదగునుగాక! అనుచు సంకల్పించి జ్ఞానముతో ఈశ్వరార్పణమని చేసిన కర్మకు గూడ ఫలము సిద్ధించుట తథ్యము. ఈ ఫలము అంతర్ముఖమై పరోక్షముగ కర్తయొక్క ఆత్మోద్దీపనమునకు తోడ్పడునదే అగుచున్నది కదా, మరింక ఫలరాహిత్య మెక్కడ? కర్మ నిశ్శేషమగుట ఎక్కడ? అని తర్కించి, నిష్కామకర్మచేసి ఫలము నందుగాని తదర్పణమునందుగాని చిత్తము నుంచకుండుటే శ్రేష్ఠతరమార్గమని నిశ్చయము. మతములు, అనగా వివిధములైన అభిప్రాయ-భేదములు మాయచే కల్పింపబడినవే యగుటచే ఆ యా మతముల వ్యవస్థాపకుల పని తమ తమ అభిప్రాయముల స్థాపించుటే. జ్ఞానులు సైతము ఈ మాయకు లోనగుచుండుట, తమ భావములే సత్యములని తదితరము అసత్యమని ప్రచారము చేయుట, ఇదంతయు విచిత్రము. ఇట్టి వారి కర్మలకు సంగపరిత్యాగమనునది వర్తించునా? వారు నిష్కాములని యనవచ్చునా? అనునవి ఆంతరంగికప్రశ్నలు.

అవతారికా:- లౌకికఫలానుత్పాదకత్వేనాన్తఃకరణశుద్ధ్యుపకారకత్వేన చ బ్రహ్మార్పితస్య కర్మణః సత్తమత్వమేవ ప్రతిపాదయతి -

శ్లో॥ ఆత్మప్రీతేరకామత్వాదీశ్వరత్వావిశేషతః।
భావశుద్ధ్యర్థముక్తత్వాదర్పణం కర్మణః పరే॥ 38

వ్యాఖ్యా:- ఆత్మప్రీతేరితి। పరే భాగవతాః ఈశ్వరత్వావిశేషతః జీవేశ్వరయోః పరమార్థతో విశేషాభావాత్ స్వాత్మప్రీతేరఫలత్వాదలౌకికఫలత్వాద్వా కర్మార్పణస్య చ భావశుద్ధ్యర్థ-

ముక్తత్వాదనర్పణాపేక్షయా కర్మణోஉర్పణమేవ వరమ్ ఇత్యాహురితి పూర్వక్రియా సమ్బన్ధః॥ అన్తఃకరణేஉజ్ఞానావృతే సతి బిమ్బప్రతిబిమ్బలక్షణరూపద్వయైక్యభానా- ప్రత్యయాత్ ప్రతిబిమ్బార్పితకర్మణాం బిమ్బగోచరత్వేనాన్తఃకరణనిష్ఠాజ్ఞానస్య క్రమశస్తిరస్కృతత్వాత్ శీఘ్రమేవ అన్తఃకరణం నిర్మలం భవతీతి భావః॥

**అవతారిక:-** లౌకికఫలమును సిద్ధము చేయకుండుటచేతను, అంతఃకరణశుద్ధిని కలిగించుట యను ఉపకారము చేయుట చేతగూడ, బ్రహ్మకర్పింపబడిన కర్మకు సత్తమత్వమే ప్రతిపాదింపబడుచున్నది.

**ప్రతిపదార్థము:-** పరే=ఇతరులైన భాగవతులు, ఆత్మప్రీతేః=తనదైనప్రీతియొక్క, అకామత్వాత్=కోరికలేకుండుటవలన, ఈశ్వరత్వ+అవిశేషతః=ఈశ్వరత్వమున- కభేదమైనందువలన,భావశుద్ధి+అర్థమ్=భావశుద్ధికొరకు, ఉక్తత్వాత్=చెప్పబడినందు- వలన, కర్మణః=కర్మయొక్క, అర్పణమ్=భగవదర్పణముచేయుట, (వరమ్=శ్రేష్ఠము, ఇతి=అని, ఆహుః=చెప్పుదురు, అని పూర్వశ్లోకములోని క్రియతో అన్వయము).

**వివరణము:-** అంతఃకరణము అజ్ఞానముచే కప్పబడియుండగా బింబము ప్రతి- బింబము అను లక్షణముగల రెండు రూపముల ఐక్యప్రకాశమునందు [illegible] విజ్ఞానము లేకుండుటవలన ప్రతిబింబముచే అర్పింపబడిన కర్మలు [illegible] గోచరించుటచే అంతఃకరణము నావరించిన అజ్ఞానము క్రమముగా తిరస్కరింపబడి [illegible]లోనే అంతః -కరణము నిర్మలమగుట సంభవము. అద్దము ముందు నిలిచి తన ముఖమును చూచికొని, ముఖముపై మలినమున్నట్లుతోచగా ముఖమును కడిగి తుడిచికొని మరల చూచిననూ తన ముఖము మలినమైయున్నట్లే తోచగా, ఇట్లు ఒకటికి పదిమార్లు కడిగి తుడిచినను పోక నిల్చిన మాలిన్యము తన ముఖమునకు సంబంధించినది కాదనిపించి, విచారించగా, ఆ మాలిన్యము అద్దమున కన్పించిన తన ప్రతిబింబము నకు చెందినదియు కాదని తర్కించి, అది అద్దమునకంటినదే యని తెలిసి, అద్దమును తుడిచి శుద్ధిచేసి చూడగా ప్రతిబింబము నిర్మలమై కన్పించినప్పుడు బింబమైన తన ముఖము నిర్మలమే అని తెలియుటను పోలినదే ఈ సందర్భము. ఇచట బింబము పరమాత్మ, ప్రతిబింబము జీవాత్మ, అంతఃకరణము మధ్యనున్న అద్దము, మాలిన్యము అద్దముపై పేరుకుపోయిన అజ్ఞానము, అంతఃకరణ శుద్ధిక్రియ అద్దమును శుద్ధిచేసికొను పని, ఇదియే జీవుడు తన కర్మలను పరమాత్మ కర్పించు క్రియ, ఇందుచే అంతఃకరణ నైర్మల్యము సాధ్యము. దానివలన జీవాత్మ నైర్మల్యము దర్శితము.

ఇట్లు పరమాత్మయను బింబనైర్మల్యము స్థాపితము కాగా జీవాత్మ పరమాత్మల ప్రకాశైక్యత అంతరంగమను అద్దమున తెలియవచ్చుననుట తాత్పర్యము. ప్రతిబింబ-మైన జీవాత్మ తనకు తానే బింబమునని భావించి తన అంతఃకరణమున చూడగా మాలిన్యము కనవచ్చెను. తనను తానే పరిశుద్ధుని జేసికొను క్రియలవలన తన అంతఃకరణముపై నున్నదే ఆ మాలిన్యమని తెలియవచ్చి దానిని శుద్ధిజేసి కొనుటతో తాను ప్రతిబింబము ననియు తెలిసెను. అంతట జీవాత్మపరమాత్మలు ప్రకాశైక్యమును పొందిరి. కొందఱు మహాత్ములు కర్మలను ఈశ్వరార్పణము చేయకుండుటకంటె చేయుటేమేలని నిశ్చయాత్మకముగ పలుకుదురు.

అవతారికా:- సంసిద్ధికరత్వాదసదనుత్పత్తికరత్వాదినా కుత్రాప్యనర్పితస్య బ్రహ్మార్పితస్య చ కర్మణో విజ్ఞానోదయం ప్రతి తత్సాధనత్వమవ్యాహతమేవేత్యాహ -

*శ్లో॥ ఫలానుత్పత్తిరౌషర్యాదుభయోః కర్మణోః సమా।*
*భావస్యైవ బలం తత్ర నాన్తరఙ్గక్షతిర్ద్వయోః॥* 39

వ్యాఖ్యా:- ఫలానుత్పత్తిరితి । యత్రోప్తబీజం న ప్రరోహతి స దేశ ఊషరః, తస్య భావ ఔషర్యమ్। తస్మాదనర్పితబ్రహ్మార్పితయోరుభయోః కర్మణోః ఫలానుత్పత్తిః లౌకిక-ఫలాజనిః సూక్ష్మవిపాకరూపేణ కర్మస్థితేరభావో వా సమా అవిశేషా । ఈశ్వరార్పితానా-మనర్పితానాం చ కర్మణామసద్వాసనానుత్పత్తేః కర్మనిర్వాహకత్వమబాధమ్। తత్రోభయో-రపి కర్మణోః ప్రవృత్తౌ భావస్య భక్తేరేవ బలమ్। నోత్తమత్వాధమత్వే ప్రవృత్తికారకే। యస్య కర్మార్పణే భక్తిస్తస్య బ్రహ్మార్పితానామేవ కర్మణామన్తఃకరణశుద్ధిద్వారా జ్ఞానజన-కత్వమ్। యస్య తు కర్మానర్పణే భావస్తస్య స్వభావతోఽనుష్ఠితానామనర్పితానామేవ కర్మణాం శోధకత్వమ్ । అతో ద్వయోరర్పితానర్పితయోరపి కర్మణోరన్తరఙ్గత్వహానిర్నాస్తి। అన్తఃకరణశుద్ధిం ప్రతి న బహిరఙ్గత్వమితి భావః॥

యద్వా అర్పణానర్పణలక్షణయోర్భావస్యైవ చిత్తస్యైవ బలమ్। యావచ్చిత్తం విశేషతో విషయభోగే రాగి తావత్కర్మాణి బ్రహ్మణి సమర్పయేత్, యదా తు విషయభోగే శిథిలం నిర్విణ్ణం వా మనస్తదా కర్మణి నార్పయేత్ । భావితస్యైవేష్టజనకత్వాత్ తత్ర తస్యైవాన్తరఙ్గమితి భావః॥

అవతారిక:- సంసిద్ధిని కలిగించునదైనందువలన అసత్తును కలిగించక పోవుట మొదలగు లక్షణములచేత ఎచ్చటగాని, అనగా ఏ సందర్భముననైన, అనర్పిత కర్మకు

మఱియు బ్రహ్మార్పితకర్మకు విజ్ఞానము కలుగునను విషయము గూర్చి దానియొక్క సాధనత్వము నిరాటంకమే యని చెప్పును.

**ప్రతిపదార్థము:-** ఫల+అనుత్పత్తిః=ఫలము పుట్టకుండుట, బైషర్యాత్=బీజము మొలకెత్త కుండుట అనుదానివలన, ఉభయోః కర్మణోః=రెండు కర్మలయందును, సమా= సమానము, తత్ర=అచ్చట, భావస్య+ఏవ=భావమునకే, బలమ్=బలము, ద్వయోః= రెండిటిలోను, అన్తరఙ్గక్షతిః=అంతరంగమునకు నాశము, న=లేదు.

**వివరణము:-** సంసిద్ధి యనగా లక్ష్యము సిద్ధించుట. ఇప్పట్టున లక్ష్యమనునది కర్మరాహిత్యము ద్వారా సాధించనైన జన్మరాహిత్యము. ఈ లక్ష్యమును సిద్ధింప జేయుటకు అసత్ అను కర్మఫలమేర్పడకుండవలె. ఇందుకు మూలము కర్మఫల-త్యాగము. కర్మ చేయక జీవునకు తప్పదు. కావున కర్మచేయుచుండియు ఆ కర్మకొక ఉద్దిష్ట కామ్యముండరాదు. కామ్యము లేకున్న కర్మ నిష్ఫలమా? ఫలమున్నను దాని ననుభవించు కోరిక కర్తకు లేకుండుటవలన ఫలానుభవమను ప్రతికర్మయుండదు. ఇట్లు కర్మ నిర్బీజమగును. మరియొక విధమున, ఫలమును కర్త ఆశించక ఈశ్వరున-కర్పించును. ఇదియు ఫలత్యాగమే. ఇట్లును కర్మ నిర్బీజమగును. భేదము ఈశ్వరున-కర్పించుట, అర్పించకుండుట యనునదే. అర్పించక, ఫలాశలేక కర్మచేసినచో కర్మ-ఫలము విశ్వమును జెందును. అర్పించినచో విశ్వేశ్వరుని జేరును. ఎట్లైనను ఇట్టి కర్మ కర్తకు విశేషజ్ఞానమును కలిగించు సాధనమే యగును. దీనిచే జీవియొక్క ప్రాకృతికస్వభావము సంస్కరింపబడును. ఇట్లు సంసిద్ధిశబ్దముయొక్క రెండవ అర్థమైన స్వభావముత్తమము కాగల్గును. ఇందుచే అంతరంగము నష్టపడదు. సద్వాసనలు అనగా మంచి సంస్కారము కలుగును. కుసంస్కారములు లేక దుర్వాసనలుండవు. కనుక కర్మబీజ మంతరించుటకు బాధకము లేర్పడవు. ఈ రెండు విధముల కర్మయందు ప్రవర్తించుటలో భావము లేక భక్తియనునదే ప్రేరకము. ఈశ్వరార్పిత కర్మకు భక్తి దోషహరము. అనర్పితమగు నిష్కామకర్మకు ఆ నిష్కామత్వమే దోషహరము. కనుక అంతరంగశుద్ధి రెండిటివలన కలుగును. దేనివలనగాని అంతరంగమునకు హాని కలుగదు. ఐనను చిత్తము తన సహజలక్షణముగ విషయాసక్తమైయున్నప్పుడు కర్మఫలమును ఈశ్వరార్పణగావించుట మంచిది. ఇందువలన చిత్తము శుద్ధము కాగలదు. చిత్తమొకవేళ విషయాసక్తి లేనిదైనచో, కర్మఫలనిరపేక్షయే చాలును, ఈశ్వరున కర్పింపకున్నను బాధలేదు.

అవతారికా:- ఫలాచిన్తనార్పణానర్పణేతరకర్మనిర్హరణోపాయ-ఏకతరరుచీనాం భావగృహీతభావశుద్ధ్యుపకారకదైవసమ్పత్పరిశీలనమేవాభ్యుదయకారీత్యాహ-

శ్లో॥ పక్షాన్తరాణాం లాభే తు భావపక్షసమాశ్రయాత్।
ఔషర్యం కర్మణాం సాధ్యం భావతో నాస్తి గౌరవమ్॥ 40

వ్యాఖ్యా:- పక్షాన్తరాణామితి । అన్తఃకరణశుద్ధిజనకానాం ఫలార్పణావర్పణఫలానను- సన్ధానేతరపక్షాణాం సద్గురూపదిష్టానాం లాభే సతి భావయుక్తో యః పక్షస్తత్స- మాశ్రయాత్ కర్మణామౌషర్యం ఫలానుత్పాదకత్వమేవ సాధ్యమ్। ఫలానుత్పత్తేరేవ చిత్తశోధకత్వాత్ సమనన్తరమేవానిష్టనివారకత్వాచ్చ। భావతో భావనాయాః సకాశాదన్య -పదార్థస్య గౌరవం గురుత్వం నాస్తీతి లౌకికమలౌకికమపి ఫలం భావగృహీతకర్మత ఏవ సమ్పద్యతే ఇతి భావః॥

అవతారిక:- ఫలమును చింతింపకుండుట, అర్పింపకుండుట, అర్పించుట అను ఈ మూడిటికంటె వేరైన కర్మ నశించునుపాయము, వీనిలో నేదో ఒకదానియందు రుచిగలవారికి కర్మచేయుటలో భావశుద్ధి లేక చిత్తశుద్ధియను ఉపకారమును కలిగించు దైవానుగ్రహము నపేక్షించుటే అభ్యుదయమును కలిగించునది, అని చెప్పుచున్నాడు.

ప్రతిపదార్థము:- పక్షాన్తరాణామ్=ఇతర పక్షములయొక్క, లాభే తు=లాభమునందైతే, కర్మణామ్=కర్మలకు, ఔషర్యమ్=బీజోత్పత్తి కలుగకుండుట, న+అస్తి=లేదు, భావపక్షసమాశ్రయాత్=భావపక్షము నాశ్రయించుటవలన, సాధ్యమ్=సంభవము, భావతః=భావమునుబట్టి, గౌరవమ్=మాన్యత.

వివరణము:- ఫలమును చింతించుట, ఈశ్వరార్పణము చేయుట, చేయక నిష్కామియై కర్మ చేయుట అను మూడు వైఖరుల మంచి చెడ్డలను గూర్చి విచారించుటయైనది. ఈ మూడు వైఖరులు గాక సద్గురువు మరి వేరుగను ఉపదేశించవచ్చును. వాని విషయమున భావయుతమైన పక్షము నాశ్రయించుటవలన కర్మక్షయము సాధ్యము. భావనతో సమానముగ మరియే ఇతరమునకును గురుత్వములేదు. భావముచే గ్రహింపబడిన కర్మము వలననే లౌకికఫలమైనను అలౌకికఫలమైనను కలుగుచున్నది. చిత్తమే కదా సర్వవృత్తులకు కారణము.

అవతారికా:- అనేకవిధసంవాదిభ్రమాణామపి చిత్తశుద్ధిరేవోత్తమం ఫలమిత్యాహ-

శ్లో॥ సంవాదిభ్రమరూపాణాం కర్మణామప్యనేకశః।
శ్రితానాం భావతః శుద్ధిర్మనసః పరమం ఫలమ్॥ 41

వ్యాఖ్యా:- సంవాదీత్యాది। శ్రుతిస్మృతిపురాణోపదిష్టానామనేకశోఽనేకవిధానాం సంవాదిభ్రమాణాం సాలగ్రామశిలాదిప్రతిమార్చనపరమేశ్వరచరితోపలక్షితపుణ్య-భూమిదర్శనైకదశ్యాదివ్రతానుష్ఠానగఙ్గాయమునాపుష్కరాదితీర్థస్నానతులసీవనాది-పాలనాశ్వత్థాదిపుణ్యతరుప్రదక్షిణీకరణప్రభృతీనామపి భావత ఏవానుష్ఠితానాం మనసః శుద్ధిః పరమం ఫలమ్। "పరో హి యోగో మనసః సమాధి" రితి వచనాత్ చిత్తశుద్ధేరన్యస్య పరమఫలత్వాభావః సూచితః। ఏవం చ "కర్మణైవ హి సంశుద్ధిమాస్థితా జనకాదయః" ఇత్యాదౌ సంశుద్ధిశబ్దస్య చిత్తశుద్ధిరేవార్థః ఫలితః।

"సప్తైతా మోక్షదాయికాః" ఇత్యాదావపి మోక్షశబ్దస్య చిత్తశుద్ధిపరతయా పరమ్పరాఫలతయా వార్థసఙ్గతిః। "పరమం పదమాప్నోత్యుపోష్యైకాదశీవ్రతమ్" ఇత్యాదావపి పరమపదప్రాప్తిః పరమ్పరాఫలం, చిత్తశుద్ధేరనన్తరమేవ ఉత్తర-భూమేర్లాభాదిత్యర్థః। "సాయుజ్యం భావమాప్నోతి సాలగ్రామశిలార్చనాత్" ఇత్యత్రాపి సంయోగస్యైవ ధాత్వర్థత్వాచ్చిత్తశుద్ధిద్వారా సారూప్యాదిలాభపరం సాయుజ్యపదమ్। "ఉత్తమం పదమాప్నోతి పుణ్యవృక్షప్రదక్షిణాత్" ఇత్యత్రాపి నష్ఫేతాది పాతకకృశకారిత్వేన శుద్ధిపరమేవోత్తమపదమ్। ఏవం చతుర్ధామాదిదర్శనగఙ్గాస్నానాదీ-నామపి చిత్తశుద్ధిద్వారైవ తత్తత్ఫలప్రదత్వం పర్యవసీయతే। పరోక్షప్రియపరమశ్వర-నిఃశ్వసితానాం వేదానామపి పరోక్షప్రియత్వాత్ ప్రవృత్త్యర్థముత్తరసోపానప్రదర్శనేన ఉత్తరసోపానారోహణైకకారణప్రథమసోపానప్రాప్తిఫలోపదేశకత్వాద్విజ్ఞానభూలాభ-మత్తరా స్వరూపసమ్పల్లాభాసమ్భవాత్ అఖిలానామపి సత్కర్మణామన్తఃకరణ-శుద్ధికరత్వమేవేతి భావః॥

అవతారిక:- అనేకవిధములైన లాభములను చేకూర్చు భ్రమలకు గూడ చిత్తశుద్ధియే ఉత్తమ ఫలమని చెప్పబడుచున్నది.

ప్రతిపదార్థము:- అనేకశః=అనేక విధములుగ, సంవాదిభ్రమరూపాణామ్=లాభము లను సంపాదించునట్టి, శ్రితానామ్=అనుబంధములైన, కర్మణాం+అపి=కర్మలకు గూడ, మనసః=మనస్సునకు, భావతః=భావసంబంధి, శుద్ధిః=శుద్ధి, నైర్మల్యము, పరమమ్=అతిశ్రేష్ఠమైన, ఫలమ్=ఫలము, లాభము.

**వివరణము:-** భ్రమ అనుదానికి సంచారికార్యములు, అనగా ఉపకారక కార్యములు లేక ఔపచారిక కర్మలు, అని అర్థము జెప్పవలయును. అప్పుడు వేదములలోను పురాణములలోను మనుస్మృతి మొదలగు గ్రంథములలోను చెప్పబడిన అనేక విధములైన కర్మలు గ్రాహ్యములగును. సాలగ్రామపూజనము, దేవతామూర్తి ఆరాధనము, ఏకాదశీవ్రతము మొదలగు వ్రతముల నాచరించుట, గంగా, యమున మొదలగు పుణ్యతీర్థములలో స్నానము జేయుట, వివిధ దేవతామూర్తులు వేంచేసియున్న పుణ్యక్షేత్రములను దర్శించుట, తులసీవనములను పెంచుట, అశ్వత్థము మొదలగు పుణ్యవృక్షములకు ప్రదక్షిణ నమస్కారములు చేయుట, ఇట్టి కర్మలు లక్ష్యార్థములగును. ఇట్టి కర్మలు గూడ భావతః అనుష్ఠించినప్పుడు మాత్రమే చిత్తము శుద్ధముకాగలదు. **పరో హి యోగో మనసః సమాధి** అను వచనమువలన చిత్తశుద్ధిని మించిన వేరొక ఫలము ఈ కర్మలకు లేదని సూచింపబడినది. ఇట్లే, **కర్మణైవ హి సంశుద్ధిమాస్థితా జనకాదయః** మొదలగు వాక్యములయందు గూడ సంశుద్ధి శబ్దమునకు ఫలితార్థము చిత్తశుద్ధియే. **సప్తైతా మోక్షదాయికాః** మొదలగు వానిలో గూడ మోక్షశబ్దమునకు చిత్తశుద్ధిపరత్వముచేత లేక పరంపరాఫలముగా మోక్షము లభించుననియే అన్వయార్థము. **పరమం పదమాప్నోత్యుపోష్యైకాదశీవ్రతమ్** మొదలగు వానియందు గూడ పరంపరాఫలమైన పరమపదప్రాప్తి చిత్తశుద్ధికి తర్వాతనే ఉత్తరభూమి లాభముగా, అనగా ఫలస్వరూపముగ, లభించుటే అర్థము. **సాయుజ్యం భావమాప్నోతి సాలగ్రామ శిలార్చనాత్** అను నిచ్చట గూడ సంయోగధాతువుయొక్క అర్థమునుబట్టియే చిత్తశుద్ధి ద్వారమున పొందు సారూప్యాదిరూపమైన లాభమునే సాయుజ్యం పదము చెప్పును. **ఉత్తమం పదమాప్నోతి పుణ్యవృక్షప్రదక్షిణాత్** అను వాక్యమునగూడ సంచితము మొదలగు పాతకములను కృశింపజేయుట ద్వారా ఉత్తమపదము లభించుననుటకు మూలము ఆ కర్మకు గల శుద్ధిచేయు లక్షణమే. ఇట్లే దేవతాదర్శనము, గంగాస్నానము మొదలగు వానికిని చిత్తశుద్ధిద్వారముననే పర్యవసానముగ ఫలప్రదత్వము, పరోక్ష ప్రియుడైన పరమేశ్వరుని నిఃశ్వాసమై వెలువడిన వేదములకు గూడ పరోక్షప్రియత్వ-మున్నందున ప్రవృత్తి కొరకై ఉత్తరసోపానప్రదర్శనచేత ఉత్తరసోపానము నారోహించుట యను ఒకే ఒక్క కారణమగు ప్రథమసోపాన ప్రాప్తిరూపమున ఫలము చెప్పబడుటవలన విజ్ఞానలాభమును మించిన స్వరూపసంపల్లాభము అసంభవ మగుటవలన సత్కర్మ లన్నిటికిని అంతఃకరణశుద్ధియే లక్ష్యమని గ్రహింపవలెను.

అవతారికా:-చిత్తశుద్ధేః క్వచిదంశేనాప్యుపకారిత్వాభావాదాసురత్వాత్ శ్రమాదిమాత్రఫల-ప్రదత్వాద్విసంవాదిభ్రమాణాం తు హేయత్వమేవోచితమిత్యాశయేనాహ -

*శ్లో॥ విసంవాదిభ్రమాణాం తు సంస్కారస్యానుపక్షయాత్ ।*
*తజ్జన్యభ్రమసమ్ప్రత్తేరనన్తత్వాత్ ఫలం శ్రమః॥* **42**

వ్యాఖ్యా:- విసంవాదిభ్రమాణామితి। శుక్తౌ రజతబుద్ధిర్మరీచౌ జలబుద్ధిః దీపప్రభాయాం మణిబుద్ధిరిత్యాదయో విసంవాదిభ్రమాః తే యేషు కర్మసు తేషాం చిత్తశుద్ధిర్లౌకికప్రాప్తిశ్చ ఫలం న, కిన్తు శ్రమః పరిశ్రమమాత్రం ఫలమ్। తత్ర హేతుః పూర్వజాతభ్రమ-సంస్కారస్యానుపక్షయాదనుపశమాత్ । తస్య చ సంస్కారస్య భ్రమాన్తరజనకత్వాద్ భ్రమసమ్ప్రత్తేరపి అనన్తత్వాత్ అపరిసమాప్తేర్హేతోర్విసంవాదిభ్రమస్య శ్రమేతరఫలా-జనకత్వాత్ న సత్ఫలలవోదయోఽపి ఇత్యర్థః సద్గురుచరణసేవనం వినైవ కార్యసిద్ధి-మభివాఞ్ఛతాం దైవతోత్పథస్థితానాం ప్రాకృతానాం ప్రాయశోఽనిష్టప్రాప్తిరేవ ఫలమితి భావః॥

అవతారిక:- చిత్తశుద్ధికి యే ఒక్క అంశముచేతగాని ఉపకారము లేనందువలనను ఆసురమైనందువలనను శ్రమమాత్రమే ఫలముగ లభించుట కారణముగను లక్ష్యమునకు విరుద్ధమై నిష్ప్రయోజనమైన కర్మలు హేయములే అను భావమున చెప్పెను.

ప్రతిపదార్థము:- విసంవాదిభ్రమాణాం (కర్మణాం) తు=(లక్ష్యమునకు) విపరీతములైన కర్మల విషయమున నయితే, సంస్కారస్య=సంస్కారముయొక్క, (లేక, వాసనలయొక్క), అనుపక్షయాత్=ఫలరూపముగ నశింపకుండుట వలన, తత్+జన్య=దానినుండి పుట్టిన, భ్రమసమ్ప్రత్తేః=చాంచల్యముయొక్క (లేక, కాల్పనికతయొక్క), అనన్తత్వాత్=అంతములేకుండు లక్షణమువలన, ఫలమ్=అట్టి కర్మలకు లభించు ఫలము, శ్రమః =శ్రమము (లేక, వృథాయాసము).

వివరణము:- కర్మనుండి విముక్తి పొందగోరువారికి విహితకర్మలవలన చిత్తశుద్ధి కలుగును. విహితములు కానివి విపరీతకర్మలు, విరుద్ధకర్మలు. వీనిని ఆచరించుట-వలన చిత్తము శుద్ధము కాదు, మరింత వికారముల పాలగును. కనుక ఈ కర్మలు ఆసురకర్మలగుచున్నవి. అనగా రాక్షసకర్మలగుచున్నవి. ముత్తెపు చిప్పను జూచి వెండి యనుకొనుట, ఎండమావిలో నీరున్నదనుకొనుట, దీపపుకాంతిని జూచి మణి యనుకొనుట, ఇట్టివి విసంవాదిభ్రమలు, అనగా ఫలము లేని ఊహలు. వీనికి

లౌకికఫలములే కలుగవు. ముత్తె  చిప్పను వెండిగా తాను భ్రమించిన వానికి ముత్తెపు చిప్పల నెన్నిటిని ప్రోగుచే  నినను లోకమున మతిభ్రష్టుడని కాక సంపన్ను డను పేరు రాదు. అట్లే, ఎండ  ులలో నీరును ఊహించినవారికి త్రాగుటకు నీరు దొరకదు, వాని దాహ మా  . ఇట్టిచో వానికింక ఈ భ్రమలవలన కలుగు చిత్తశుద్ధి యేమి? అదిగాక, ఈ  లు అంతులేనన్ని. వానికి తావిచ్చిన చిత్తము చంచలమై పంకిల మగుట తప్ప  తము కాదు, నిర్మలమును కాదు. మిగులునది, ముత్తెపు చిప్పలను ఏరికొనుట  వలె, దాహశాంతికై ఎండమావుల వెంట పరువెత్తుటలో వలె, వృథాశ్రమ మ  మే. ఇట్లు మానవుడేల భ్రాంతుడగుచున్నాడు? అని విచారించిన, పూర్వపు  సంస్కారము వృద్ధియగుచు జన్మజన్మలకు వృథాశ్రమకాగా దానివలన కలుగు  ంచి యే కొంచెమైనను లేదు, అని అర్థమగును. కార్యసిద్ధిని (అనగా నిచట చిత్తశు  ుని భావము) కోరుకొను దేవతామార్గమును తప్పిన, సద్గురువు నాశ్రయించని లౌకికులకు బహుశః అనిష్టమే లభించును తప్ప ఇష్టలాభము కలుగదు.

**అవతారికా:- నను ఫలానుసన్ధానరహితస్యైవ కర్మణశ్చిత్తశుద్ధిజనకత్వే తస్యా మహత్తరఫలత్వాత్కథమఫలత్వం తస్యేత్యాశఙ్క్య జనకత్వమేవ అసిద్ధమిత్యాహ-**

**శ్లో॥ నాఫలం జనకం కర్మ చిత్తశుద్ధేః స్వభావతః।**
**ఉపఘూతాన్తరాశక్త్యా జాతత్వాజ్జలశుద్ధివత్ ॥ 43**

**వ్యాఖ్యా:- నాఫలమితి। స్వర్గాదిఫలరహితం కర్మాన్తఃకరణశుద్ధేర్జనకం న భవతి, ఉపఘూతాన్తరాశక్త్యా స్వభావతో జాతత్వాదితి హేతుః ఉపఘూతాన్తరాణాం చిత్తమాలిన్య-కరస్వర్గాది వాసనానామశక్త్యా అసమ్బన్ధేన స్వతో జాయమానత్వాద్ అఫలకర్మాన్తః-కరణశుద్ధ్యోః న సాక్షాజ్జన్యజనకభావః, కిన్తు ఉపకార్యోపకారిత్వం, జలశుద్ధివత్। యథా జలం పూర్వమాలిన్యకరోపఘూతకేతర-అఉపఘూతకవస్తు-అసమ్బన్ధేన స్వయ-మేవ ప్రసీదతి తథా చిత్తమపి కర్మణోఽర్వాచీనఫలరాహిత్యే సతి స్వయమేవ ప్రసీదతీత్యర్థః జనకత్వోక్తిస్తు ఔపచారికీ శిష్యబోధికా వా శేషపరికల్పితా వేతి నోక్త-విరోధః ఫలాపృక్తస్య కర్మణో జాతాయాశ్చిత్తశుద్ధేః సహకారికారణత్వం, జాయమానా-యాశ్చ ఉపకారిత్వం, జనకత్వాధికతరమేవేతి భావః॥**

**అవతారిక:- ఫలాపేక్షలేని కర్మకే చిత్తశుద్ధిని కలిగించులక్షణమున దానియందు**

మహత్తరఫలలాభమున్నది కదా, మరి దానికి అఫలత్వమెట్లు పొసగునని విచారించి, అట్టి కర్మకు ఫలజనకత్వమే సిద్ధము కాదనును.

ప్రతిపదార్థము:- చిత్తశుద్ధేః జనకం కర్మ=చిత్తశుద్ధిని కలిగించు కర్మ, ఉపఘాత+అన్తర +అశక్త్యా=తద్విపరీతమైన అవరోధమును కలిగించుటకు శక్తిలేకపోవుటచేత, స్వభావతః=సహజముగ, జలశుద్ధివత్=శుద్ధిచేయు జలమువలె, జాతత్వాద్=యేర్పడి నందున, అఫలం న=అఫలము కాదు..

వివరణము:- ఎట్టి లౌకికఫలమును ఆశించక చేసిన కర్మకు చిత్తశుద్ధిని కలిగించుట అను ఫలమున్నది కదా, ఇది లౌకికమైన ఫలములకు మించినదే కదా, మరి దానిని అఫలకర్మ (ఫలరహితమైన కర్మ) అనుట తగునా? అన్నది ప్రశ్న. అయితే, కామ్యకర్మల -వలన లభించు స్వర్గాది ఫలములకును సుఖదుఃఖాది ఫలములకును మాత్రమే కర్మఫలములని వ్యవహారము. మోక్షకామన కామన కానట్లే, ఆముష్మికము ఫలము కాదనునది వాదము. ఈ ఫలము లక్ష్యముగ సాగు కర్మ నిష్కామము. కనుక అఫలము అనుటలో ఫలము అనునది లౌకికము అని నిష్కర్ష. అట్టిచో, చిత్తశుద్ధిని మాత్రమాశించి చేయు కర్మకు లౌకికఫలము లేదు. కనుక, అట్టి విహితకర్మ అఫలము అనవచ్చును. కాని చిత్తశుద్ధి ఫలమే కాదనుటెట్లు? అను సంశయము వీడదు. దీనికిక్కడ సమాధానము: శుద్ధిని చేయు జలములకు, శుద్ధియైన పాత్రయొక్క శుద్ధికి సంబంధము జన్యజనకసంబంధమనవచ్చునా? సూక్ష్మముగ పరిశీలించిన, పాత్ర-శుద్ధియగుటలో జలము ఉపకారకమే తప్ప జనకము కాదు కదా. కనుక చిత్తము శుద్ధమగుటలో కర్మయు శుద్ధిజనకము గాక శుద్ధికారకమగు ఉపకరణమే యనుట సరి. ఇట్లు చిత్తశుద్ధిని చేయు కర్మకు ఉపకారకశక్తి తప్ప జనకశక్తియే లేదు కనుక అది అఫలకర్మయే యని సిద్ధాంతము. ఈ కర్మవలన జరుగుచున్నది, మరల జన్మకారకమగు అనుభవరూప కర్మకు తావులేని, సంస్కారరూపక్రియయే. దీనివలన కుసంస్కారములు ప్రక్షాళితము లగుట తప్ప క్రొత్తగ సంస్కారములు పుట్టుటలేదు. కనుక ఈ కర్మ సహకారి మాత్రమే, ఉపకారి మాత్రమే అని పద్మపాదుల వివరణము.

**అవతారికా:- నను చిత్తశుద్ధ్యుపకారకత్వ-వైరాగ్యోదయకరత్వ-పరోక్ష-సంవిత్కరాదిభిః కర్మణః పరమఫలదర్శనాదఫలత్వమేవాసిద్ధమితి చేత్ సాక్షాత్ పరమ్పరయా వా ఆత్మ-జ్ఞానోదయకారిణాం భావశుద్ధ్యాదీనాం ఫలత్వవ్యపదేశోఽ సిద్ధిః సిద్ధశ్చేదప్యభ్యుదయకర ఏవేత్యాహ -**

శ్లో॥ కర్మణః కౌశలం హ్యేతచ్చిత్తశుద్ధ్యుపకారకమ్।
న తత్ఫలం ఫలం ప్రోక్తమాత్మజ్ఞానోదయార్థతః॥ 44

వ్యాఖ్యా:- కర్మణ ఇతి । యత్కర్మ కృత్వా చిత్తశుద్ధేరుపకారో భవతి ఏతదేవ కర్మణః కౌశలమ్, అబన్ధకత్వాత్। అతోఽబన్ధక చిత్తశుద్ధిరూపం యత్ఫలం తద్బన్ధకఫలాన్తరవ -త్ఫలం న భవతి। కుతః? ఆత్మజ్ఞానోదయార్థతః ఆత్మజ్ఞానస్య స్వరూపసమ్ప్రాప్తేరుదయో యస్మాత్తత్ప్రయోజనత్వాత్, చిత్తశుద్ధేరాత్మజ్ఞానస్యేష్టసాధనత్వాత్తదుదయోపకారిపదార్థస్య న తథత్వమిత్యర్థః। స్వరూపసమ్పల్లాభలాలసానామబన్ధకకర్మాచరణస్యైవ సర్వస్వత్వాదితి భావః॥

అవతారిక:- చిత్తశుద్ధిని సాధించుటలో ఉపకరణమగుట, వైరాగ్యము నుదయింప జేయుట, పరోక్ష జ్ఞానమునకు కారణమగుట, మొదలైన లక్షణములచేత కర్మకు పరమఫలమును దర్శించు గుణమేర్పడి, అందువలన కర్మ అఫలమైనట్లయితే, లేక సాక్షాత్ పరంపరాగతమైన ఆత్మజ్ఞానమును కలిగించునట్టి భావ (చిత్త) శుద్ధి మొదలగు వానికి ఫలమున్నదనుట సిద్ధించదనుట సిద్ధమేయైనను అది అభ్యుదయమును కలిగించునదే అని చెప్పుచున్నాడు.

ప్రతిపదార్థము:- కర్మణః=కర్మయొక్క, కౌశలం హి=నైపుణ్యమే, ఏతత్=ఈ, చిత్తశుద్ధి +ఉపకారకమ్=చిత్తశుద్ధి యనుదానికి ఉపకరణము, తత్+ఫలం=దానియొక్క, (ఆ) ఫలము, ఆత్మజ్ఞాన=ఆత్మజ్ఞానముయొక్క ఉదయ+అర్థతః=ఉదయము కారణముగ, ఫలమ్=ఫలము అని, న ప్రోక్తం=చెప్పబడలేదు.

వివరణము:- చిత్తశుద్ధికైన కర్మ బంధించు గుణము లేనిది. కనుక బంధించు గుణమున్న కర్మల ఫలమువలె నిది ఫలము అనరానిది, చిత్తశుద్ధివలన ఆత్మజ్ఞానము లక్షితము కనుక. ఆత్మజ్ఞానమునకు లక్ష్యము బంధవిముక్తియే కనుక ఆ లక్ష్యమును సాధించు కర్మ బంధకము కాదు. అందుచే అట్టి సాధనమగు చిత్తశుద్ధికారకమైన కర్మ అఫలమనియే చెప్పనగును.

అవతారికా:- అహో కేషాంచిత్తు కర్మగతసఫలత్వాఫలత్వ-సమర్పణానర్పణాది మహాజాలవిస్తృతిమన్తరేణైవ జీవన్ముక్తానాం శ్రుతత్వాత్కర్మసమాప్తిం వినా జీవన్ముక్తేః అన్యథానుపపత్త్యా కర్మసమాప్తిరనుమీయతే। తత్ర క్వ గతేయం ఫలానుసన్ధిరాహిత్యాది కథా ఇత్యాశఙ్క్య పూర్వజన్మకృతకర్మకౌశలపరిపాకాదేవాత్ర వైరాగ్యాదిసమ్ప్రాప్తేరుదయ ఇత్యనాయాసేనైవ పరిహరతి -

శ్లో॥ దృఢవైరాగ్యతో వాపి ద్వివిధోపరతేస్తథా ।
కర్మనిర్వృతిరాఖ్యాతా సంస్కారాదేవ కర్మణః॥ 45

వ్యాఖ్యా:- దృఢవైరాగ్యత ఇతి । పూర్వజన్మకృతం కర్మ కౌశలాభ్యాసేన విషయాత్యన్తభోగ-పరిపాకతో వా పూర్వజన్మావలీకృతానేకకర్మస్మరణేన వా సముత్పన్నేన పురూరవో-భరతసనకాదీనామివ దృఢవైరాగ్యోదయేన సకలానామపి కృతానాం క్రియమాణానాం చ కర్మణాం నిర్వృతిర్భన్ధకారిఫలానుత్పత్త్యా సమాప్తిరాఖ్యాతా ఆచార్యైః సంస్కార-రూపేణ స్థితాత్ కర్మణ ఇత్యుక్త్యా అకృతాభ్యాగమదోషోఽపి నిరస్తః తథా ద్వివిధోపరతే-రపి కర్మద్వయసమాప్త్యా జీవన్ముక్తిరుదేతి ఇత్యాశయేనాహ ద్వివిధోపరతేరితి। అత్మేతరానుసన్ధానేన కృతానాం కర్మణాం తుచ్ఛత్వాదప్రయోజనత్వాదాత్మాను-సన్ధానాన్తరాయాచ్చ యా విస్మృతిః సా కృతోపరతిః॥

కిఞ్చ ప్రారబ్ధస్య బలవత్తరత్వాదదృష్టత్వాచ్చ క్రియమాణానాం స్వభావతో భవిష్యతాం చ కర్మణాం కర్మత్వావిశేషేణ తుచ్ఛత్వావగమాత్ అత ఏవ అత్మేతరానుసన్ధానాది ఫలానుదయేన జ్ఞానపూర్వరూపోదయేన వా యా విస్మృతిః సా కర్తవ్యోపరతిః॥ తథావిధోపరతేశ్చ కర్మసమాప్తిః ప్రోక్తా, ఫలతుచ్ఛత్వదృష్టేరేవ అత్మేతరానుసన్ధానాది వాసనానుదయహేతుత్వాదితి భావః॥

అవతారిక:- ఔరా! కొందఱియందైతే కర్మసంబంధమైన ఫలము సిద్ధించుట-సిద్ధించ-కుండుట, ఫలము నీశ్వరార్పణగావించుట-కావించకుండుట మొదలైన పెద్ద వల విసరుట యనునది లేకుండగనే జీవన్ముక్తుల గూర్చి వినబడుట వలన, కర్మరాహిత్యము లేకుండ మరియొక తీరున జీవన్ముక్తి కలుగనందున, కర్మసమాప్తిని తర్కబద్ధముగ గ్రహింపవచ్చును. అట్టిచో ఈ నిష్కామకర్మ మొదలగు ఉదంతమంతయు యేమైనట్లని విచారించి, పూర్వజన్మసుకృతమువలన యేర్పడిన వాసనల కారణముగనే వైరాగ్యము మొదలైన సత్త్వగుణసంపద కలుగుట యని సులభముగనే పరిష్కరించుచున్నాడు.

ప్రతిపదార్థము:- దృఢవైరాగ్యతః=స్థిరమైన వైరాగ్యమున్నందువలన, వా=లేక, సంస్కారాత్ =పూర్వజన్మవాసనల బలమువలన, తథా ఏవ=అట్లే, కర్మణః=కర్మయొక్క ద్వివిధ= రెండు విధములైన, ఉపరతేః అపి=అనుభవము నుండి కూడ, కర్మనిర్వృతిః =కర్మ నాశము, ఆఖ్యాతా=చెప్పబడినది.

వివరణము:- కొందఱి విషయమున, వారి కర్మలు ఫలసహితములా? ఫల-రహితములా? ఆ యా కర్మఫలములను వారు ఈశ్వరార్పణ చేసినారా? చేయలేదా?

ఇత్యాది తర్కవితర్కములవలన బాధించక, సూటిగ వారు జీవన్ముక్తులని చెప్పబడినది. పురూరవుడు, భరతుడు, సనకసనందనాది ఋషులు ఆ కోవకు చెందినవారే. అయినను కర్మఫలము ననుభవించియే తీరవలె. వేరొక విధమున జీవన్ముక్తి లేదను సిద్ధాంతము అర్థవంతమేయైన, మరి పై జెప్పిన వీరి విషయమున నది వర్తించునని చెప్పలేము కద! కర్మ కామ్యము కారాదు అను కథ కేమి గతి? అనగా, పై నుదహరించిన వారందరు పూర్వజన్మసుకృతమువలన నిశ్చలమైన వైరాగ్యమును పొంది, అందు మూలమున పూర్వము చేయబడినవి, ఇప్పుడు చేయబడినవి అయిన సమస్త కర్మల నుండి బంధవిముక్తులై జీవన్ముక్తులైనారని ఆచార్యులు వివరింతురు. ఇట్టి జీవన్ముక్తుల కర్మలు ఆత్మద్యోతకములు కనుక అవి తుచ్ఛములు కావు, బంధకఫలము లిచ్చునవి కావు. కాగా వారి కర్మలే కర్మసమాప్తిని కలిగించునవైనవి. వారు జీవన్ముక్తులైనారని భావము.

**అవతారికా:- నన్వయం కర్మనిర్హణోపాయవిధిః సర్వేషామవిశేషేణోక్తః, అస్తి వా కేషాంచిత్ కశ్చిద్విశేష ఇత్యాశఙ్క్య ఉత్తమభూతిం ప్రాప్తానాం నాతీవ ఆవశ్యకః, అర్వాచీనానాం త్వావశ్యక ఇత్యాశయేనాహ –**

**శ్లో॥ దైవసమ్పత్ప్రసూతానాం స్వభావాత్ సిద్ధిరుచ్యతే।**
**ఆసురీమభిజాతానాం సత్త్వసమ్పత్సమాశ్రయాత్॥ 46**

**వ్యాఖ్యా:– దైవసమ్పత్ప్రసూతానామితి । శమదమతపఃశ్రద్ధాదయాదిరూపా దైవీసమ్పత్। తద్భోగార్థం యే ప్రసూతాస్తేషాం స్వభావాదపరిశ్రమాదేవ సిద్ధిరన్తఃకరణశుద్ధిరూపా-కర్మసమాప్తిరూపా వోచ్యతే। యద్వా యత్ర దైవీసంపద్ దైవసమ్పదో యోగినస్తత్ర ప్రసూతానామపి స్వభావాత్సిద్ధిర్జాయతే । యోగికులే జన్మాపి పూర్వజన్మ కృతకర్మ కౌశలాదేవ భవతి, అన్యథాకృతాభ్యాగమప్రసఙ్గః॥ యద్వా ఔత్కట్యేన కృతాసు దైవసమ్పత్సు ప్రసూతిః స్థితిర్యేషాం తేషామపి సా తథైవ ।**

**ఆసురీణాం స్వధర్మారతి-పరధర్మప్రీతి-హింసాక్రోధపారుష్యాత్యన్తాసద్విషయాభి-రుచిప్రభృతీనామసురసమ్బన్ధిసమ్పదాం పూర్వజన్మని కృతానామ్ ఉత్కటత్వేనాత్ర-కృతానాం వా భోగార్థం జాతానాం వర్తమానానాం వాసురసమ్పద్విలసితజన-సంసర్గిణాం వా సత్త్వసంపత్సమాశ్రయాత్ సత్త్వగుణవర్ధకానాం ఈశ్వరారాధన-రూపాణాం సమ్పదాం సమ్పదాం కర్మణాం దైవసంపల్లక్షణకర్మణాం వా సత్త్వ-**

**సంపత్తిర్యేషాం తేషాం సాధూనాం వా సమ్యగకాపట్యేన శ్రద్ధయానుష్ఠానాత్ పరిశీలనాత్ క్రమేణాన్తఃకరణశుద్ధిర్జాయతే, న స్వభావాదిత్యర్థః సర్వేషాం సర్వార్థవాచకత్వా-త్సాధూనామనేకార్థత్వాద్వా ఉభయత్ర కర్మకౌశల-అకౌశలాన్వయః సిద్ధ్యసిద్ధికర ఇతి భావః॥**

**అవతారిక:-** ఈ కర్మ నశించుటకగు విధిగా చెప్పబడిన ఉపాయములు అందఱకు సమానముగ భేదము లేక చెప్పబడినది కదా, వానియందేదిగాని ఒక విశేషమున్నదా? అని విచారించి, ఉత్తమమైన సంస్కారమును పొందియున్నవారికి అంత ఎక్కువగా ఆవశ్యకత లేదనియును, ఇందుకు విపరీతమైనవారికి మాత్రము ఆవశ్యకత యున్నదని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము:-** దైవసమ్ప్రత్ప్రసూతానామ్=దైవీసంపత్తితో జన్మించినవారికి, స్వభావాత్= స్వభావమువలన, సిద్ధిః=కర్మరాహిత్యఫలము, ఉచ్యతే=చెప్పబడుచున్నది, ఆసురీం+ అభిజాతానామ్=ఆసురీప్రవృత్తితో జన్మించినవారికి, సత్త్వసమ్పత్=సత్త్వగుణ ప్రధానమైన కర్మలను, సమాశ్రయాత్=చక్కగ ఆచరించుటవలన.

**వివరణము:-** మానవులందఱు ఒకే తెఱగైనవారు కారు. వేర్వేరు సంస్కారముల వారున్నారు కదా. అట్టిచో అందఱకు అభిన్నముగ ఒకే విధమైన కర్మరాహిత్యో-పాయములు చెప్పబడుటలోని ఆంతర్యమేమి? ఇందు ఆలోచించి గ్రహించవలసిన విశేషమేమైన ఉన్నదా? అని ఆలోచించి తర్కించగా తేలిన విషయమిది : మానవులలో రెండు తెఱగులవారున్నారు : (1) దైవీప్రకృతి గలవారు, (2) ఆసురీప్రకృతి గలవారు. వీరు స్వభావములలో పరస్పరము పొత్తు కుదురనివారు. వీరి జన్మల సంస్కారములు వేరైనవి, జన్మావరణములు వేరైనవి, ఆలోచనలు వేరు, ఇష్టకర్మలు వేరు. ఒకరు శమము, దమము, తపస్సు, శ్రద్ధ, దయ, ఇత్యాది గుణములు గలవారు. ఇట్లు వీరు సత్త్వగుణప్రధానమైన నడవడిక గలవారు. జన్మతః వీరిది దైవీప్రకృతి. స్వభావసిద్ధముగ వీరికి వైరాగ్యమాది చిత్తశుద్ధికరవైఖరి ఉండియే యున్నది, కనుక అట్టి కర్మలలో ప్రవర్తించుట వీరికి అనాయాసముగ సాధ్యము. వీరి పూర్వజన్మవాసనలు వీరిని ముక్తిమార్గమున సహజముగ నడిపించును. ఇట్లే కర్మశేషము ననుభవింప వచ్చిన యోగుల విషయము గూడ. సదాచార సంపన్నుల ఇంట జన్మించిన వారును పూర్వజన్మ సుకృతము గలవారే. కాని, రెండవ తెఱగువారైన ఆసురీప్రకృతులు మాత్రము పూర్వవాసనాబలమున పరమప్రాకృతులగుటయో లేక తామసులగుటయో

సిద్ధము. కనుక వీరు ఇంద్రియసు . ాలసులై, దానవస్వభావము గలిగి, శ్రద్ధలేక, శమదమాదులు లేక జడజీవనుల ిటయో లేక అకారణక్రోధావిష్టులై దురాచారులగుటయో సంభవించును. వీరికి ూర్వజన్మకుసంస్కారప్రక్షాళన మావశ్యకమగును, దుష్కరమును అగును. ప్రయత్నపూ ్వకముగ వీరు తమను తాము సంస్కరించికొని, సాత్త్వికకర్మలందు మిక్కిలిగ ప్రవర్తించినగాని కర్మరాహిత్యము సాధ్యముగాదు. ఈ భేదవిశేషము తప్పక ఉన్నదని తెలియవచ్చును. ఇట్లు కర్మకౌశలమే చిత్తశుద్ధికిని కర్మరాహిత్యమునకును మూలమని భావము.

అవతారికా:- ఇష్టజ్ఞానాదీనాముప ార్యోపకారిత్వేన కార్యకారణత్వేన వా నిర్ణీతానాం కిం సర్వేషాముత్తమత్వం తారతమ్యం వేత్యత్ర తారతమ్యమేవ ప్రతిపాదయతి -

శ్లో॥ ఇష్టజ్ఞానఫలాసఙ్గ శుద్ధిసంవిద్విరక్తయః।
ఉపరామాత్మసామ్యే చ క్రమేణోత్తమభూమయః॥ 47

వ్యాఖ్యా:- ఇష్టజ్ఞానేతి । ఇష్టజ్ఞానం తావదేతాదృశం కర్మ మమేష్టసాధనమేతాదృశం కర్మ మమానిష్టసాధనమితి కర్మవిషేష్టత్వానిష్టత్వప్రతిపత్తిః।

ఫలాసఙ్గస్తు కర్మనిష్ఠచిత్తశుద్ధివైరాగ్యోపరత్యాది-అబన్ధకఫలేతరస్వర్గాదిబన్ధకఫలసంసర్గాభావః। శుద్ధిరన్తఃకరణశుద్ధిః సా చాసద్విషయవాసనారాహిత్యమ్ । సంవిద్ "బ్రహ్మాస్తి తత్సత్యం, జీవాత్మాపి తదంశో జగత్కర్తృభర్తృహర్తృ చ తదేవ" ఇత్యాకారకపరోక్షజ్ఞానరూపా। విరక్తిః "యథా మమ దేహః స్వర్గాదిఫలం చ కర్మజన్యత్వాదుత్పద్యతే కఞ్చిత్కాలం తిష్ఠతి పునర్నశ్యతి తథా హిరణ్యగర్భాదేర్దేహో లోకో వా కర్మజన్యత్వాదుత్పత్త్యాదిమాన్" ఏవంవిధో విరాగః। ఉపరామః పూర్వోక్తద్వివిధోపరతిః ఆత్మసామ్యం హిరణ్యగర్భాదిపిపీలికాన్తదేహేషు ఆత్మనాం పఞ్చభూతానాం సమత్వం, ఆత్మనశ్చైతన్యస్యాపి సమత్వం సామ్యావలోకనమితి యావత్ । పఞ్చభూతారబ్ధత్వాత్మాన్తరాసత్త్వయోరవిశేషేణ ప్రతిపత్తిరిత్యర్థః। ఏత ఇష్టజ్ఞానాదయః క్రమేణోత్తమభూమయః, ఉత్తమా భూమిః స్థితిర్యేషు తే। ఇష్టజ్ఞానానన్తరమసత్ఫలాప్రవృత్తేరవశ్యభావ్యత్వాత్, ఫలానుసన్ధిరాహిత్యేన కర్మానుష్ఠానానన్తరం చిత్తశుద్ధ్యుదయస్యానివార్యత్వాత్, తదనన్తరం పరోక్షజ్ఞానాసంభవస్యాప్రసక్తేః, పరోక్షసంవిదమన్తరా ప్రాయో వైరాగ్యస్యానుదయాత్ ఉపరతేరపి ప్రాయో వైరాగ్యాధీనత్వాత్ తాం చ వినా పరమాత్మజీవాత్మనోరాత్మపరాత్మనోర్వా భేదానవగమాత్ । ఏతేషాం సాక్షాత్ పరమ్పరయా వా కార్యకారణత్వం,

**ఉత్తరోత్తరతః శ్రైష్ఠ్యం చ। ఏతా ఏవాన్తర్ముఖవృత్తీనామపునర్భవకారకాః సప్తభూమయః పరమాచార్యేణ వ్యాఖ్యాతాః సంసారభీరుభిరాశ్రయణీయా ఇతి భావః॥**

**అవతారిక:-** ఇష్టజ్ఞానాదులయొక్క ఉపకార్య-ఉపకారిత్వము చేతగాని కార్య-కారణత్వముచేతగాని నిర్ణయించబడినవాని కన్నిటికి ఉత్తమత్వమా? లేక తారతమ్యమా? అనగా ఇచట తారతమ్యమునే ప్రతిపాదించుచున్నాడు.

**ప్రతిపదార్థము:-** ఇష్టజ్ఞాన=ఇష్టజ్ఞానము, ఫల+అసఙ్గ=ఫలరాహిత్యము, శుద్ధి=చిత్త-శుద్ధి, సంవిద్=సదాచారము, విరక్తయః=విరక్తి అనునివియన్నియు, ఉపరామ=ఉపరతి, ఆత్మసామ్యే=ఆత్మసామ్యములను రెండు, చ=కూడ, క్రమేణ=ఈ క్రమమున, ఉత్తమభూమయః=ఉత్తమభూములు.

**వివరణము:-** ఉత్తమభూములు అనగా ఉత్తమస్థితులు, యే వ్యక్తియైన లక్ష్యసాధనకు ప్రయత్నించునపుడు తా నుండదగిన దైహికమానసిక స్థితులు. ఇవి : (1) ఇష్టజ్ఞానము, (2) ఫలముతో సంగము లేకుండుట (ఫలాసంగము), (3) శుద్ధి, (4) సంవిద్ లేక సదాచారము, (5) విరక్తి, (6) ఉపరతి, (7) ఆత్మసామ్యము. ఇవి ఈ క్రమమున ఒకదానికంటె నొకటి ఉత్తమస్థితులు. వీని ఉత్తమత్వములోని భేదములే ఈ క్రమమును నిర్ణయించుచున్నవి. స్థితులిట్టివని తెలిసినగాని వాని తారతమ్యము లేమో తెలియరావు.

**1) ఇష్టజ్ఞానము:-** ఇచట ఇష్టశబ్దమునకు ఇంద్రియ సంబంధమైనది అని అర్థము. ఇట్లు ఇష్టజ్ఞానమనగా ఇంద్రియములను గూర్చియు వానివలన కలుగు సుఖ-సంతోషములను గూర్చియు సతర్కమైన సమగ్రజ్ఞానము. ఈ జ్ఞానమే తర్వాతి భూమియగు ఫలాసంగమును సాధించుటకు సాధనము. ఇదిలేని వాని స్థితి కేవలము ఇంద్రియలాలసతో నిండిన జంతుజీవనస్థితి. కనుక ఇష్టజ్ఞానము సాధకునకు ఉపకారియగు మొదటి భూమి లేక మానసిక స్థితి.

**2) ఫలాసంగము:-** వ్యక్తి తాను చేయు కర్మల యొక్క ఫలముల నాశించకుండుట. కర్మ చేయుట కుపక్రమించునప్పుడు ఫలముపై కోరికలేక నిష్కాముడైయుండి, కర్మ విహితమను భావమున స్థిరుడైయుండి, కర్మచేయగా సిద్ధమైన ఫలమును త్యజించి, దాని నీశ్వరార్పణగావించుచు, కర్మకు కట్టుబడకుండు స్థితి. ఇది మూడవది యగు శుద్ధికి మార్గము.

**3) శుద్ధి:-** చిత్తము లేక అంతఃకరణము నలమికొనియున్న మాలిన్యము తొలిగిపోయి నిర్మలమైన అద్దమువలె ప్రకాశించు స్థితి. ఇట్లు ఇప్పటికి సాధకుడు ఇంద్రియ-

జ్ఞానమును సంపాదించుట ద్వారా నిష్కాముడై కర్మచేయుచు ఫలము నీశ్వరార్పణము చేసి, అంతఃకరణశుద్ధిని సాధించినవాడగును. కాని ఈ స్థితికి చేరుట కాలక్రమమున సాధ్యమగునది, తటాలున లభించునది కాదు. లోని చిత్తమాలిన్యమును తుడిచి వేయుటకు సదాచారమను నాల్గవ స్థితి దోహదమగును.

**4) సంవిద్:-** సంవిద్ అనగా బాగుగా నెఱుగుట యని ఒక అర్థము. దీనిని బట్టి ఇంద్రియాది ఇష్టజ్ఞానము కాని విశిష్టజ్ఞానమని చెప్పవచ్చును. ఇట్లు అతీంద్రియ జ్ఞానమని ఒక అన్వయము చేయవచ్చును. పై మూడింటిని సాధించుట కవసరమైనది పరంపరాగతమై విహితకర్మానుష్ఠానరూపమైన సదాచారము. కేవల అతీంద్రియ-జ్ఞానమువలన విరక్తి కలుగుననుట లోక విరుద్ధము. లోకమున కనబడునది అతీంద్రియజ్ఞానమను శక్తిని సాధించినవారు లౌకికలాభలోభులైపోవుటయో దంభ-ప్రదర్శకులుగ కుహనాప్రవక్తలగుటయో తప్ప విరాగులగుట కాదు. సదాచార-సంపన్ననకే వైరాగ్యము కాలక్రమమున కలుగుట కద్దు. అందుచేత సదాచారమను నర్థమే గ్రాహ్యము.

**5) విరక్తి:-**ఇంద్రియతత్త్వజ్ఞుడై,ఫలాసక్తిరహితుడై, శుద్ధాంతఃకరణముగలిగి, సదాచార-సంపన్నుడైనవాడు ఇప్పటికే సంసారవిముఖుడైయుండుట ఆశ్చర్యము కాదు. వానియందు లౌకిక సుఖభోగములయందు విరక్తి సహజము. ఈ విరక్తినుండియే తర్వాతిదైన ఉపరామము లేక ఉపరతి జనించును.

**6) ఉపరతి:-** బాహ్యకర్మలయందనాసక్తి. ఇంతకుమున్ను తాను అమిత శ్రద్ధాసక్తులతో నిర్వహించిన ధార్మికకార్యకలాపములందు, వ్రతానుష్ఠానములందు, జపతపాది కర్మలందు పూర్వపు శ్రద్ధాభక్తులు క్రమముగ తగ్గుచు వచ్చి, అంతర్ముఖత్వ మధికమై పరమాత్మాశ్రయభావము స్థిరమైన స్థితి. ముందు జెప్పిన వన్నియు తాను ఆచరించి ఉపకారమును పొంది అవి యేవియు తన లక్ష్యములుగావని, సాధనమాత్రములని గ్రహించి, వానితో పని తీరినదని తెలిసి పరమాత్మనే లక్షించియుండు స్థితి.

**7) ఆత్మసామ్యము:-** తన జీవాత్మను విశ్వములోని సమస్త చరాచరములయొక్క ఆత్మగా దర్శించుచు అన్నిటియందు సమదృష్టికలిగి దేనియందును రాగద్వేషములు లేని విశ్వప్రేమతో నుండు అవధూత స్థితి. ఈ స్థితిని చేరిన తర్వాత మిగిలియుండునది జీవాత్మను పరమాత్మతో నైక్యము జేసి పరమానందమున మనుటయే. కనుక ఇంతవరకీ యేడును భూములు లేక స్థితులుగ చెప్పబడినవి.

పద్మపాదులవారు ఇష్టజ్ఞానము అనగా తన లక్ష్యసిద్ధికి తానేమి చేయవలెనో తెలియుటయనియు, సంవిద్ అనగా పరోక్షజ్ఞానమనియు వ్యాఖ్యానించిరి.

**అవతారికా:** – అన్తఃకరణశుద్ధివైరాగ్యోపరతీనామనర్థనివృత్తిపరమఫలత్వాదనిష్టోప-శమోదయే సతి న పునః కార్యకారిత్వమాశ్రయణీయమిత్యాహ-

శ్లో॥ వైరాగ్యాస్మృతిశుద్ధీనామసదర్థనివృత్తితః।
ఆత్మజ్ఞానోపకారిత్వాదనర్థాన్తా స్మృతా స్థితిః॥ 48

వ్యాఖ్యా: – వైరాగ్యేత్యాది। వైరాగ్యోపరమాన్తఃకరణశుద్ధీనాం స్థితిః కార్యకారితా అనర్థాన్తా స్మృతేత్యన్వయః। అనర్థానామసమ్భావనా–విపరీతభావనా–సంశయానామన్తో నాశో యస్యాస్తావత్కథితా ఇత్యర్థః। అసదర్థనివృత్తితః అసతామర్థానామసంభావనాదీనాం నివృత్తితః నివృత్త్యనన్తరమ్ ఆత్మజ్ఞానోపకారిత్వాదాత్మజ్ఞానోపకారస్య సిద్ధత్వాదిత్యర్థః। అసంభావనా దేహాదావాత్మబుద్ధిః, విపరీతభావనా పుత్రాదావరిబుద్ధిః, సంశయః స్థాణువల్మీకాదౌ పురుషవ్యాఘ్రబుద్ధిః। అతో వైరాగ్యాదీనామనర్థోపశాన్తిప్రయోజనత్వా-దాత్మానుసన్ధానకర్మాఙ్గ–శ్రవణమననాదీతరాసద్విషయనివృత్త్యా ఆత్మజ్ఞానప్రతిబన్ధక-నిరాసే సతి ప్రారబ్ధాసమాప్తావపి జీవన్ముక్తేరుదయాత్ తత్కార్యకారిత్వం నాతీవోప-యుజ్యతే ఇతి భావః।

**అవతారిక:** – అంతఃకరణశుద్ధి, వైరాగ్యము, ఉపరతి, వీనికి అనర్థనివృత్తి పరమఫలము. దీనిచే అనిష్టము సంప్రాప్తించదు. కాగా, దానికింకను కార్యము నిర్వహించుశక్తి యున్నదని భావించరాదు.

ప్రతిపదార్థము: – వైరాగ్య=వైరాగ్యము యొక్క, అస్మృతి=కుసంస్కారము, శుద్ధీనామ్= శుద్ధియగుటయొక్కయు, అసత్+అర్థ=మంచిది కాని అర్థముయొక్క, నివృత్తితః= తొలిగింపువలన, ఆత్మజ్ఞానకారిత్వాత్=ఆత్మను గూర్చి జ్ఞానమును కలిగించుటవలన, అనర్థ+అన్తా=అనర్థమును నశింపజేయునట్టి, స్థితిః=స్థితి, స్మృతా=స్మరించబడినది.

వివరణము: – వైరాగ్యము, ఉపరతి, అంతఃకరణశుద్ధి అనునివి స్థితులు. ఇవి అనర్థము నశించుటవలన కలుగునవి. అనర్థమనగా మూడు రీతులు – 1) అసంభావన, 2) విపరీతభావన, 3) సంశయము. అసంభావన అనగా ఆత్మసత్యత్వమును తిరస్కరించుట, బ్రహ్మమును గ్రహింపనశక్తుడగుట. విపరీతభావన అనగా మిథ్యాజగత్తు సత్యమనుట, ఇట్లే మంచిని చెడుగా నెంచుట. సంశయము అనగా దేనియందును నమ్మికలేకపోవుట. ఇవి అనర్థములు. ఇవి అసదర్థములు అనగా

చెఱుపుజేయు భావనలు. ఇవి నశించినప్పుడు ఆత్మజ్ఞానము కలుగుట కవకాశ-మేర్పడును. ఇవి నశించకున్న ఇహలోకసుఖముసైతము దూరమగుట అనుభవైక-వేద్యమే. కనుక ఈ అనర్థములు నశించినచో ఆత్మజ్ఞానము, సత్యాసత్యములను వివేకించగల శక్తి కలుగును. ఇందుకు వైరాగ్యము మొదలుగా పై జెప్పినవి ఉపకరణములు, ఉపకారకములగును. ఎట్లన ప్రారబ్ధము నశించక అట్టేయున్నను, జీవునకు ముక్తి లభించును.

**అవతారికా:**– సనకశుకవామదేవాదౌ అతిప్రసఙ్గవారణాయ చిత్తశుద్ధివైరాగ్యోపరతీనాం కర్మసమాప్తౌ అసాధారణహేతుతాం నిరస్య అనర్థోపశామకత్వం తు పార్థక్యేన అపి అస్తీత్యాహ –

> శ్లో॥ నావధారణహేతుత్వమేతేషామన్తరఙ్గతా ।
> ఏకైకమప్యనర్థానాం శమనం కిము సంహతిః॥ 49

**వ్యాఖ్యా:**– నావధారణహేతుత్వమితి। ఇష్టజ్ఞానఫలాసఙ్గాదీనామవధారణహేతుత్వమ్ అసాధారణకారణత్వం నాస్తి। ఇష్టజ్ఞానానన్తరమపి ఫలాసమ్బన్ధవృత్తేః వక్తుమశక్యత్వాత్। అసత్ఫలాసఙ్గో మదిష్టసాధన ఇతీష్టసాధనతాజ్ఞానేఽపి ప్రారబ్ధవశతః కేషాఞ్చిత్తత్ర ప్రవృత్తేరభావాత్ । ఫలాననుసన్ధానమన్తరేణాపి చిత్తశుద్ధేర్దర్శనాత్ । చిత్తశోధనప్రయత్న-మన్తరేణైవ కుత్రచిత్సంవిద్వైరాగ్యోదయస్య శ్రుతత్వాత్ । కుత్రచిత్ జన్మానన్తరమేవ ఆత్మజ్ఞానోదయస్య శ్రుతత్వాత్ । కుత్రచిద్వ్యుత్థోదయస్యాపి దృష్టత్వాత్ శ్రుతత్వాచ్చ, అతో నావధారణహేతుత్వమ్। తదభావేఽపి అన్తరఙ్గతా తు అస్త్యేవ । కర్మణి ఫలాసమ్బన్ధవృత్తేర్గఙ్గబాహుల్యేఽపి ఇష్టజ్ఞానస్యైవాన్తరఙ్గత్వమ్। చిత్తశుద్ధేరజ్ఞానమపి ఫలాననుసన్ధానస్యైవాన్తరఙ్గతా । ఏవమగ్రేఽపి వ్యాఖ్యాతవ్యమ్ ।

కిఞ్చ, ఏతేషాం మధ్యే ఏకస్యైకస్య కస్యచిత్ సముదయోఽపి అనర్థానామ్ అసమ్భవాదీనాముపశామకో భవతి, సర్వోదయస్యానర్థనివారకత్వే కిమాశ్చర్యమ్ ఇత్యర్థః "స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయా" దితి భగవదుక్తేః॥

**అవతారిక:**– సనకుడు, శుకుడు, వామదేవుడు మొదలైనవారు అధికప్రసంగమును నివారించుటకై, చిత్తశుద్ధి, వైరాగ్యము, ఉపరతి వీనివలన కర్మసమాప్తి లభించుటలో అసాధారణమైన కారణత్వమున్నదనుటను నిరసించి, అనర్థములు నశించుట యనునది ఏకాంతజీవనము ద్వారా కూడా కలుగుని చెప్పిరి.

ప్రతిపదార్థము:- ఏతేషాం=వీనియొక్క, అన్తరఙ్గతా=కర్మసమాప్తిని కలిగించు లక్షణము, అవధారణహేతుత్వాత్=అసాధారణత్వము కారణముగ, న=కాదు, ఏకైకం+అపి= (వీనిలో) ఒక్కదాని వలన గూడ, అనర్థానామ్=అనర్థములకు, శమనం=నాశము, కిము సంహితః=అన్నియు కలిసినచో ఇంక చెప్పునదేమున్నది?

వివరణము:- చిత్తశుద్ధి, వైరాగ్యము, ఉపరతి అనువాని వలన కర్మ నశించునని కదా గత శ్లోకముల తాత్పర్యము. దానిపై సనక, శుక, వామదేవ మొదలగువారు ఆ చెప్పబడినవానికి అసాధారణ శక్తియుండుటవలన కాదనియు, వానిలో ఏ ఒక్కదానికైనను ఆ శక్తి కలదనియు చెప్పుచున్నారు. ఇష్టజ్ఞానము,ఫలాసంగము మొదలగువానికి అసాధారణమైన కారణశక్తిలేదని వారందురు. ఏలన, ఇష్టజ్ఞానము లభించిన తర్వాత గూడ ఫలముతో సంగము తొలగునని చెప్పుటకు వీలులేదనియు ప్రారబ్ధవశమున ఫలముతో సంగము ఏర్పడుట కనబడుచున్నది కదా యనియు నందురు. అట్లే ఫలాసంగమును సాధించియును చిత్తశుద్ధి కలుగకుండుటయు కద్దు. ఇట్లే పై శ్లోకమున జెప్పిన 7 స్థితులకును కార్యకారణత్వము సహజ సిద్ధము కాదని వారి అభిప్రాయము. ఇట్లనుటలో ఆయా మహాత్ముల భావము ఆ యా స్థితుల ప్రభావమును గూర్చిన అధిక ప్రసంగమును నివారించుటే యని భావింపదగును. ఎట్లన, "స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్" అని గీత చెప్పినయట్లు ఈ యీ చెప్పబడిన స్థితులలో గూడ ఏ ఒక్క స్థితిని చేరికొనినవానికైనను అనర్థములు చేరరావనుట సత్యము. అట్టిచో ఈ స్థితులన్నియు సాధించినవానికి అనర్థ ప్రసంగము కలుగదనుట అత్యుక్తి కాదు.

అవతారికా:- నను సఞ్చితసఞ్చీయమానయోః కర్మణోః ఫలానుసన్ధానరహిత-కర్మానుష్ఠానాదినా శుద్ధిక్రమేణ వస్తుశక్త్యా వా ప్రాయేణోపక్షీణత్వాత్ ప్రారబ్ధస్య చ తదాధారత్వాత్ మూలశైథిల్యే వృక్ష ఇవావచ్ఛిన్నే చ తస్మిన్ పరిమితభోగానుమానేన ప్రాప్తా కృతకృత్యతా జీవాత్మనేత్యాశఙ్క్య, ఉభయేతరప్రారబ్ధోపోద్బలకాశక్త్యా సిద్ధమేవ కృతకృత్యత్వం తత్సంసర్గతస్తూపక్షీణమపి సమేధతే ఏవ ఇత్యాశయేనాహ -

శ్లో॥ కృత్రిమోక్త్యసదన్నాదౌ అనేకేషాం ప్రతిగ్రహః।
ప్రారబ్ధాపథ్యమిత్యాహుర్గురుశాస్త్రవిరోధనమ్॥ 50

వ్యాఖ్యా:-కృత్రిమోక్త్యేత్యాది॥ కృత్రిమోక్తిశ్చ అసదన్నాదశ్చేతి ద్వన్ద్వః కృత్రిమోక్తిః మిథ్యోక్తి-

రనభిప్రాయోక్తిర్వ్యఙ్గ్యనోక్తిర్వా ప్రారబ్ధాపథ్యం ప్రారబ్ధస్య ఉద్దీపకమిత్యాహుః తథా అసదన్నాదో౽సతః శాస్త్రనిషిద్ధస్యాదనం అన్నస్య, అసతాం దుర్జనానామన్నస్యాదనం వా, వర్ణాశ్రమధర్మపతితానాం వా అన్నస్య అదనం తచ్చ ప్రారబ్ధాపథ్యమ్ । అథ నానేకేషాం ప్రతిగ్రహః అనేకేషాం వస్తూనాం ఏకకర్తృకః ప్రతిగ్రహః, అనేకేషాం దాతౄణాం సకాశాత్ప్రతిగ్రహో వా, యద్వా న విద్యతే ఏక ఉత్పత్తికర్తా యేషాం తేషామనేకేషాం సాఙ్కర్యేణ ప్రసూతానాం సకాశాద్వా ప్రతిగ్రహః స చ ప్రారబ్ధాపత్య-మిత్యన్వయః। అపి చ, గురుశాస్త్రవిరోధనం గురూణాం పిత్రాదీనాం శాస్త్రాణాం అనుశాసనకర్తౄణాం వేదానాం విరోధనం తిరస్కారః స చ ప్రారబ్ధాపథ్యమ్ । యద్వా గురు చ తత్ శాస్త్రం చ గురుశాస్త్రం పరమార్థప్రతిపాదకం వేదాన్తశాస్త్రమ్ తస్య విరోధనం నిన్దనమ్ అసత్ఫలప్రతిపాదకకర్మపరత్వేన వ్యాఖ్యానం వా తచ్చ ప్రారబ్ధాపథ్యమ్ యద్వా గురుణోపదిష్టమభీప్సితఫలదాయకం యచ్ఛాస్త్రముపాసనం తస్య నిన్దనం పరిత్యాగో వా ప్రారబ్ధాపథ్యమ్।

యథౌషధాది పరిశీలనేన భోగేన వోపక్షీణో రోగో౽పథ్యవశతః పునరపి దీర్ఘకాలస్థాయీ భవతి తథా కృత్రిమవచనామేధ్యాన్నాదనబహుతరప్రతిగ్రహగురుశాస్త్ర-విరోధైః ఉపక్షీణమపి ప్రారబ్ధకర్మ పునరపి బహుకాలభోగసమాప్యం భవతీతి భావః ॥

అవతారిక:- సంచిత-సంచీయమాన కర్మలకు ఫలాపేక్షలేని కర్మాచరణముచే క్రమముగ శుద్ధి వస్తుశక్తిచేతగాని కాలవశమున క్షీణించుటవలన గాని సంభవించును. ప్రారబ్ధకర్మకు గూడ, నిష్కామము ఆధారమైనందువలన, మూలము శిథిలమైన వృక్షము ఛిన్నమైన యట్లును, భోగానుభవమువలన సార్థకత జీవాత్మకు లభించినది కదా అని విచారించి, సంచిత-సంచీయమానములకంటె వేరైన ప్రారబ్ధమునకు నిర్ణాయకశక్తి లేనందుచేత సిద్ధించినదే సార్థకత, కాని దానితో సంగముచేతనైతే కృశించినదైనను చక్కగ వృద్ధియే చెందునను భావముతో ననుచున్నాడు.

ప్రతిపదార్థము:- కృత్రిమ+ఉక్తి+అసద్+అన్న+అదౌ=కృత్రిమోక్తి, అసదన్నమును తినుట యను రెండు, అనేకేషామ్=అనేకములగు వస్తువులయొక్క, ప్రతిగ్రహః= స్వీకరించుట, గురు=గురువులతో, శాస్త్ర=శాస్త్రము చెప్పినదానితో, విరోధనమ్= విరోధించుట, అనునివి, ప్రారబ్ధ=ప్రారబ్ధముతో, అపథ్యమ్=పొసగునవి కావు, అనగా, ప్రారబ్ధముతో చేరినప్పుడు అపకారము చేయునవి, ఇతి=అని, ఆహుః=అందురు.

వివరణము:– ప్రారబ్ధకర్మ కేవలము అనుభవించి తీర్చుకొనదగినదే కాని మరియొక దానిని నిర్ణయించగలది కాదు. ఈ విషయమున ఇది సంచితమునకు సంచీయమాన–కర్మకు భిన్నమైనది. ఈ రెండును ఏ కారణముచేతనైన క్షీణించవచ్చును. కాని ప్రారబ్ధమునకు కానిదేదైన తోడైనచో, అనుభవము కారణముగ క్షీణించినది కూడ మరల బలవత్తరమై వృద్ధిజెందును, క్షీణించిన రోగము కూడ అపథ్యాహారమువలన తిరుగబెట్టినరీతి. అట్టి అపథ్యవిషయములేవి? అనగా (1) కృత్రిమోక్తి, (2) అసదన్నాదనము, (3) ప్రతిగ్రహము, (4) గురుశాస్త్ర విరోధనము, అను నాలుగు ఇక్కడ చెప్పబడినవి. వాని నిర్వచనములిట్లున్నవి. (1) కృత్రిమోక్తి (కృత్రిమ+ఉక్తి) మూడు విధములు: మిథ్యోక్తి (మిథ్యా+ఉక్తి), అనభిప్రాయోక్తి, వఞ్చనోక్తి. మిథ్యోక్తి అనగా లేనిదానినున్నట్లు చెప్పుట, అనభిప్రాయోక్తి అనగా లక్ష్యము, ఉద్దేశము లేకుండ మాటలాడుట, వంచనోక్తి అనగా మోసముచేయు బుద్ధితో మాట లాడుట. ఈ మూడును సత్యమును చెప్పని మాటలు. వీనివలన కొంత అనుభవించుట వలన క్షీణించిన ప్రారబ్ధము కూడ మరల బలముగలదగును. ఇట్లే,(2) అసదన్నాదనము (అసద్+అన్న+అదనము) అనగా మంచిది కాని అన్నమును తినుట. మంచిది కాని అన్నము కూడ మూడు విధములు : శాస్త్రనిషిద్ధాన్నము, దుర్జనాన్నము. వర్ణాశ్రమపతితాన్నము. శాస్త్రనిషిద్ధాన్నము అనగా ఆయా దేశకాలము లందు తినరాని అన్నమని యేది శాస్త్రములచే నిషేధింపబడినదో ఆ అన్నమును తినుట దోషము. దుర్జనాన్నము అనగా సంఘవ్యతిరేకమైన దొంగతనములు దోపిడీలు నీతిన్యాయ–బాహ్యములైన పనులుచేసి బ్రదుకునట్టి వారి అన్నము. దీనిని తినరాదు. వర్ణాశ్రమపతితాన్నము అనగా బ్రహ్మచర్య, గార్హపత్య, వానప్రస్థ, సంన్యాసములని చెప్పబడిన ఆశ్రమజీవితము ననుసరించు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులను నాల్గు వర్ణములవారు ఎవరెవరెట్లు జీవించ వలయునని విధింపబడినదో అట్లు జీవించక పతితులైనవారి అన్నము. ఈ మూడు రీతుల అసదన్నమును తినుటవలన క్షీణించిన ప్రారబ్ధముసైతము బలవంతమగును. (3) ప్రతిగ్రహము అనగా స్వీకరించుట ముఖ్యముగ దానము తీసికొనుట. దీనియందు మూడు విధముల దోషములు కలుగును : అనేక వస్తు ప్రతిగ్రహము, అనేకదాతృప్రతిగ్రహము, సంకరప్రతిగ్రహము. అనేక వస్తుప్రతిగ్రహము అనగా ఒకే సమయమున అనేక వస్తువులను దానము పట్టుట. అనేక దాతృప్రతిగ్రహము అనగా ఎందరో దాతల నుండి ఒకే సమయమున దానము గొనుట. ఇట్లే, సంకరప్రతిగ్రహమనగా, ఈతడొక్కడే వీని తండ్రియని

స్పష్టముగా తెలియుటకు వీలుపడని సందర్భములలో తల్లి కడుపునపడి జన్మించిన వాని నుండి దానమందుట. ఈ మూడును కూడ ప్రారబ్ధము నుద్దీపింపజేయును. (4) గురుశాస్త్ర విరోధనము అనగా గురువులను శాస్త్రములను నిందించి, వ్యతిరేకముగ నడచికొనుట. లేక, గొప్ప శాస్త్రమును విరోధించుట. అనగా వేదమును తిరస్కరించు దోషము. కాక పరమార్థమును బోధించు వేదాంతశాస్త్రమును నిందించుట, లేక వానికి దుష్ఫలప్రదమైన కర్మలే లక్ష్యములని వేదలము గూర్చి వ్యాఖ్యానించుట. ఇదియుగాక తనకు అభీష్టఫలదాయకమని గురువుచే ఏ శాస్త్రమునుపాసించుట బోధింపబడినదో దానిని నిందించుటగాని విడిచిపెట్టుటగాని ప్రారబ్ధమును బలవత్తరము జేయును. కావున త్వరలో ముగియబోవుచున్న ప్రారబ్ధకర్మ ఫలమింకను ఈ చర్యలవలన బహుకాలము అనుభవించి తీర్చుకొనవలసినదిగా వృద్ధియగును.

**అవతారికా:– నైతావదేవ ప్రారబ్ధవర్ధకం కిన్తు అపరమపి సదుపదిష్టమస్తీత్యాహ–**

*శ్లో॥ తీర్థతోఽర్థగ్రహశ్చాపి విక్రయో వేదకన్యయోః।*
*పుణ్యస్థాననిపాతశ్చ ప్రారబ్ధాపథ్యముచ్యతే ॥* **51**

వ్యాఖ్యా:– తీర్థతో గఙ్గాదితీరస్థితాద్దాతురర్థగ్రహో ద్రవ్యస్వీకారో, యద్వా తీర్థతో గురోః సకాశాదర్థగ్రహః ప్రతిగ్రహః స చ ప్రారబ్ధాపథ్యముచ్యతే। అథవా స్వానుష్ఠితతీర్థఫల-విక్రయేణ యోఽర్థగ్రహో ద్రవ్యోపార్జనం తచ్చాపథ్యమేవ। తథా వేదకన్యయోర్విక్రయశ్చ ప్రారబ్ధాపథ్యముచ్యతే। వేదవిక్రయశ్చతుర్ధా వేదవేదార్థోపశోభితపుస్తకవిక్రయో వేద-విక్రయః,ద్రవ్యదాతారమహం పాఠయిష్యామీతి ద్రవ్యోపగ్రహముపమన్త్ర్య వేదాధ్యాపనం వేదవిక్రయః, వేదపాఠాదినా ద్రవ్యోపార్జనమపి వేదవిక్రయః, అనధికారిణే వేదార్థోపదేశేన ద్రవ్యోపార్జనం చ వేదవిక్రయః।చతుర్ధాపి ప్రారబ్ధోద్దీపక ఇతి భావః। కన్యావిక్రయశ్చ ద్విధా ద్రవ్యం గృహీత్వా వరాయ కన్యాదానమ్, జీవనార్థం దాన-మన్తరేణైవ దాసీవత్ కన్యావిక్రయణమపి కన్యావిక్రయః, స చ పరిమిత-ప్రారబ్ధాపరిమితత్వకారీత్యర్థః। పుణ్యస్థాననిపాతశ్చ పుణ్యస్థానానాం దేవాలయాధ్వర-వేదీవాపీకూపతటాకపుష్కరారామగోశాలాసేత్వాశ్రయాదీనాం నిపాతో భఙ్గః స చ ప్రారబ్ధవర్ధక ఇత్యర్థః। ఋజుతరోఽపి గురూపదిష్టోఽపి పన్థా నిరవధానస్య పుంసః వ్యాఘ్రకణ్టకాది సన్నిపాతేన దుర్గమో దీర్ఘతరో విపదాకరశ్చ భవతీతి భావః॥

**అవతారిక:–** ఇంతమాత్రమే కాక ప్రారబ్ధమును వృద్ధిచేయునవిగా సత్పురుషులచే చెప్పబడినవి వేరైనవి కూడ ఉన్నవని చెప్పుచున్నాడు.

ప్రతిపదార్థము:- తీర్థతః=గంగానది మొదలుగాగల పుణ్యనదుల తీరములందు నిల్చి, అర్థగ్రాహః=దానములను స్వీకరించుట, వేద=వేదమును, కన్య=కన్యను, ఈ రెండిటిని, విక్రయః=అమ్మికొనుట, పుణ్యస్థాన=పుణ్యమునకు స్థానమైన వానియొక్క (వానిని), నిపాతః చ=పడగొట్టుట (కూల్చుట) యున్ను, ప్రారబ్ధ=ప్రారబ్ధమునకు, అపథ్యం= అపకారి, యని, ఉచ్యతే=చెప్పబడుచున్నది.

వివరణము:- ముందు చెప్పబడిన ప్రారబ్ధకర్మబలమును వృద్ధిచేయునట్టి కార్యములే కాక మరికొన్నిటిని కూడ సత్పురుషులు చెప్పియున్నారు. అవేమి? అనగా -

1) పుణ్యనదీతీరములలో తీర్థసేవనముకొరకై విచ్చేసిన వారి నుండి దానములు తీసికొనుట, లేక , తీర్థ శబ్దమునకు గల రెండవ అర్థము ననుసరించి, గురువులచెంత నుండి ధనమును స్వీకరించుట, లేక, తాను చేసిన తీర్థసేవనము యొక్క ఫలమును విక్రయించి ధనమును ప్రతిఫలముగా తీసికొనుట అను ఈ మూడు విధముల ధనసంపాదనము,

2) వేదమును విక్రయించుట - ఇది నాల్గు విధములు (క) వేదము యొక్క మూలపాఠమును అర్థసహితముగగాని అర్థములేని పాఠము నొక్కటిగాని కలిగియున్న పుస్తకముల నమ్మికొనుట, (గ) నేను నాకు ద్రవ్యము నిచ్చినవానికి వేదపాఠమును చెప్పుదునని ప్రకటించి అట్టివారికి మాత్రము వేదమును బోధించుట, (చ) వేదపఠన-మూలమున ద్రవ్యమును సంపాదించికొనుట, (జ) వేదమును చదువుటకు అర్హతలేని వానికి ద్రవ్యసంపాదనకై వేదమును బోధించుట,

3) కన్యావిక్రయము రెండు విధములు - (క) ధనమును తీసికొని పెండ్లి కుమారునకై కన్యను దానము చేయుట (నిజమునకిది దానము కాదు కదా!), (గ) తాను బ్రదుకుటకై దానమను పేరుతో కన్యను దాసిగా విక్రయించుట,

4) పుణ్యస్థాననిపాతము అనగా పుణ్యస్థానములను కూల్చుట. పుణ్యస్థానము లేవి? దేవాలయములు, (ప్రార్థనామందిరములను గూడ చేర్చవచ్చును), యజ్ఞవేదికలు (నేటి పరిస్థితులను బట్టి, పదుగురకు మేలు చేకూర్చు కార్యకలాపములు జరుగుచుండు కేంద్రములను గూడ చేర్చవచ్చునేమో), బావులు (చిన్నవి, పెద్దవి కూడ), చెఱువులు, సరస్సులు మొదలుగాగల ప్రజోపయోగకరమైన నీటి వనరులు, తోటలు, అవుల కొట్టములు, వారధులు, ఆశ్రమములు మొదలైనవన్నియు పుణ్యమును కలిగించు క్రియలకు ఆధారభూతములైన ప్రదేశములు. ఇట్టి వానిని పడద్రోయుట.

పై జెప్పినవన్నియు క్షీణించుచున్న ప్రారబ్ధకర్మను మరల మరల బలోపేతము చేయునని సత్పురుషులందురు.

గురువుపదేశించిన మార్గమేయైనను, అది ఋజుమార్గమైనను పరధ్యానముగ నున్నవానికి అవాంతరములచే చాల దీర్ఘముగను విపత్కరముగను పరిణమించునని హెచ్చరిక.

**అవతారికా:– నను కృత్రిమోక్త్యాదీనాం పాతకకరత్వాత్పాతకనాశకకర్మోపదేశకరాణాం వేదానాం విద్యమానత్వాద్యథాశక్తి తద్విహితకర్మానుష్ఠానపరస్య కిమేతే విప్రియం కరిష్యన్తీత్యాశఙ్క్య ఏతేషాం ప్రారబ్ధవర్ధకత్వస్య శ్రుత్యుక్తత్వాద్విప్రియకరత్వం సిద్ధ-మేవేత్యాశయేనాహ––**

***శ్లో॥ ఏతేషాం సంశ్రయాత్పుంసః సంవిన్మార్గనిరోధనమ్।***
***ధర్మస్థస్యాభిజాతస్య సుపదస్యాపి జాయతే ॥ 52***

**వ్యాఖ్యా:– ఏతేషామితి। ఏతేషాం కృత్రిమోక్త్యాదిపదార్థానాం సంశ్రయాత్ సమ్యక్ బన్ధాత్ ధర్మస్థస్య యథాశక్తి స్వధర్మానుష్ఠానపరస్యాపి పుంసః పురుషస్య సంవిన్మార్గస్య జ్ఞానసోపానస్య నిరోధనం ప్రతిబన్ధనం జాయతే ఏవ। ఏతేషాం జ్ఞానద్వారార్గలత్వాత్ తదసఙ్గకుఠారేణ తచ్ఛిన్ననమన్తరా జ్ఞానాఙ్గభూసిద్ధిర్న భవతీతి భావః।**

అవతారిక:– కృత్రిమోక్తి మొదలగు వానికి పాతకమును కల్గించుశక్తియున్నందువలన, పాతకమును పోగొట్టు కర్మల నుపదేశించు వేదములున్నందువలనను, శక్తియున్నంత మేరకు అట్టి వివాహితకర్మల నాచరించువానికి ఆ చెప్పబడిన కృత్రిమోక్తి మొదలైనవి హాని కలిగించగల్గునా యేమి? అని విచారించి, వీనికి ప్రారబ్ధమును వృద్ధిచేయుశక్తి యున్నదని వేదవచనమైనందున అది సిద్ధమే యని చెప్పెను.

ప్రతిపదార్థము:– ఏతేషామ్=వీనియొక్క, సంశ్రయాత్=గట్టిబంధమువలన, ధర్మస్థస్య= స్వధర్మము నాచరించునట్టి, అభిజాతస్య పుంసః=సత్పురుషుడైనట్టి, సుపదస్య+అపి= సన్మార్గగామియైన వానికి గూడ, సంవిద్+మార్గ=జ్ఞానమార్గమున, నిరోధనమ్= ఆటంకము, జాయతే=యేర్పడుచున్నది.

వివరణము:– ముందటి శ్లోకములలో కృత్రిమోక్తి మొదలైనవి ప్రారబ్ధమును క్షీణించనీయక బలోపేతము చేయునని చెప్పబడినది కదా, వాని విషయమున, వేదము కూడా అట్లే చెప్పియున్నందున, సంశయమక్కరలేదని భావము. జీవి

వేదవిహితమైన ధర్మమార్గమున చరించువాడేయైనను, సత్పురుషుడేయైను, సత్కర్మల నాచరించువాడేయైనను, పై జెప్పిన కృత్రిమోక్తి మొదలైనవానికి ఏమరపాటుననైన తావిచ్చినచో, వాని ప్రారబ్ధము బలవత్తరమై వాని జ్ఞానమున కవరోధము కలిగి తీరునని భావము.

**అవతారికా:–** త్రివిధకర్మసమాప్తిమన్తరేణ తత్త్వజ్ఞానోదయాసంభవాత్ సఞ్చిత-సఞ్చీయమానకర్మలయోపాయమభిధాయ, భోగమన్తరేణ ప్రారబ్ధకర్మలయాసంభవాత్ తత్సమాప్త్యపరిజ్ఞానేన వేపమానం జీవాత్మానం వేదోక్తప్రారబ్ధోపశమాత్మకవిధినా సాన్త్వయతి ––

> **శ్లో॥ ప్రారబ్ధాన్యక్షయోపాయాః ఆచార్యైః కథితా శ్రుతేః।**
> **క్షయాసమ్భవతస్తస్యోపశమస్తత్క్రియాశ్రితః॥ *53***

**వ్యాఖ్యా:–** ప్రారబ్ధాన్యక్షయోపాయా ఇతి। ప్రారబ్ధేతరయోః సఞ్చితసఞ్చీయమానయోః కర్మణోః క్షయోపాయా లయోపాయాః ఫలసఙ్గఈశ్వరార్పణానర్పణాదిరూపాః శ్రుతేః వేదవచనాదాచార్యైః శఙ్కరాదిభిః కథితాః॥ తస్య ప్రారబ్ధస్య క్షయాసంభవతః భోగమన్తరేణ క్షయస్యాసంభవాత్ ఉపశమో హర్షశోకానుత్పత్తిలక్షణః శైథిల్యం వా తత్క్రియాశ్రితః తేన వేదేనైవ విహితా యా ఉపశాన్తిసమ్పాదికా క్రియా కర్మాపరపర్యాయా మౌన-సత్సఙ్గ-సదర్థ - ప్రతిపత్తిరూపా తస్యామాశ్రితః॥ శ్రుత్యుక్త ప్రారబ్ధోపశమకర-కర్మానుష్ఠానేనైవ ప్రారబ్ధశైథిల్యే సతి సర్వం సమ్పద్యతే ఇతి భావః॥

**అవతారిక:–** మూడు విధములగు కర్మ నశించుటకు మున్నుగ తత్త్వమునకు సంబంధించిన జ్ఞానము కలుగుట అసంభవమైనందున, సంచితసంచీయమాన కర్మలు నశించు నుపాయము చెప్పి, అనుభవించక తీరని ప్రారబ్ధకర్మవలన దాని సమాప్తిని గూర్చిన పరిజ్ఞానము లేమిచేత వణకుచున్న జీవాత్మను వేదముచే చెప్పబడిన ప్రారబ్ధము నుపశమింపజేయు విధానము జెప్పి ఓదార్చుచున్నాడు.

**ప్రతిపదార్థము:–** శ్రుతేః=వేదముయొక్క, ప్రారబ్ధ+అన్య=ప్రారబ్ధమునకు భిన్నమైన కర్మలు, క్షయ+ఉపాయాః=క్షీణించు/నశించు ఉపాయములు, ఆచార్యైః=ఆచార్యులచేత, కథితాః=చెప్పబడినవి, తస్య=దానియొక్క (ప్రారబ్ధముయొక్క), క్షయా=క్షీణత/నాశము, అసమ్భవాత్=అసాధ్యమైనందువలన, తత్+క్రియా+ఆశ్రితః=దాని (వేదము) చే చెప్పబడిన విహితకర్మల నాశ్రయించినట్టి, ఉపశమః=శాంతి.

వివరణము:- కర్మమూడు విధములు - సంచితము, సంచీయమానము, ప్రారబ్ధము. ఈ మూడును నశించక ముందుగ సత్యజ్ఞానము కలుగదు. వీనిలో సంచిత-సంచీయమాన కర్మలు నశించుటకు ఉపాయము ముందుగ చెప్పి, అపై ప్రారబ్ధము గూర్చి చెప్పబడినది. ప్రారబ్ధము అనుభవించకుండ నశించదు. వేరు ఉపాయము లేదు. కాని శాంతింపజేయు పద్ధతులున్నవి. ఇవియును వేదము చెప్పినవే. ఇట్టివే మౌనము, సత్సంగము, సదర్థము అను సాధనములు. వీని ననుష్ఠించుట ద్వారా ప్రారబ్ధము క్రమముగ నశించును.వేదవిహితమైన ఫలాసక్తిరాహిత్యము, ఈశ్వరార్పిత-ఫలము, ఈ పూర్వోక్తసాధనలతో సంచితసంచీయమాన కర్మలు నశించును. ఇట్లు సర్వకర్మసమాప్తిని సంపాదించుట సాధ్యమగును.

అవతారికా:- తత్ర ప్రారబ్ధోపశమకశక్తిమద్వస్తుషు మధ్యేఽ సత్యానుత్పత్త్యాది ప్రశస్త-ఫలాధికరణత్వేన అభ్యర్హితత్వాదాదౌ మౌనం ప్రస్తౌతి --

శ్లో॥ అసత్ప్రియవిరోధానామనుత్పత్త్యోక్తినిగ్రహాత్।
ప్రారబ్ధోపశమం ప్రాహుర్మౌనతః ప్రేమసంక్షయాత్ ॥ 54

వ్యాఖ్యా:- అసదితి। మౌనతః మునిజనానుష్ఠితాన్మౌనవ్రతాత్ప్రారబ్ధస్యోపశమం శాన్తిం ప్రాహుః। తత్ర హేతవః--అసత్ప్రియవిరోధానామనుత్పత్త్యా, సచ్ఛబ్దేన సత్యం గృహ్యతే సచ్చ ప్రియం చ సత్ప్రియే, న సత్ప్రియే అసత్ప్రియే, తే చ విరోధశ్చ అసత్ప్రియవిరోధాః తేషామసత్య-అప్రియ-విరోధానామ్ అనుత్పత్తేః ఉత్పత్తేరభావాత్। మౌనవ్రతస్వీకారే అన్యైః సహ విరోధః అసత్యమ్ అప్రియం చ నోదేతి।

ఉక్తిర్వాగిన్ద్రియం తన్నిగ్రహోద్దణ్డత్రయమధ్యే వాగ్దణ్డస్య ప్రబలత్వాదుభయోః సాపేక్షత్వేనాసత్యాప్రియవిరోధానుత్పత్తివాఙ్నిగ్రహయోర్ద్వేతుహేతుమద్భావః। ప్రేమ-సంక్షయాత్ ప్రీతేః క్షయతోఽపి। స్నేహస్యాపి ప్రాయో వాగ్విలాసజన్యత్వాత్। మాయా-నేకపాశానాం మధ్యే స్నేహపాశస్య ప్రబలతరత్వాన్మౌనస్వీకారే తస్యాపి శైథిల్యం భవతి।

అత్రకేచిద్ హేతవః। అసత్యోక్తౌ గ్లాని-పాతకోదయ-మానభఙ్గాదయో దోషాః। అప్రియోక్తౌ అప్రియత్వ-గ్లాని-వైషమ్యాదయో దోషాః। విరోధోక్తౌ భయ-కార్యహాని-పశ్చాత్తాపాదయో దోషాః। వాగిన్ద్రియబహిర్వృత్తౌ సర్వే చైతే దోషాః। స్నేహే చ బహిర్ముఖత్వాదయో దోషాః। ఏషాం శైథిల్యకరం మౌనాపేక్షయా అన్యన్నాస్తీత్యర్థః సాఙ్గే వాగ్దణ్డే సముదితే సతి అవశేషేఽపి ప్రారబ్ధే హర్షశోకాది ప్రవృత్తేరభావాజ్జీవన్ముక్తే-రవసరః ఇతి భావః॥

**అవతారిక:-** ప్రారబ్ధము నుపశమింపజేయు శక్తిగల వస్తువుల మధ్య అసత్యమును బుట్టింపకుండుట మొదలైన శుభఫలానుసంధానమున్నందుచేత అర్హతగలందువలన మొదట మౌనమును ప్రశంసించుచున్నాడు --

**ప్రతిపదార్థము:-** మౌనతః=మౌనమువలన, అసత్=అసత్యము, అప్రియ=అప్రియము, విరోధానాం=విరోధము అను ఈ మూడిటియొక్క ఉక్తినిగ్రహాత్=పలుకకుండుటవలన, అనుత్పత్త్యా=కలుగకుండుటచేత, ప్రేమసంక్షయాత్=(వానియందు) ప్రేమక్షీణించుట వలన, ప్రారబ్ధ+ఉపశమం=ప్రారబ్ధమునకు శాంతి, ప్రాహుః=చెప్పుదురు.

ఇట్లు గూడ అన్వయించవచ్చును --

అసత్ప్రియ=అసత్యమునభిమానించువారి, విరోధానాం=విరోధములకు, అనుత్పాత్త్యా= పుట్టుక లేకుండుటచేత, ప్రేమసంక్షయాత్=అభిమానము నశించుటవలన, ఉక్తి నిగ్రహాత్=మౌనమును పాటించుటవలన, ప్రారబ్ధోపశమం=ప్రారబ్ధము శాంతించుటను, మౌనతః=మౌనవ్రతము బూనుట వలన మునులు, మౌనులు అను పేరున ప్రసిద్ధులైన వారి ఆచరణానుభవము నుండి, ప్రాహుః=చెప్పుదురు.

**వివరణము:-** ఇట వ్రతనిష్ఠతో మౌనమును పాటించుట ప్రారబ్ధమును శాంతింపజేయు నని చెప్పబడుచున్నది. ఇందుకేమి ప్రమాణమనగా, మున్నీ వ్రతము నాచరించి మునులు, మౌనులు అని ప్రసిద్ధులైనవారి అనుభవములే ప్రమాణమని సిద్ధాంతము. మౌనమనగా నేమి? ఉక్తి నిగ్రహము. నోరు, అందలి నాల్క జేయు పనులు రెండు- (క) ఆహార స్వీకరణలో సాధనమగుట, అట్లే మాట్లాడుటలో ముఖ్య- సాధనమగుట. ఇట్లిది కర్మేంద్రియమగును, (చ) ఆహార స్వీకరణలో ఆహారపు రుచిని తెలియజేయుట. ఇది దీని జ్ఞానేంద్రియ లక్షణము. మాట్లాడునప్పుడిది సాధారణముగ తనకు ప్రియమైన విధమున మాట్లాడును, అన్యుల కప్రియమగునట్లును మాట్లాడును. ఇట్లే, అసత్యమును బలుకును, అన్యభాషణములను ఖండించుచు పల్కును. ఇట్టి ఉక్తిదోషములన్నియు మౌనముచే రూపుదాల్చక పోవును. అది గాక, అసద్విషయము- లందు, అసత్యమునందు ప్రీతిగల వారితో విరోధము కలుగు నవకాశమే లేకుండపోవును. మరియొకటి, మాయాపాశములన్నిటిలోను బలవత్తరమైనది స్నేహము. ఇది మాటలు కలుపుటతో మొదలగును. మాటలాడుటే లేకున్న స్నేహబంధమేర్పడదు.

ఈ విధముగ జీవునకు అసత్యమాడుటవలన కలుగు దుఃఖము, పాపము, గౌరవహాని ఇత్యాది దోషములున్ను, విరోధోక్తి వలన కలుగు భయము, కార్యహాని, పశ్చాత్తాపమాది దోషములున్ను, సమస్తము వాక్కు యొక్క బహిర్వ్యవహారము వలన, బహిర్ముఖత్వమువలన కలుగువానిని, మౌనము హరించి వేయును. మరియొక రీతి ఇవి పరిహరింపబడవు. ఈ చెప్పబడిన దోషములు పరమును మాత్రమే కాదు, ఇహ జీవనమును గూడ బాధించునవేయగుట గమనింపదగినది. కనుక మౌనము ఇహపరసాధకము. దీనిచే ప్రారబ్ధము శోషించుననుటయే కాక సంచీయమాన-కర్మసైతము క్షీణించును.

అవతారికా:- నను సత్సఙ్గస్యాపి పూజ్యతమత్వేన భగవదుక్తత్వాత్తతోఽపి కిం పూజ్య-తరత్వం మౌనస్యేత్యాశఙ్క్య ఉభయోః పుణ్యోదయకార్యత్వేఽపి మౌనస్య స్వాధీనత్వా-దఙ్గనైరపేక్ష్యేణాపి కార్యకారిత్వాత్ప్రథమముపాత్తం తన్న సర్వతః అసాధారణత్వేన ఇత్యాశయేనాహ --

శ్లో॥ సుఖదుఃఖాదిభావానామనిత్యత్వావధారణాత్ ।
భోక్తవ్యోపశమే హేతుః సత్సఙ్గస్తాపవారణాత్ ॥ 55

వ్యాఖ్యా:- సుఖేతి। సతాం ఈశ్వరారాధనలక్షణకర్మసంయతాసద్విషయవృత్తీనాం సమత్వేనానుభూతసుఖదుఃఖాదిద్వన్ద్వానాం సాధూనాం సఙ్గః సఙ్గతిః తత్సమీపే స్థితిరితి యావత్ । స భోక్తవ్యస్య ప్రారబ్ధస్యోపశమే శైథిల్యే కార్శ్యే వా హేతుః। యద్వా సతాం వేదశిరసాం పరమార్థప్రతిపాదకానాం ఉపనిషదాం సఙ్గః సన్తతాభ్యాసోఽర్థతః పాఠతో వా సర్వదా పరిశీలనం తచ్చ తథేతి పూర్వేణ సంబన్ధః। అథవా సతాం సత్తయా శ్రుతిగదితానాం గఙ్గాప్రయాగసప్తపురీపురుషోత్తమక్షేత్రాణాం సఙ్గః శ్రద్ధయా నిత్యసేవనం తచ్చోపశమకారీ।

అత్ర హేతుద్వయం సుఖదుఃఖాదిభావానాం సఙ్కల్పితప్రియాప్రియవస్తూపస్థితౌ జాతానాం హర్షశోకాదివృత్తీనామనిత్యత్వావధారణమనిత్యత్వపరిజ్ఞానం తస్మాత్, తాపవారణాదహం నిరతిశయసుఖః కదా స్యామ్? మమానిష్టనివృత్తిశ్చ కదా స్యాద్? ఇత్యాదేస్తాపస్య వారణాద్వినాశాచ్చ సత్సఙ్గః ప్రారబ్ధోపశమకః।

వివిక్తసేవినః పరిత్యక్తాసద్విషయకరతిసార్థాః సజ్జనాః సర్వదా హి పరమేశ్వర-లీలామృతార్ణవావగాహినః శరణాగతాన్ స్వాశ్రమోపగతానపి తామేవ తాపవారిణీం

పరమేశ్వరీం మాయాకథాం శ్రావయన్తి। శ్రుతాయాం చ శ్రుతిమితాయాం తస్యామ్ అప్రార్థితదుఃఖాగమవత్ సుఖాగమో౽పి తథైవ భవభీత్యాద్యనుభవాత్ సుఖమనిత్యమేవ తథా దుఃఖమపీత్యవధారణాత్ సుఖదుఃఖసామ్యనిరూపితహర్షశోకవృత్తిసామ్యేన విద్యానన్దావిర్భావాజ్జీవన్ముక్తిరుపతిష్ఠతే ॥

**అవతారిక:-** సత్సంగము పూజ్యతమమని సెలవిచ్చియున్నారు కదా, అంతకంటెను మౌనము పూజ్యతరమా యేమి యని విచారించి, రెండును శుభపరిణామములను కలిగించు కార్యములేయైనను, మౌనమునకు గల స్వాధీనతా లక్షణమువలన అంగనిరపేక్షవలన గూడ కార్యసాధకముగ ప్రథమముగ చెప్పబడినది. మౌనము, సర్వత్ర అసాధారణమైనందువలన కాదనుభావముతో చెప్పబడుచున్నది. అంగనిరపేక్షయనగా వస్తు సంపత్తితో ఆవశ్యకత లేకుండుట.

**ప్రతిపదార్థము:-** సుఖదుఃఖ+ఆది=సుఖము దుఃఖము మొదలైన, భావానాం=అనుభవ విషయముల యొక్క అనిత్యత్వ=క్షణికతను గూర్చిన, అవధారణాత్=జ్ఞానమువలన, తాప=అశాంతిని, వారణాత్=నివారించుటవలన, సత్సఙ్గః=సత్పురుషులతో కూడి యుండుట, భోక్తవ్య=అనుభవింపదగిన (ప్రారబ్ధము) యొక్క ఉపశమే=శాంతియందు, హేతుః=కారణము.

**వివరణము:-** శ్రీశంకరభగవత్పాదులు సత్సఙ్గత్వే నిస్సఙ్గత్వమ్ ఆదిగాగల శ్లోక ముఖమున జీవన్ముక్తికి సత్సంగమే ప్రధానసాధనమని తెల్పియుండగా, ఈ పూర్వశ్లోకములలో వారి శిష్యుడైన శ్రీ పద్మపాదులు మౌనమునకే ప్రథమపూజ్యత యనుట ద్వారా, మౌనము సత్సంగము కంటె అధికముగ పూజ్యతగలదని నట్లగునా? అనుదానికి సమాధానముగ మౌనమును ముందుగ జెప్పుటకు దాని అసాధారణత కారణము కాదనియు, అది తనకు తానై సాధకుడు రెండవవారి ప్రమేయము లేక ఆచరించుటకు వాని అధీనమునందే ఉండునదగుట కారణమని వివరించి, ఇక సత్సంగమును గూర్చి ఆచార్యుడు వివరించినాడు.

సత్సంగమననేమి? సత్+సంగము. ఇందు సత్ అనగా సాధువులు, లేక సత్పురుషులు. సాధువులనగా ఈశ్వరారాధనలో సర్వకర్మలను చేయుచు సుఖదుఃఖములను సమదృష్టితో అనుభవించుచు ద్వంద్వముల కతీతముగ నుండు మహాత్ములు. వారి సామీప్యమువలన జీవునకు సద్విషయములలవడును, అసద్విషయములు దూరమగును, ఇట్లు ప్రారబ్ధము శాంతించుటకు కారణమగును.

మరియొక అర్థమున, సత్ అనగా ఉపనిషత్తులు. వీనిని నిరంతరము పఠన-పాఠనము చేయుచు చేయించుచు నుండుట సత్సంగము. ఉపనిషత్తులు పరమార్థమును ప్రతిపాదించునవి కావున వానితో సంగము ప్రారబ్ధమును శమింపజేయును. మూడవ విధమున సత్ అనగా వేదోక్తములైన గంగా-ప్రయాగాది క్షేత్రములు. నిత్యము క్షేత్ర-దర్శనము సత్సంగమే. ఈ త్రివిధ సత్సంగములలో యే యొకటియైన జీవునికి లౌకిక సుఖదుఃఖముల క్షణికత్వమును తెలియజేసి, అనంతసుఖము నాశించునట్లు జేసి, ప్రాపంచిక సుఖభోగములందు విరక్తుని జేసి, ఇష్టప్రాప్తికై తపింపజేయుట ద్వారా ప్రారబ్ధమును శమింపజేయును.

ఎవరి ఇంటియందైన పదుగురు చేరి వ్రతములు, నోములు చేసికొనుట, పురాణ, హరికథాశ్రవణము, విష్ణుసహస్రనామ, లలితాసహస్రనామ పారాయణ, ఇవి కూడ సత్సంగములే. ఎట్లన, ఇట్టి సందర్భములలో చేరిన వారందరిలో ప్రసరించుచుండునది భగవద్భావన. ఈ భావన వారిని పవిత్రీకరించి, వారి ప్రారబ్ధమును క్షీణింపజేయును.

అవతారికా:- ప్రారబ్ధోపశమోదయకారిషు వస్తుషు సదర్థప్రతిపత్తేరప్యసాధారణ-కారణత్వం ప్రతిపాదయతి ---

*శ్లో॥ సమత్వప్రతిభానేన భావస్యాపి ప్రసాదతః।*
*సదర్థప్రతిపత్తేర్హి భోక్తవ్యోపశమోదయః॥* **56**

వ్యాఖ్యా:- సమత్వప్రతిభానేనేతి । సదర్థప్రతిపత్తేః సత్సు సత్పాత్రేషు అర్థానాం గోభూహిరణ్యాదీనాం అకామితానాం ప్రతిపత్తిః సమర్పణం తతో భోక్తవ్యోపశమస్య ప్రారబ్ధోపశాన్తేరుదయ ఉత్పత్తిర్భవతీతి శేషః యద్వా సతి బ్రహ్మణి అర్థానాం కర్మణాం ప్రతిపత్తిరర్పణం తతోఽపి తథా సః అథవా సదర్థానామ్ అనాయాసేనానర్థతయా సదుపార్జనేన వోపలబ్ధానాం కపర్దికాని గజాన్తానాం సమ్పదాం ప్రతిపత్తిః పరమేశ్వరప్రీతయే వేదోక్తయాగాదౌ సద్వినియోగేన సమ్పాదనం తతశ్చ స తథా। యద్వా సతాం వేదానామర్థానాం క్రియాపరత్వాత్మపరత్వరూపాణాం ప్రతిపత్తిః పర్యాలోచనం తస్మాదపి తథా సః యద్వా సత్సు పితృదేవర్షిభూతాతిథిలక్షణ సగుణాత్మమూర్తిషు వేదాధ్యయనశ్రాద్ధహోమబలిగ్రాసాదీనాం ప్రతిపత్తిరహరహః శ్రద్ధయా సమ్పాదనం తచ్చ ప్రారబ్ధోపశమకారి। యద్వా సదర్థయోః ఆత్మదేహయోః

ప్రతిపత్తిః ప్రకాశకత్వప్రకాశ్యత్వరూపేణ, సత్యత్వాసత్యత్వరూపేణ, వివర్తత్వాధిష్ఠానత్వేన చ పరిచిన్తనం తతోఽపి స తథా। యద్వా సతో బ్రహ్మణోఽర్థానాం సత్తాజ్ఞానానన్దాను-రూపాణాం ప్రతిపత్తిః సచ్చిదానన్దరూపోఽహమిత్యుపాసనం తతోఽపి స తాదృక్। యద్వా సతాం సగుణబ్రహ్మమూర్తీనాం హరిహరాదీనామర్థానాముపాసనావలమ్బన-హేతూనాం ప్రతిమానాం ప్రతిపత్తిః స్థాపనం అనన్యభావేనారాధనం తతోఽపి ప్రారబ్ధోపశమోదయః॥

తత్ర హేతుః -- భావస్య చిత్తస్య ప్రసాదతో నిర్మలత్వాత్ సమత్వప్రతిభానేన జీవాత్మపరమాత్మనోః ప్రతిభానేన ఏకత్వవృత్త్యుదయేన చ సదర్థప్రతిపత్తిః ఉక్తకార్య-కారణీత్యర్థః॥ అత్ర సమత్వప్రతిభాన-భావప్రసాదయోర్హేతుహేతుమద్భావోఽవగన్తవ్యః సదర్థప్రతిపత్తినిరూపితచిత్తస్వచ్ఛతాప్రతిభాతపరాపరాత్మైకత్వస్య కిఞ్చిదనుభవేన ప్రారబ్ధకర్మవశతో జాయమానేష్వపి క్రియాకలాపేషు న అహన్తామమతోదయ ఇతి భావః॥

**అవతారిక:**- ప్రారబ్ధమును శాంతింపజేయునట్టి వస్తువులలో సదర్థ ప్రతిపత్తికి గూడ అసాధారణమైన శక్తియున్నదని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము:**- భావస్య=మనసుయొక్క, ప్రసాదతః=నిర్మలత్వమువలన, సమత్వ= సమత్వము, లేక ఏకత్వముయొక్క ప్రతిభానేన అపి=ప్రకాశముచేతకూడ, సత్+అర్థ ప్రతిపత్తేః హి=సదర్థసంపాదనకే, భోక్తవ్య+ఉపశమ+ఉదయః=ప్రారబ్ధముయొక్క శాంతి కలుగుట.

**వివరణము:**- ప్రారబ్ధశాంతికి దోహదపడు ఉపకరముల చర్చ సాగుచున్నది కదా. దానిని కొనసాగించుచు, అట్టి ఉపకరణములలో సదర్థప్రతిపత్తి యనుదాని ప్రభావము ఈ శ్లోకవిషయము.

సదర్థప్రతిపత్తి అనుదానిలో సత్+అర్థ+ప్రతిపత్తి అను మూడు శబ్దము లున్నవి. సత్ శబ్దార్థములు కొన్ని ముందటి శ్లోకమున వివరించబడియున్నవి. ఈ శ్లోక-సందర్భమున, సత్ అనగా సత్పాత్రత గలవారు, వారికి అర్థములను అనగా గోవులను, భూములను, బంగారము మొదలగు వానిని దానముచేయుట. సత్పాత్రు లెవరు? దానముగా ఇవ్వబడిన వానిని మంచిగా ఉపయోగించువారు. రెండవ అర్థమున, సత్ అనగా పరబ్రహ్మము. అర్థములనగా మానవుడు చేయు వివిధ కర్మలు. ఈ

కర్మల ఫలమును తాననుభవింపగోరక పరబ్రహ్మమున కర్పించుట. మూడవ అర్థమున, సదర్థములనగా శ్రమలేకుండగా లభించిన, లేక మంచిగా సంపాదించ-బడిన సంపదలు. వీనిని దేవప్రీతిగా వేదోక్తమైన యజ్ఞయాగాదులలో వినియోగమునకై సంపాదించుట. నాల్గవ విధముగ, వేదములయొక్క క్రియాపరమైన, ఆత్మపరమైన అర్థములను పర్యాలోచనము చేయుట. ఐదవ అర్థమున, పితృ, దేవ, ఋషి, భూత, అతిథి అను ఈ సగుణాత్మమూర్తులందు వేదాధ్యయనము, శ్రాద్ధము, హోమము, బలి, గ్రాసము మొదలైన వానిని శ్రమించి శ్రద్ధతో సంపాదించుట. ఆరవరీతిగా, ఆత్మ (సత్), దేహము (అర్థము), వీనిని గూర్చి ప్రకాశకము-ప్రకాశ్యము, సత్యము-అసత్యము, అధిష్ఠానము-వివర్తము, ఇట్టి రూపమున చింతించుట. ఏడవ విధమున, సత్=బ్రహ్మము, అర్థానాం=ఉనికి, జ్ఞానము, ఆనందము. ఈ అర్థములలో బ్రహ్మమును భావించి, ఆ బ్రహ్మము తానేయని ధ్యానించుట. ఎన్మిదవ రీతిగా, విష్ణువు, శివుడు ఇత్యాది సగుణబ్రహ్మమూర్తులను ప్రతిష్ఠించి అనన్యభావముతో ఆరాధించుట. ఇట్టి భావముల ధ్యానించుటవలన, ఆరాధించుటవలన, సగుణ-నిర్గుణ-పరబ్రహ్మముల సమత్వమవగతమై జీవాత్మ-పరమాత్మల ఏకత్వభావన కలిగి, చిత్తము నిర్మలమగును. అహంకార-మమకారములు కలుగక జీవుడు తన ప్రారబ్ధకర్మఫలము ననుభవించును. అందుమూలమున ప్రారబ్ధము క్షీణించును.

**అవతారికా:**- నను మౌన-సత్సఙ్గ-సదర్థప్రతిపత్తీనామేకతమాశ్రయేణాపి ప్రారబ్ధ-శైథిల్యలక్షణపరమఫలోదయాద్ అనర్థోపశమనఫలోదయే కిమితి న ప్రవర్తన్తే లోకా ఇత్యాశఙ్క్య మతిమాన్ద్య-శ్రద్ధాజాడ్యాది ఏవాప్రవృత్తౌ హేతుః, న పదార్థాశక్తిమత్త్వం ప్రయోజకమిత్యాశయేనాహ --

*శ్లో॥ భావస్యాపి ప్రదోషేణ సంసర్గాత్కర్మణోఽసతః।*
*అరుచ్యా పరమార్థేషు న వృత్తిః సతి వస్తుని ॥* 57

**వ్యాఖ్యా:**- భావస్యేతి । సతి వస్తుని ప్రారబ్ధోపశమకే మౌనాదికర్మణి భావస్య చిత్తస్య ప్రదోషేణ మాలిన్యేన అసత్ఫలజనకస్య కర్మణః సంసర్గాత్ సంబన్ధాత్ పరమార్థేషు పరమార్థప్రతిపాదక-ఉపనిషదాదిశాస్త్రేషు అరుచ్యా శ్రద్ధాజాడ్యేన చ న వృత్తిః నరాణాం న ప్రవృత్తిః। వేదోక్త - ఆపాతరమణీయార్థవిసృష్టేన్ద్రియసకలవృత్తీనాం బహిర్ముఖానామసత్ఫలాచ్ఛాదితాన్తఃకరణానాం త్రివిధక్రియావాసనాన్తరోపలభ్యమాన-బ్రహ్మానన్దానుభవోఽతీవ గహన ఇతి భావః॥

**అవతారిక:-** మౌనము, సత్సంగము, సదర్థప్రతిపత్తి అను వీనిలో యే ఒక్కదాని నాశ్రయించుట చేత కూడ ప్రారబ్ధము శిథిలమగు పరమఫలము కలుగుచున్నది కదా, మరి అనర్థమును శమింపజేసికొను ఫలముకొరకు లోకులేల ప్రవర్తించరు? అని ఆలోచించి, అందుకు కారణము మతిమాంద్యము, శ్రద్ధలేమియే తప్ప మౌనము ఆదిగా గల మూడిటిలోని శక్తిలో ప్రేరణ లోపించుట కాదు, అని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము:-** అసతః కర్మణః=అసత్కర్మల, సంసర్గాత్=సంబంధమువలన, భావస్య=చిత్తము యొక్క, ప్రదోషేణ=దోషముచేత, పరమ+అర్థేషు=పారలౌకిక విషయములందు, అరుచ్యా అపి=రుచి (ఆసక్తి) లేకపోవుట చేత కూడ, సతి వస్తుని= సద్విషయము లందు, వృత్తిః=ఉనికి, న = లేదు.

**వివరణము:-** మనస్సునకు చాంచల్య దోషమున్నదే. దానికి అసత్కర్మల సంబంధము కలుగగా అది మరింత మలినమగును. ఈ కారణమువలన దానికి మౌనమాది సత్కర్మల వైపు దృష్టి పోదు. పైగా, పరమార్థమును ప్రతిపాదించు వేదాన్తశాస్త్రములాదిగా గలవాని యందు అరుచి యేర్పడును. కనుక సద్విషయములలో నరుడు ప్రవర్తించ లేదు.

**అవతారికా:-** నను త్రయాణామేవ ప్రారబ్ధోపశామకత్వే తత్రారుచీనామశక్తానాం వా ప్రారబ్ధానుపశాన్త్యా సుఖదుఃఖోపస్థితౌ హర్షశోకాదేరుదయాత్ కర్మాన్తరోదయస్య తదుపోద్బలకత్వేన కర్మసమాప్త్యా స్వప్నేఽపి అలభ్యా స్వరూపసమ్పదిత్యాశఙ్క్య,తతః సుగమతరతదుపశమకశక్తిమద్వస్త్వనన్తరస్య భగవదాచార్యైరుక్తత్వాన్న శఙ్కావసర ఇత్యాహ --

శ్లో॥ కోటితారత్రయేణైవ లక్షపౌరుషసేవనాత్ ।
అయుతైశ్వర్యయోగేన ప్రారబ్ధోపశమోదయః॥ 58

**వ్యాఖ్యా:-** కోటితారత్రయేణైవేతి। కోటి సఙ్ఖ్యాకం యత్ తస్య తారస్య ప్రణవస్య త్రయణం జపస్తేన ప్రారబ్ధస్య కర్మణః ఉపశమస్య హర్షశోకాదివృత్తిరాహిత్యస్య ఉదయ ఉత్పత్తిర్భవతీతి శేషః ప్రణవస్య త్రయీ బీజత్వాన్మాత్రాదిత్రితయస్య చ హరిహరబ్రహ్మా- వాచకత్వాత్ తత్సేవనేన తదుపాసనాసిద్ధౌ కిమ్ అలభ్యమిత్యర్థః తథా చ లక్షసఙ్ఖ్యాకం యత్ పౌరుషం పురుషావతారప్రతిపాదకం సూక్తం "సహస్రశీర్షా" ఇత్యాదిలక్షణం

తస్య సేవనాదర్థానుసన్ధానేన పాఠాత్ తదుపశమో భవతి। తథా అయుతసఙ్ఖ్యాకం యదైశ్వరమీశ్వరసమ్బన్ధిసూక్తం "నమస్తే రుద్ర" ఇత్యాదిలక్షణం తస్య యోగేన సార్థాను -సన్ధానపాఠేన తదుపశాన్తిర్భవతి। పురుషసూక్తరుద్రయోర్వైరాజోపాసనత్వేన అదుష్కరఏవ తదుపశమ ఇత్యర్థః

అర్థానుసన్ధానమాత్రే సఙ్ఖ్యానవగమాన్మానసిక ఉపాంశుర్వా జప ఉచ్చారణా-మాత్రస్య ధాత్వర్థేఽపి నైరవధానాదిదోషాకరత్వేన వాచనికత్వం నాభ్యుపేయమ్। ప్రారబ్ధోపశమస్య దృష్టత్వేఽపి హర్షశోకాదివృత్త్యనుదయోపశమోదయయోః లక్ష్యలక్షణ యోర్భావోఽవగన్తవ్యః ప్రచణ్డసూర్యప్రకాశస్య ఘటకుడ్యాదిగతాన్ధకార-వినాశకత్వం న విచిత్రమ్॥

**అవతారిక:**– ఆ మూడిటికిని గల ప్రారబ్ధశాంతి లక్షణమందు రుచిలేని వారికి లేక వానిని పాటించుశక్తిలేనివారికి ప్రారబ్ధము శాంతించకపోవుటచే సుఖదుఃఖములకైన సంతోషశోకములు కలుగుటవలన కర్మలో అంతర్భవించిన ఆ అనుభవములను బలవత్తరముచేయు లక్షణముచేత కర్మసమాప్తిచే స్వరూప సంపద కలుగుట కలలో నైనను లభింపదు కదా, అని చింతించి, అంతకంటె సులభమైన కర్మోపశమకశక్తి గలిగిన వానిని భగవత్పాదులైన ఆచార్యులు చెప్పియుండుటచే శంకించవలసిన అవసరము లేదని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము:**– కోటి=ఒక కోటి సంఖ్య పర్యంతమైన, తార=ఓంకార, లేక ప్రణవ-మంత్రము, శ్రయేణ ఏవ=జపముచేతనే, లక్ష=లక్ష సంఖ్యలో, పౌరుష=పురుష సూక్త, సేవనాత్=అర్థమును అనుసంధించి పఠించుటవలన, అయుత=పదివేలు, ఐశ్వర్య= ఈశ్వర సంబంధమైన రుద్రసూక్తమును, యోగేన=అర్థమును చింతించుచు పఠించుట చేత, ప్రారబ్ధ=ప్రారబ్ధముయొక్క, ఉపశమ+ఉదయః=శాంతి కలుగుట.

**వివరణము:**–మౌనము,సత్సంగము,సదర్థప్రతిపత్తియని ప్రారబ్ధశాంతికి ఉపాయములు చెప్పబడినవి కదా. వాని సాధనలో అభిలాషలేనివారు, అశక్తులు కూడ ఉన్నారు కదా, వారి గతి యేమి? అనుదానికి సమాధానముగ ఆచార్యులు చెప్పిన సులభతరమైన ఉపాయములివి – (1) ఓంకారమును మంత్రముగ భావించి, కోటి సంఖ్యగ జపము చేయుట, (2) పురుషసూక్తమును లక్షసంఖ్యగ, దాని అర్థమును మనసున నిల్పి, చదువుట, (3) రుద్రసూక్తము పదివేలసార్లు, అర్థమును భావించుచు చదువుట. ఇందుచే ప్రారబ్ధము శమించును. ఎట్లన – ఓంకారములోని మూడు

బీజములైన అ+ఉ+మ, అర్థాత్ త్రిమూర్తులు : అ-విష్ణువు, ఉ-శివుడు, మ-బ్రహ్మ, (మకారమున ముగ్గురును భాసింతురు), కనుక ఓంకారము నుపాసించుట ఈ ముగ్గురు మూర్తుల నుపాసించుటే యగును. దాని ఫలముగ ప్రారబ్ధము శమించును. ఇట్లే, పురుషరుద్రసూక్తముల అర్థములను భావించుచు, ఆ అర్థములు మనసున నిల్చిపోవునంతగ పఠించిన, పారాయణ చేసినచో, నైర్మల్యము లభించును, వైఖరి మారును, సాత్త్వికత అలవడును, దినదినము కర్మల నాచరించునపుడు వానివలన కలుగు సుఖదుఃఖములను మనఃస్థితులకు అనుభవరూపమైన హర్షకోశములు కలుగని సమస్థితి యేర్పడును, ద్వంద్వము మాసిపోగా సుజ్ఞానము ప్రచండసూర్యప్రకాశమానమై వెలుగును, ప్రారబ్ధము చీకటివలె దుర్బలమైపోవును. సూర్యుడుదయించగా క్రమేణ ఇండ్లలోపలి భాగములు కూడ వెలుతురు నింపికొనుట నిత్యానుభవమే కదా!

అవతారికా:-నను సద్గురూపదిష్టానామేవ వేదమన్త్రాణాం ఫలప్రదత్వాత్ తావత్సఙ్ఖ్యాకజపస్య చ బహుకాలసాధ్యత్వాత్, మాలామఙ్గలభూమిచిత్తైకాగ్ర్యాదీనాం చ జపాఙ్గత్వాత్ అతద్విధానాం న తదుపశమప్రసఙ్గ ఇత్యాశఙ్క్య అధికారిభేదేన తదుపశామకవిధ్యన్తరస్యాపి భగవదాచార్యైరభిహితత్వాత్ న శోచనీయమిత్యాశయేనాహ --

*శ్లో॥ అర్కచక్రాఙ్కమూర్తీనాం ప్రత్యహం భావనాశ్రయాత్।*
*వైధతోఽవైధతో వాపి ప్రారబ్ధోపశమో భవేత్ ॥* **59**

వ్యాఖ్యా:- అర్కచక్రాఙ్కమూర్తీనామితి। అర్కశబ్దో ద్వాదశసఙ్ఖ్యాపరః। అర్కసంఖ్యాకాః చక్రాఙ్కాః సౌమ్యచక్రయుతాః స్ఫుటితపిఙ్గలత్వాదిదోషహీనాః అయాచితా అచోరితాః స్వయముపార్జితా శ్రద్ధయా అన్యదత్తా వా యా హరిహరాదిరూపాః సాలగ్రామమూర్తయస్తాసాం వైధతో వేదోక్తవిధినా అవైధతో విజ్ఞకృతానుకరణవిధినా వా యథామిలితోపచారైః ప్రత్యహం ప్రతిదినం భావనయా భక్త్యా ఆశ్రయాదారాధనాత్ప్రారబ్ధోపశాన్తిర్భవతి। భావనాశ్రయాదిత్యనేన దమ్భకృతే ప్రారబ్ధోపశమేతరపాపక్షయాదిఫలం జ్ఞేయమ్। "న హి కల్యాణకృత్ కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి" ఇతి భగవదుక్తేః। అవైధతోఽ-పీత్యనేన భక్త్యైకృతే తు విధివిపర్యయేఽపి యథోక్తమేవ ఫలం అవ్యాహతమితి బోధ్యమ్। విచిత్రమతీనాం తథావిధిరుచీనాం జీవానాం రుచివిషయస్య భావనాధికరణత్వాత్ సగుణత్వం చరస్థావరాత్మకత్వం చ బ్రహ్మణ ఇతి భావః॥

**అవతారిక:–** సద్గురువులుపదేశించిన మంత్రములే కదా ఫలించునవి. అదిగాక అంతపెద్ద సంఖ్యలో జపము చేయుటకు బహుకాలము పట్టును కదా! పైగా జపమున కొక మాల, కూర్చొనుటకు ఆసనశుద్ధి, జపము ఫలించుటకు మనస్సునకేకాగ్రత, ఇట్టి జపాంగములుండవలెను కదా! ఇవేమియు లేనివారికి ప్రారబ్ధము నశించు ప్రసక్తి లేదు కదా, అని లోచించి అధికారిభేదమున ప్రారబ్ధమును నశింపజేయు విధులలో భేదములను కూడ భగవదాచార్యులు చెప్పియున్నారు. కనుక విచారించ వలసినది లేదని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము:–** అర్క=పండ్రెండు సంఖ్యయైన, చక్ర+అఙ్క=చక్రములు కలిగిన, మూర్తీనాం=సాలగ్రామమూర్తులకు, వైధతః=వేదోక్తముగా, వా=లేక, అవైధతః అపి= వేదోక్తము కాకున్నను విజ్ఞుల ఆచారముల ననుసరించియైనను, ప్రతి+అహం= అనుదినమును, భావనా=భక్తితో, ఆశ్రయాత్=ఆరాధించుటవలన, ప్రారబ్ధ+ఉపశమః =ప్రారబ్ధము క్షీణించుట, భవేత్=అగును.

**వివరణము:–** లౌకికవిధులు గాని పారమార్థిక విధులుగాని అన్నిటిని పాటించుటకు అందరు సమర్థులు కారు కనుక వారి వారి సమర్థతలను బట్టి ఎవరు యే విధులకు తగుదురో నిర్ణయమే అధికారి నిర్ణయము. అందు భేదములుండక తప్పదు. విధులు సడలించి సులభతరోపాయములు కొన్ని ముందటి శ్లోకములలో చెప్పబడినవి. ఇట మరియొకటి చెప్పబడుచున్నది. పన్నెండు చక్రములుగల సాలగ్రామము నారాధించుటే ఈ యుపాయము. ఇట్టి సాలిగ్రామము స్ఫుటితము, పింగలము అను నిట్టి దోషములు లేనిదైయుండవలెను. స్ఫుటితమనగా పగులువారుట, మొక్క వోవుట. పింగలమనగా ఎఱ్ఱవారిన, లేక పసుపు వారిన గోధుమ వన్నెలో నుండుట, ఎండలోనించుక కళదప్పి నట్లుండుట. అట్లే అందలి చక్రములు సురూపములై సవ్యములై స్పష్టములై యుండ వలెను. ఇది యాచించి తెచ్చినదో దొంగిలించి తెచ్చినదో కారాదు. స్వయముగ సంపాదించినది కావలెను. ఎవరైన మనస్ఫూర్తిగా శ్రద్ధగా (దానరూపమున కాకుండ) ఇచ్చినది కూడ యోగ్యమైనదే. ఇట్టి సాలగ్రామము విష్ణురూపముగ గాని, శివ- రూపముగ గాని అన్యదేవతా రూపములగాని లేక విజ్ఞులైన పెద్దలేర్పరచిన సత్సంప్రదాయము ననుసరించిగాని ఆరాధించవలెను. భక్తిలేని పూజ బడాయికే గాక దేవునకు గాదు. భక్తిగలిగిన అర్చనలో విధి ఇంచుక తప్పినను, **"నహి కల్యాణకృత్ కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి"** అను భగవద్గీతావచనము ననుసరించి, ఫలము సమగ్రముగనే లభించును.

అవతారికా:- నను లక్షణవిహీనానాం తాదృశఫలప్రదానశక్త్యభావాత్ తదారాధనే చాధికారివిశేషస్యోక్తత్వాద్భావనాయాశ్చ సార్వదికత్వానియమాత్ తథా ప్రపన్నానాం న కర్మోపశమ ఇత్యాశఙ్క్య అధికారినియమరహితస్య పరమేశ్వరాచలప్రతిమాస్థాపన-లక్షణస్య కర్మణః ప్రవృత్తోపశమకత్వం శ్రీభగవతోక్తమిత్యాహ--

శ్లో॥ సగుణబ్రహ్మమూర్తీనాం అజవిష్ణుకపర్దినామ్।
అచలార్చాస్థితేః శాన్తిః కర్మణో భావతోఽర్థతః॥ 60

వ్యాఖ్యా:- సగుణబ్రహ్మమూర్తీనామితి। సత్త్వాదిగుణాధిష్ఠాతౄణాం బ్రహ్మవిష్ణుశివానా-మచలా యా అర్చా సువర్ణాదిపాషాణాన్తైః ఘటితా ప్రతిమా సంవాదిభ్రమోత్తమరూపా తస్యాః స్థితిః స్థాపనం తతః కర్మణః ప్రారబ్ధస్య తస్యైవ ప్రకృతత్వాదితరయోస్తు పూర్వముక్తత్వాత్ శాన్తిర్భోగశైథిల్యం భవతి।

తత్రాఙ్గమాహ భావతః అస్యామర్చాయాం స్థాపితాయాం కర్మశాన్తిః భవిష్యతీతి భక్త్యా స్థాపనాత్ అర్థతః ఏతదర్చాస్థాపనకర్మణః కర్మోపశమకత్వం స్వతః ప్రసిద్ధమిత్యర్థ-జ్ఞానాత్ స్థాపితాయాః సా నియతా।

యద్వా హరతి కర్మాణీతి హరిః హరశ్చ న జాయతే ఇత్యజః త్రయాణామపి బ్రహ్మణ ఏవ వాచ్యత్వాత్ ఏతదర్చస్థాపనేనాహమపి తథా స్యామిత్యర్థతో యో భావః శ్రద్ధా తథా స్థాపితాయాః సా భవతి । అథవా అర్చనప్రవాహకనిర్వాహకోపజీవ్యార్పణేన అనుష్ఠితాయాస్తస్యాస్తథా శక్తిమత్త్వమ్। లక్షణప్రతిపదోక్తయోరపి కర్మణోరఙ్గైరపేక్ష్యే-ముఖ్యఫలదాతృత్వదౌర్లభ్యాదఙ్గబాహుల్యేఽపి భావనాస్థానస్య బలవత్తరత్వం ప్రకృత-ఫలస్య అవశ్యంభావ్యాదితి భావః॥

అవతారిక:- లక్షణ విహీనమైనవానికి అట్టి ఫలము నిచ్చుశక్తిలేమిచే అట్టి ఆరాధనము నందున్న అధికారిత ప్రస్తావించబడినందువలన, సార్వత్రికమైన నియమము లేనందు వలన, అట్లు ప్రపన్నులైన వారికి కర్మోపశమము లేదు కదా అని ఆలోచించి, అధికారి నియమములేని పరమేశ్వరవిగ్రహప్రతిష్ఠ లక్షణముగాగల కర్మకు నిశ్చతమైన ఉపశమకత్వమున్నదని శ్రీభగవత్పాదుల వచనము.

ప్రతిపదార్థము:- సగుణ=రూపము, మనోధర్మములు ఇత్యాది లక్షణములుగల, బ్రహ్మమూర్తీనామ్=పరబ్రహ్మయొక్క మూర్తులైన, అజ=బ్రహ్మ, విష్ణు=విష్ణువు, కపర్దినామ్=శివుడు అను ముప్వరియొక్క, అచల=కదలికలేని వానిని, అర్చా=

అర్చించుటకై, స్థితేః=స్థాపించుట, భావతః=భక్తితో, అర్థతః=అర్చాస్థాపనకు, కర్మణః =ప్రారబ్ధకర్మకు, శాన్తిః=ఉపశాంతి.

**వివరణము:–** బ్రహ్మ రజోగుణప్రధానుడు. విష్ణువు సత్త్వగుణ ప్రధానుడు. శివుడు తమోగుణప్రధానుడు. కనుక వీరి నర్చించుట సగుణము. వీరి నర్చించుటకు వీరి విగ్రహములను బంగారము, వెండి, పంచలోహములు మొదలైనవానితో గాని శిలతో గాని రూపొందింపబడిన వానిని ప్రతిష్ఠించి అర్చించుట ప్రారబ్ధనాశకమని ఆచార్యులు చెప్పిరి. ఈ అర్చనకు భక్తి ముఖ్యము. అర్థజ్ఞానముతో చేసినప్పుడు కర్మను హరించు వారు హరిహరులని, పుట్టుకలేనివాడు బ్రహ్మయని, వీని అర్చనస్థాపనములవలన తాను గూడ వీరివలె కాగలనను భావమేర్పడుట సాధ్యమగును. ఇట్లు కర్మజన్మల బంధము సడలుట కవకాశమేర్పడును.

**అవతారికా:–** సమాహితచేతసాం త్వసాధారణం స్వభావసిద్ధమజపాజపానుసన్ధానం ప్రారబ్ధోపశామకమస్తీత్యాహ --

శ్లో॥ నాసాసమ్పుటలీలస్య మనోర్హంసోదయాత్ పురా।
వినియోగానుసన్ధానాత్ ప్రవృత్తోపశమః పరః॥ 61

**వ్యాఖ్యా:–** నాసాసమ్పుటలీలస్యేతి । నాసాసమ్పుటయోర్నాసారన్ధ్రయోర్లీలా ఉచ్ఛ్వాస-నిఃశ్వాసలక్షణా యస్య తస్య మనోః మన్త్రస్య హంసోదయాత్ సూర్యోదయాత్పురా బ్రాహ్మే ముహూర్తే ఇత్యర్థః। సామాన్య ప్రాప్తావప్యుక్తప్రకారస్యైవ సత్ఫలదాతృత్వాత్। వినియోగసహితం యదనుసన్ధానం తస్మాత్పరః ఉక్తాఖిలప్రారబ్ధకర్మోపశామకకర్మణామ్ ఉత్తమః ప్రవృత్తస్య ప్రారబ్ధస్య ఉపశమో భవతి। వినియోగో బ్రహ్మరన్ధ్ర సప్తమక-మూలాధారాదిషట్చక్రస్థితగణేశాది దేవేభ్యో యథాభాగం నివేదనమ్।

అనుసన్ధానం చ 'హం' కారేణ ప్రవిశతీతి 'సః' కారేణ బహిర్యాతి, హం కారేణ బహిర్యాతి సః కారేణ ప్రవిశతీతి వా। సమగతౌ షట్ఛతాధిక-ఏకవింశతి సహస్రసఙ్ఖ్యావృత్తిః (21,600)। అధికే తావదాయుక్షయోన్యూనే తావదాయుర్వృద్ధిః అత ఏవ యోగినః కుమ్భకాభ్యాసేన ఆయుర్వృద్ధిం లభన్తే ఇత్యాదిచిన్తనమ్।

అథ నివేదన ప్రకారః। బ్రాహ్మే ఉత్థాయ రాత్రివాసః పరిత్యజ్య శుచిర్భూత్వా పూర్వోత్తరాస్య ఆచమ్య'అద్యేహ పూర్వేద్యురహోరాత్రాచరిత-నాసాపుటనిఃసృత-ఉచ్ఛ్వాస-నిశ్వాసాత్మకషట్ఛతాధిక-ఏకవింశతిసహస్రసఙ్ఖ్యాక అజపాగాయత్రీజపం

గణపతి-బ్రహ్మవిష్ణురుద్రజీవగురుపరమాత్మభ్యో యథాభాగం నివేదయామి' ఇతి సఙ్కల్ప్య మూలాధారచక్రే రక్తవర్ణచతుర్దలకమలస్థాయ సిద్ధిశక్తిసహితాయ శ్రీ గణేశాయ షట్ఛతమజపాగాయత్రీజపం నివేదయామి। స్వాధిష్ఠానచక్రే విద్యున్నిభషడ్దలపద్మస్థాయ సరస్వతీశక్తిసహితాయ బ్రహ్మణే షట్సహస్రజపాగాయత్రీజపం నివేదయామి। మణిపూరచక్రే ఇన్ద్రనీలమణినిభదశదళకమలస్థాయ మహాలక్ష్మీశక్తిసమేతాయ శ్రీమహావిష్ణవే షట్సహస్రమజపజపాగాయత్రీజపం నివేదయామి। అనాహత చక్రే పీతవర్ణద్వాదశదలకమలస్థాయ శ్రీ గౌరీశక్తిసమేతాయ శ్రీశివాయ షట్సహస్రమ-జపాగాయత్రీజపం నివేదయామి। విశుద్ధచక్రే శ్వేతవర్ణషోడశదలకమలస్థాయ ప్రాణశక్తి-సహితాయ శ్రీ జీవాత్మనే సహస్రమజపాగాయత్రీజపం నివేదయామి। ఆజ్ఞాచక్రే ధవలవర్ణద్విదలకమలస్థాయ జ్ఞానశక్తిసమేతాయ శ్రీగురవే సహస్రమజపాగాయత్రీజపం నివేదయామి। బ్రహ్మరన్ధ్రచక్రేఽనేకవర్ణసహస్రదలకమలస్థాయ చిచ్ఛక్తిసమేతాయ శ్రీ పరమాత్మనే సహస్రమజపాగాయత్రీజపం నివేదయామి। కేచిత్తు ఆజ్ఞాచక్రే పరమాత్మానం బ్రహ్మరన్ధ్రేగురుం ధ్యాయన్తి। "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" ఇతి శ్రుతి-వచనాత్ శక్తిసామ్యాచ్చావిరోధః। ఇతి నివేద్య పునః "అద్య ప్రాతరారభ్య ఆగామిప్రాతః పర్యన్తం నాసాపుటనిఃసృత శ్వాసోచ్ఛ్వాసాత్మకం షట్ఛతాధిక ఏకవింశతిసహస్ర-సంఖ్యాకాజపాగాయత్రీజపమహోరాత్రేణ కరిష్యే" ఇతి సంకల్ప్య స్వకృత్యమాచరేత్।

ఇదం చోపాసనం వినా సుకృతమతిదుర్లభమ్। అనాయాసజాతమపి ప్రత్యక్షమపి జీవజీవనమపి అలౌకికగుణాదికరణమపి వ్యాపకమపి పరమాత్మదైవతమపి, శ్రీగురూపసత్తిం వినా సదుపాసనం వా వినా, తీర్థశుద్ధిం వినా పరమేశ్వరానుగ్రహం వినా నానుభూయతే చైతదాదివస్తుసదితి భావః॥

**అవతారిక :-** స్వాధీనచేతస్కులకు మాత్రము అసాధారణమైన, స్వభావసిద్ధమైన అజప- జప గాయత్రీమంత్రానుసంధానము ప్రారబ్ధమునుపశమింపజేయునదిగా నున్నదని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :-** నాసాసమ్పుట=ముక్కుపుటములయొక్క, లీలస్య=ఉచ్ఛ్వాసనిఃశ్వాస లక్షణముగల, మనోః=మంత్రముయొక్క, హంస+ఉదయాత్=సూర్యోదయమునకు, పురా=పూర్వము, వినియోగ+అనుసన్ధానాత్=వినియోగముతో కూడిన అనుసంధాన మేదో దాని కంటె పరమైనదానివలన, ప్రవృత్త+ఉపశమః=ప్రారబ్ధముయొక్క శాంతి.

**వివరణము :-** మనసును వశముజేసికొనినవారికి గాయత్రీమంత్రజపము ప్రారబ్ధ-

నాశకమగుచున్నది. గాయత్రీమంత్రము రెండు విధములని, అది ప్రాణులలో తెలియకయు తెలిసియు జపించబడుచుండుననియు శాస్త్రవచనము. తెలియక ప్రకృతి-సిద్ధముగనే జరుగునది అజపగాయత్రి. ఇది ఉచ్ఛ్వాస-నిఃశ్వాసలతో నిరంత-రాయముగ జరుగునది. ఈ జపప్రభావమున నుత్పన్నమైన చైతన్యశక్తి చేతనే కదా జీవమును పొంది ప్రాణి జీవుడగుట. దీనిని తెలిసి జపగాయత్రితో ననుసంధించవలె నని శాస్త్రము చెప్పును. అనగా యే గాయత్రీమంత్రము తండ్రిచే సంస్కారపూతముగ నుపదేశింపబడునో అది జపగాయత్రి. అజపకు హంసః అను రెండే అక్షరములు. కనుకే దానికి హంసమంత్రమనియు పేరు. హంస యనగా సూర్యుడనియు, ఆత్మ యనియు, పరమాత్మయనియు అర్థములలో కొన్ని. గాయత్రి పరమాత్మార్థకమైన సూర్యతేజోరాధనము. దీనిచే జీవాత్మసంబంధి జడప్రకృతి చైతన్యమును పొంది పరమాత్మానుసంధానమునకు ప్రేరకమగును. ఇట్టి జపమునకు బ్రాహ్మీముహూర్తము సరియగువేళ. **"హంసోదయాత్ పురా"** అనుట ఈ ముహూర్తమును జెప్పుటకే. ఐనను ఈ మంత్రజపము వినియోగముతో గూడి యున్నప్పుడే సత్ఫలము కలుగును. వినియోగమనగా, మూలాధారచక్రము మొదలు ఆరోహణ క్రమమును పాటించి స్వాధిష్ఠానము, మణిపూరము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞ అనెడివి ఆరు. వీని స్థానములు, శరీరమున, అపానము, లింగస్థానము, నాభి, హృదయము, కంఠము, భ్రూమధ్యము. వీనిపైనున్నది బ్రహ్మరన్ధ్రము. ఇవి శక్తికేంద్రములు. ఇందు వరుసగ అధిష్ఠాన దేవతలు గణేశుదాదిగ గలరు. ఈ దేవతలకు వారి వారికి నిర్ణయించబడిన ప్రకారము భాగములుగ నివేదించుటకే వినియోగమని పేరు. అనుసంధానము అనగా -- శ్వాస విడచునపుడు 'హం' అను శబ్దము, లోనికి పీల్చునపుడు 'సః' అను శబ్దము, ఈ రెండిటిని సమతులముగ గణించిన సమగతిశ్వాసము సంఖ్య 21,600 అగును. ఇంతకంటె మించిన వేగముగ శ్వాసించుట ఆయుఃక్షీణతను, తక్కువ వేగము గల శ్వాసవలన ఆయుర్వృద్ధియు కలుగునని శాస్త్రవచనము. యోగులీ కారణముననే కుమ్భకప్రక్రియ నభ్యసించి సుదీర్ఘకాలజీవులగుచున్నారు.

నివేదన ప్రకారమిట్లు – బ్రాహ్మీముహూర్తమున నిద్రమేల్కొని, రాత్రి ధరించిన వస్త్రములను వదలి, శుచియై (అనగా, కాల్యకృత్యము లాచరించి, స్నానాదివిధు లాచరించి), ఈశాన్యమును జూచుచు కూర్చుండి ఆచమనము జేసి, "నిన్నటిరోజు రాత్రింబవళ్ళు నే నాచరించిన ఉచ్ఛ్వాస నిఃశ్వాస రూపమైన 21,600 అజపగాయత్రీ

జపమును గణపతి-బ్రహ్మ-విష్ణు-రుద్ర-జీవ-గురు-పరమాత్మలకు యథాభాగముగ నివేదించుచున్నాను" అని సంకల్పమును జెప్పికొని, మూలాధారచక్రమున రక్తవర్ణము గల నాలుగు దళముల కమలమునధిష్ఠించిన సిద్ధిశక్తిగలిగినట్టి శ్రీ గణేశునకు 600 అజపాగాయత్రీజపమును నివేదించుచున్నాను, స్వాధిష్ఠానచక్రమున విద్యుత్తువలె నుండు ఆరుదళముల పద్మమును అధిష్ఠించియున్న సరస్వతీశక్తి గలిగినట్టి బ్రహ్మకు 6000 అజపగాయత్రీజపమును నివేదించుచున్నాను, మణిపూరచక్రమున, ఇంద్రనీల మణివలెనున్న పది దళముల కమలము నధిష్ఠించియున్న మహాలక్ష్మీశక్తిని గలిగినట్టి శ్రీ మహావిష్ణువునకు 6000 అజపగాయత్రీజపమును నివేదించుచున్నాను, అనాహత-చక్రమున పసుపురంగుగల పండ్రెండు దళముల కమలము నధిష్ఠించియున్నట్టి శ్రీ గౌరీ శక్తిని గూడిన శ్రీ శివునకు 6000 అజపగాయత్రీ జపమును నివేదించుచున్నాను, విశుద్ధచక్రమున తెల్లనిరంగులోగల పదియారు దళముల పద్మము నధిష్ఠించియున్నట్టి ప్రాణశక్తిగల శ్రీ జీవాత్మకు 1000 అజపగాయత్రీ జపమును నివేదించుచున్నాను, ఆజ్ఞాచక్రమున ధవళ(తెలుపు) వర్ణములోనున్న రెండు దళముల కమలము నధిష్ఠించిన జ్ఞానశక్తని గల్గియున్నట్టి శ్రీ గురువునకు 1000 అజపగాయత్రీ జపమును నివేదించు చున్నాను, బ్రహ్మరంధ్రమున అనేక వర్ణములుగల వెయ్యి దళముల కమలము నధిష్ఠించి నట్టి చిచ్ఛక్తి గల శ్రీ పరమాత్మకు 1000 అజపగాయత్రీ జపమును నివేదించుచున్నాను. కొందఱు ఆజ్ఞాచక్రమున పరమాత్మని, బ్రహ్మరంధ్రమున గురుని ధ్యానించుచున్నారు. "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" అను వేదవచనమువలన శక్తి-సామ్యమువలన విరోధము లేదు-ఇట్లు నివేదించి, మరల "నేటి ప్రాతఃకాలము మొదలు రాగల ప్రాతఃకాలము వరకును ముక్కు పుటముల నుండి వెలువడు ఉచ్ఛ్వాస-నిఃశ్వాసరూప మైన 21,600 అజపగాయత్రీజపమును రాత్రింబవళ్ళు చేయుదును" అని సంకల్పించి తన పనులు తాను చేసికొనవలయును. ఈ ఉపాసనము సుకృతము లేనిచో చాల దుర్లభము. కష్టపడకుండ కలిగినదైనను, ప్రత్యక్షముగ జీవుని జీవనమే ఇదియైనను, అలౌకికగుణములను కలిగించునది యైనను, సర్వవ్యాపకమైన పరమాత్మయే దేవతగాగలదైనను శ్రీ గురువుల ఉపదేశము, సదుపాసనము, తీర్థసేవనమువలని శుద్ధి, శ్రీపరమేశ్వరానుగ్రహములేనిదే ఈ అజపగాయత్రీ ఉపాసనము లభించదు, ఫలవంతము కాదు.

అవతారికా:- అచలప్రతిమాస్థాపనలక్షణేష్వపి కర్మసు శివలిఙ్గస్థాపనస్య ప్రవృత్తోప- శమాదప్యధికం ఫలమస్తీత్యాహ --

శ్లో॥ భావిసఞ్చితయోర్ధ్వస్తిః ప్రవృత్తోపశమస్తథా ।
భవేత్సదఙ్గసమ్పత్తిర్జ్యోతిర్లిఙ్గస్య ధారణాత్ ॥ 62

వ్యాఖ్యా:- భావిసఞ్చితయోరితి । జ్యోతిర్లిఙ్గస్య శివలిఙ్గస్య ధారణాత్ స్థాపనాద్భావి- సఞ్చీయమానం తస్య సఞ్చితస్య చ ధ్వస్తిర్నిర్బీజత్వం ప్రవృత్తస్య ప్రారబ్ధస్య చోపశమో భోగశైథిల్యం భవేత్ । భోగశైథిల్యం చ హర్షశోకవృత్తేరనుదయోఽనుత్కర్షో వా। కిఞ్చ సదఙ్గసమ్పత్తిః సద్బ్రహ్మ సత్సంబన్ధిజ్ఞానాఙ్గానాం పరోక్షజ్ఞానవైరాగ్యోపరతీనాం సమ్పత్తిః కాత్స్న్యేదయశ్చ భవతి ।

యద్వా జ్యోతిర్లిఙ్గస్య జ్యోతిః స్వరూపస్య బ్రహ్మణః ధారణం "సచ్చిదానన్దరూపో -ఽహమ్", "బ్రహ్మాహమస్మీ" తి వా నిర్గుణోపాసనం తస్మాత్ సర్వమేవ సమ్పద్యతే। సన్నృతార్థప్రవృత్తార్థయోః పరమార్థప్రకాశకయోః అవిశేషప్రవృత్తేరితి భావః॥

అవతారిక:- దేవతామూర్తుల విగ్రహ ప్రతిష్ఠచేయుట వంటి కర్మలకు గూడ శివలింగ- ప్రతిష్ఠాపనకు అధికమైన ప్రారబ్ధశాంతిని కలిగించు ఫలమని చెప్పుచున్నాడు.

ప్రతిపదార్థము:- జ్యోతిర్లిఙ్గస్య=శివలింగము యొక్క, ధారణాత్=ధరించుటవలన, సత్+అఙ్గ సమ్పత్తిః=సద్బ్రహ్మమును గూర్చిన పరోక్షజ్ఞాన, వైరాగ్య, ఉపరతుల యొక్క సంపద, భావి=సంచీయమాన, సఞ్చితయోః=సంచితములయొక్క, ధ్వస్తిః=నాశము, ప్రవృత్త=ప్రారబ్ధముయొక్క, ఉపశమః=క్షీణత, తథా=అట్లే, భవేత్=కలుగును.

వివరణము:- జ్యోతిర్లింగమైన శివలింగధారణస్థాపనలవలన ఆగామిసంచీయమాన కర్మలయ్యు, సంచితకర్మయొక్కయు బీజనాశమును, అనుభవములోనున్న ప్రారబ్ధకర్మకు భోగము శిథిలమగుటయు సంభవించును, అనగా హర్షశోకవృత్తులు ఉదయింప- కుండుటగాని, వాని తీవ్రత తగ్గుటగాని అగును. అదిగాక, బ్రహ్మసత్యమునకు సంబంధించిన జ్ఞానము కలుగనివారికి పరోక్షజ్ఞానవైరాగ్యములయొక్క సంపద కలుగును.

జ్యోతిర్లింగము భావమున జ్యోతిస్స్వరూపుడైన పరబ్రహ్మము. సచ్చిదానందుడు. కనుక లింగధారణమనగా, భావమున బ్రహ్మోఽహమస్మి, సచ్చిదానన్దరూపోఽహమ్ అను నిర్గుణోపాసనము. దానివలన సమస్తశుభము లేర్పడును.

అవతారికా:-నను స్వల్పకాలాల్పద్రవ్యాల్పభావైరపి సాధ్యస్య లిఙ్గస్థాపనస్య త్రివిధకర్మోప-శమనాత్మకఫలకథనం స్వకపోలకల్పితమితి నిరవధానమన్దమతీనామాశఙ్కాం శివసమ్మత్యా పరిహరతి --

శ్లో॥ కాలకర్మగుణాస్తానాం కృపయా ప్రాక్శరీరిణామ్।
కర్మశాన్త్యై శివః సాక్షాల్లిఙ్గస్థాపనముక్తవాన్ ॥ 63

వ్యాఖ్యా:- కాలకర్మగుణాస్తానామితి। కాలకర్మగుణైః పూర్వముక్తలక్షణైః అస్తానాం గ్రస్తానాం వశీకృతానామిత్యర్థః। ఆత్మజ్ఞానానుకూలకర్మకౌశలమజానానాం శరీరిణాం పాఞ్చభౌతికశరీరసమ్బన్ధవతాం జీవాత్మనాం జన్మనిదానభూతపుణ్యాపుణ్యజన్మస్థానానాం కర్మణాం శాన్త్యై నాశార్థం లిఙ్గస్థాపనం నార్మదాదిపాషాణాస్తానాం శివలిఙ్గానాం స్థాపనం శివః పరమేశ్వరః సాక్షాదుక్తవాన్। సాక్షాదిత్యనేన పరమ్పరా-సమ్బన్ధోక్తిః నిరస్తా। దన్దహ్యమాన చతుర్విధజీవనికాయానుకమ్పాయావ్యాపి కరాలకాలకూటం కరతలీకృత్య పిడితః స్వచ్ఛన్దమాయానగరవిహారేణ త్రిలోకీం కమ్పయన్తం త్రిపురాధిష్ఠాతారం ప్రబలదైత్యసమూహమేకబాణేన సంహరతః జగదమ్బికానాథస్య కర్మపాశనిబద్ధజీవానాం తదుపశమనద్వారా స్వరూప-ప్రాప్త్యుపాయకథనం నాశ్చర్యకరం, యోగ్యతరం చైవేతి భావః॥

అవతారిక:- కొద్ది కాలంలో, కొద్దిపాటి ద్రవ్యంతో, చాల తక్కువ భక్తితో సాధ్యపడునట్టి లింగ ప్రతిష్ఠకు మూడు విధముల కర్మశాంతి యను ఫలము జెప్పుట ఊహాజనితమే అని అవగాహనలేని, మతిమాంద్యముగలవారికి కలుగు శంకను శివుని సమ్మతిని ఉట్టంకించి పరిహరించుచున్నాడు.

ప్రతిపదార్థము:- కాలకర్మగుణ=ముందే చెప్పబడిన లక్షణములచేత, అస్తానామ్=పట్టుకొనబడిన, ప్రాక్శరీరిణామ్=పార్థివశరీరముగల జీవాత్మలకు, కర్మశాన్త్యై=కర్మ నశింపుకొరకు, లిఙ్గస్థాపనమ్=లింగ ప్రతిష్ఠాపనము, శివః=శివుడు, కృపయా=దయతో, సాక్షాత్+ఉక్తవాన్=స్వయముగ చెప్పియున్నాడు.

వివరణము:- జీవాత్మ కాలమునకు చిక్కియే శరీరమును ధరించును. కాలములో దేశము అంతర్భవించునదే. శరీరము కాలదేశపరిమితులకు లోనైయుండును. అట్లే, కర్మయు శరీరముచే చిక్కును. శరీరమున ఇంద్రియ మనోబుద్ధులు భాగములే. వీని వ్యాపారమే కర్మ. ఇది కొంత శరీరముచే, మరికొంత ఇంద్రియములచే, మరికొంత మనస్సుచే, ఇంకను కొంత బుద్ధిచే జరుగుచుండును. ఇట్టి కర్మేంద్రియ జ్ఞానేంద్రియ

వశుడై జీవుడుండును. వీనికి తోడు పుట్టువుచేతనే జీవుడు సత్త్వరజస్తమోగుణములు మూడింట నొకదానికి ప్రధానముగ వశుడైయుండును. ఆత్మజ్ఞానమును పొందుటకు అనుకూలమైన కర్మలేవియో వానిని సాధించుటెట్లో వీనికి తెలియదు. వీనికిట్లు ఆత్మజ్ఞానము పొందుటకు ప్రతిబంధకము జన్మసిద్ధమగుచున్నది. అట్టివారిలో ఏ కొద్దిమందికో తప్ప ఆత్మ జ్ఞానమును సంపాదించుటలో దోహదపడు కర్మలేవియో వానినెట్లు చేయవలెనో తెలియదు. వీరికి జన్మకు కారణమైన పుణ్యపాపములు పుట్టుకకు మూలమైన కర్మలు నశించుటకై లింగప్రతిష్ఠాపనము శివుడే స్వయముగ చెప్పి యున్నాడు. అనగా, ఇది పరంపరాగతమైనది కాదని భావము. జీవులపై దయతో, కాలకూట విషమును వ్యాప్తమైయున్న దానిని అరచేత పట్టికొని త్రాగినవాడగునట్టి, తనదైన మాయానగరవిహారముతో మూడు లోకములను వణకించుచున్న త్రిపురాసురుని, బలిసిన రాక్షసులను ఒకే బాణముతో సంహరించినవాడగు జగదంబానాథుడైన శివుడు, జీవుడు కర్మ పాశమును ఛేదించికొని తన నిజరూపమును పొందునుపాయము జెప్పుట ఆ స్వామి దయకు తగినదే కాని ఆశ్చర్యకరము గాదు.

అవతారికా:- స్వసమ్బన్ధిలిఙ్గస్థాపనప్రవర్తకస్య శివవచనస్య కిం ప్రమాణమిత్యశ్రుత-పరమేశ్వరమహిమ్నామాత్మభేదైకోపజీవ్యానాం మన్దతరాణామాశఙ్కాం పరిహరన్ చతుర్వేదప్రవర్తకచతుర్ముఖసమ్మతిం చ ప్రమాణయతి --

శ్లో॥ శివలిఙ్గస్థితేరన్యత్ కర్మక్షయకరం పరమ్।
జ్ఞానయోగవిహీనానాం నాస్తీత్యాహ ప్రజాపతిః॥ 64

వ్యాఖ్యా:- శివలిఙ్గస్థితేరితి। ప్రజాపతిః సకలజీవకర్మప్రవర్తకః ప్రకాశకో వా రజోగుణాధిష్ఠాతృదేవో జ్ఞానయోగాదిహీనానాం దేహినాం శివలిఙ్గస్థితేః శివలిఙ్గస్థాపన-రూపాత్ కర్మణః సకాశాత్పరముత్కృష్టమన్యదపరం కర్మణాం త్రివిధానాం క్షయకరం నాస్తీత్యాహ। జ్ఞానయుక్తానాం జ్ఞానేన కర్మాణి నశ్యన్తి, యోగినాం యోగేన చిత్తనిగ్రహ-ద్వారా కర్మాణి నశ్యన్తి। కాలకర్మగుణాజగరగలితానాం మన్దమతీనామల్పాయుషాం కర్మకౌశలలేశమప్యజానానాం హఠయోగరాజయోగ-వైరాగ్య-వివేకోపరతిమార్గ-దౌర్లభ్యాత్ స్వరూపలాభస్య దుర్ఘటత్వం మన్యమానః దయానిధిః సకలలోకపితామహః వేదార్థప్రణిహితమతిర్బ్రహ్మా స్వల్పకాలాల్పద్రవ్య-సర్వప్రయాసైరపి సాధ్యం సర్వకర్మ-క్షయకరం శివలిఙ్గస్థాపనమేవ సర్వోత్కర్షేణ దర్శితవానితి భావః॥

**అవతారిక:**– తనకు సంబంధించిన లింగప్రతిష్ఠాపనను ప్రచారము చేయునట్టి శివుని వచనమునకు ప్రమాణమేమి యని ప్రశ్నించునట్టి, పరమేశ్వరుని మహిమను గూర్చి వినియుండనిజీవాత్మభేదములే జీవికగా గలిగిన మందమతుల యొక్క సంశయమును నివృత్తిచేయుచు, నాల్గు వేదములను వర్తింపజేయు నాల్గు ముఖములుగల బ్రహ్మయొక్క సమ్మతిని గూడ ఈ విషయమున ప్రమాణముగ చూపుచున్నాడు.

**ప్రతిపదార్థము:**– జ్ఞానయోగవిహీనానాం=జ్ఞానము, యోగము రెండును లేనివారికి, కర్మక్షయకరం=కర్మను నశింపజేయునది, శివలిఙ్గస్థితేః=శివలింగప్రతిష్ఠాపనకంటె, పరమ్=పరమమైన, శ్రేష్ఠమైనది, అన్యత్=వేరొకటి, న+అస్తి=లేదు, ఇతి=అని, ప్రజాపతిః=బ్రహ్మ, ఆహ=చెప్పెను.

**వివరణము:**– శివలింగప్రతిష్ఠ కర్మనాశకమని శివుడు చెప్పుట ప్రమాణ మెట్లగునని కొందరు సందేహించువారున్నారు. ఏలన, శివలింగము శివునికి సంబంధించినది కనుక దాని గొప్ప జెప్పు శివుడు సామాన్యునివలె తోచును. ఆ కారణమున ప్రామాణ్యము లోపించునని భావము. బ్రహ్మ లోకస్రష్ట. లోకములను పాలించు వేదములు నాల్గును వాని ముఖమున వెలువడినవే. అట్టి బ్రహ్మకూడ శివుని మాటను సమర్థించెనన్నచో, శివుని మాటకు విలువ యున్నట్లే కదా, బ్రహ్మ ఇట్లనినాడు – శివలింగమును ప్రతిష్ఠించి, పూజించుటకంటె జ్ఞానహీనులకు, యోగులు కానివారికి కర్మనశించునుపాయము వేరొకటిలేదు, అని. జ్ఞానముగలవారికి జ్ఞానముచేత కర్మలు నశించును. యోగులకు యోగవిద్యద్వారా కలుగు మనోనిగ్రహము ద్వారా కర్మలు నశించును. ఈ రెండును లేనివారికి అన్యమైన హఠయోగము, రాజయోగము, వైరాగ్యము, వివేకము, భక్తి ఇత్యాది మార్గములు దొరుకుట మహాకష్టము. వీరిపై దయతో ఈ శివలింగప్రతిష్ఠను ఉపాయముగ బ్రహ్మయే చెప్పియున్నాడు. బ్రహ్మ సాక్షాత్ కర్మప్రవర్తకుడు, కర్మను ప్రకాశింపజేయు రజోగుణమును అధిష్ఠించిన దేవుడు. కర్మ రజోగుణమును ఆశ్రయించినదే కదా. పూర్ణసాత్త్వికకర్మకుకూడా ఎంతో కొంత రజోగుణసంపర్కము ఉండక తప్పదు. ఇక తామసికుడు కర్మజనుడే. కాని కర్మకు పూనినచో దురహంకారకర్మకే పూనును. కనుక కర్మ రజోమూలమనుట. ఆ గుణాధిష్ఠాత బ్రహ్మ. వాని మాటను కాదని త్రోసివేయుటెట్లు?

అవతారికా:- లిఙ్గస్థాపనకర్మణా సర్వాంశేన సఞ్చితసఞ్చీయమానయోర్నివృత్తి-మభినయేన దర్శయతి --

శ్లో॥ జీవత్వావధికర్మాణి సోపకర్మాణి సర్వశః।
స్థాపనాద్ బ్రహ్మలిఙ్గస్య క్షయం యాన్తి శరీరిణామ్॥ 65

వ్యాఖ్యా:- జీవత్వావధీతి। శరీరిణాం మాయాకల్పితశరీరసమ్బన్ధవతామ్ "అహం సుఖీ, అహం దుఃఖీ" ఇత్యాదిదేహాధ్యాసేన తద్ధర్మవతాం జీవాత్మనాం యావత్కాల-మారభ్య బ్రహ్మణః జీవత్వవ్యవహారోదయః సోఽవధిర్యేషాం తాని కర్మాణి ఉపకర్మాణి పరేచ్ఛానిచ్ఛాజాతాని తత్సహితాన్యపి సర్వశః త్రివిధాని కర్మాణి బ్రహ్మలిఙ్గస్య శివలిఙ్గస్య స్థాపనాత్ క్షయం యాన్తి।

యద్యపి మాయాయా అనాదిత్వాజ్జీవత్వవ్యవహారోదయో వేదప్రవచనైరపి అనిర్ధేతవ్యః, తథాపి కర్మక్షయకరోపాయేషు శివలిఙ్గస్థాపనస్యాసాధారణత్వప్రతిపాద-నాయ జీవత్వావధీత్యుక్తమ్। సర్వశ ఇత్యుక్తేఽపి సఞ్చితసఞ్చీయమానయోర్నిర్బీజత్వం ప్రవృత్తస్య తు శైథిల్యమితి వివేకః ప్రకృతావిరుద్ధార్థస్యైవ అభ్యర్థితత్వాదితి భావః।

అవతారిక:- లింగప్రతిష్ఠచే అన్నివిధముల సంచితసంచీయమానకర్మల నివృత్తి యగునని నిశ్చయముగా చెప్పుచున్నాడు.

ప్రతిపదార్థము:- శరీరిణాం=శరీరమును ధరించిన జీవాత్మలకు, జీవత్వ+అవధి= జీవత్వమున్నంతకాలములో చేయబడు, సర్వశః=మూడు విధములైన, కర్మాణి=కర్మలు, స+ఉపకర్మాణి=ఉపకర్మలతోగూడి, బ్రహ్మలిఙ్గస్య=శివలింగముయొక్క, స్థాపనాద్= ప్రతిష్ఠాపనవలన, క్షయం=నాశమును, యాన్తి=పొందుచున్నవి.

వివరణము:- ఆత్మ జీవత్వమును పొంది జీవాత్మయగుచున్నది. ఇట్లు జీవత్వమును పొందుటకు శరీరమును ధరించుచున్నది. ఇట్లు జీవునకు శరీరసంబంధము మాయాకల్పితము. శరీరధారియైనది మొదలు "నేను సుఖముగనున్నాను, నేను దుఃఖముతోనున్నాను" అని ఇట్లు దేహధ్యానమేర్పడి ఆ దేహధర్మములే తనవని దేహాంతమువరకు భావించుచు కర్మలన్నిటికి కర్త తానేయని భ్రమించుచుండును. ఈ కర్మలు, ఉపకర్మలు కొన్ని జీవి కోరిచేయునవి, కొన్ని జీవి ప్రమేయము లేకుండ జరుగునవి. ఇట్టివి అన్నివిధముల కర్మలను కలిసి మూడు విధములుగనున్నవి. ఇవి మాయాప్రేరితములు. అన్నివిధముల కర్మలు అని చెప్పిననూ ఉద్దిష్టములు,

సంచితసంచీయమానకర్మలని గ్రాహ్యము. ఈ మాయ అనాది. ఐనను, కర్మక్షయమున కుపాయములలో శ్రేష్ఠతమము, సుసాధ్యము శివలింగప్రతిష్ఠయని భావము.

**అవతారికా:-** నను నిమేషమాత్రేణ సావరణబ్రహ్మాణ్డదాహకస్య జ్యోతిఃస్వరూపస్య అనన్తాపారశక్తేర్జగదీశ్వరస్య ప్రతిష్ఠితాచలప్రతిమాయా అవిచ్ఛిన్నం కర్మోపశామలక్షణం కిమేతావదేవ ఫలమిత్యాశఙ్క్య పరమేశ్వరారాధనలక్షణకర్మణోఽనన్తమహిమత్వం ప్రదర్శయన్ కర్మత్రయోపశమఫలస్య మార్గతృణస్పర్శవదానుషఙ్గికత్వం ప్రతిపాదయతి-

*శ్లో॥ అనన్తత్వాత్ప్రభావస్య లిఙ్గస్థాపనకర్మణః।*
*అనుషఙ్గిఫలం హ్యేతదప్రమేయం పరం ఫలమ్॥* **66**

**వ్యాఖ్యా:-** అనన్తత్వాదితి। శివలిఙ్గస్థాపనలక్షణకర్మణః ప్రభావస్య మహిమలక్షణ-పరాక్రమస్యానన్తత్వాదపరిచ్ఛిన్నత్వాద్ ఏతత్త్రివిధకర్మపరిశమనరూపఫలం తు అనుషఙ్గి అర్వాచీనమల్పమ్ ఉపక్రమమాత్రాదేవోత్పద్యతే, పరం ఫలం తు అప్రమేయం శ్రుతికదమ్బేనాపి శేషప్రముఖముఖరైరపి ప్రమాతుమశక్యమ్ ఇత్యర్థః "అత్యతిష్ఠద్దశా-ఙ్గులమ్" ఇతివదపరిచ్ఛిన్నమపి వస్తువ్యవహృతయే పరిచ్ఛేదేన శ్రుతిం పురస్కృత్య పరమాచార్యైరుపచర్యతే ఇతి భావః॥

**అవతారిక:-** ఒక్క నిమిషములో బ్రహ్మాండమును దాని ఆవరణలతో గూడ భస్మము చేయగల జ్యోతిః స్వరూపుడైన అనంతాపారశక్తియుతుడైన జగదీశ్వరునియొక్క అచల-ప్రతిమను ప్రతిష్ఠించిన ఫలము కర్మోపశమన మాత్రమేనా? అని విచారించి ఈశ్వరా-రాధనకు అనంత మహిమ గలదనుచు, మూడు విధములైన కర్మనాశము కేవలము నడచువాడు త్రోవలోని గడ్డిపరకను తాకుట ఎట్టిదో అట్టిదేయని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము:-** లిఙ్గస్థాపనకర్మణః=శివలింగమును ప్రతిష్ఠించు క్రియకు,(గల) ప్రభావస్య=శక్తియొక్క,అనన్తత్వాత్=మితిలేమిచే,ఏతద్=ఈ, అప్రమేయం=ఇంతనరాని, పరం=పరమమైన, ఫలమ్=ఫలముగలదాని, అనుషఙ్గిఫలం హి=తదంగమైన ఫలము మాత్రమే.

**వివరణము:-** లింగస్థాపన ఫలము నిజముగ ఇంతయని వర్ణింపరానంత గొప్పది. సంచిత-సంచీయమాన-ప్రారబ్ధకర్మల ఫలమును నశింపజేయుట అనగా దాని ప్రభావస్పర్శమాత్ర సంభవమే. వేదములకుగాని, ఆదిశేషుడాదిగాగల ప్రముఖులకు గాని ఎఱుగరానిదని భావము.

అవతారికా:- నను జీవపరమాత్మనోర్బ్రహ్మస్వరూపత్వాదప్రచ్యుత్యైవ స్వరూపసమ్పత్తిః కిమితి కర్మనిర్హారకోలాహలప్రసర ఇత్యాశఙ్క్య ఉపాధిసంయోగోత్థద్వైరూప్యభ్రమ-నిరాసార్థమితి పరిహరతి --

శ్లో॥ ఉపాధివ్యాధిసంయోగాదేకస్యైవ ద్విరూపతా ।
బ్రహ్మణో దేవదత్తాదేరివ భేదో న వస్తుతః॥ 67

వ్యాఖ్యా:- ఉపాధీతి। సత్త్వాదిగుణలక్షణోపాధిసమ్బన్ధేనైకస్యైవ బ్రహ్మణో ద్విరూపతా పరమాత్మత్వజీవాత్మత్వరూపేణ ద్వైరూప్యం భాసతే। యథా వ్యాధిసంయోగ-వియోగాభ్యాం "రోగీ దేవదత్తః, నీరోగీ దేవదత్తః" ఇతి। అథవా అవస్థోపాధినైకైవ వ్యక్తిః బాలకౌమారయువవృద్ధాదివచసా నానా వ్యాహ్రియతే తద్వద్బ్రహ్మాపీత్యర్థః। వస్తుతశ్చైతన్యస్యావిశేషాద్ భేదో నాస్తి। ప్రతీయమానగుణదోషత్వనిరాకరణపరాణ్యేవ శాస్త్రాణి ఇతి భావః॥

అవతారిక:- జీవాత్మకు పరమాత్మకు గూడ బ్రహ్మస్వరూపముండుట వలన స్వస్వరూప -సంపత్తి చెదరనిదే కదా, కర్మ నిశ్శేషమగుటను గూర్చి ఇంత కోలాహలము చేయు టెందులకు? అని విచారించి, ఉపాధితో కూడియున్నందువలన నేర్పడిన రెండు రూపముల భ్రమను తొలిగించుట కొరకే యని పరిహారమును చెప్పుచున్నాడు.

ప్రతిపదార్థము:- బ్రహ్మణః=బ్రహ్మమ్, దేవదత్త+ఆదేః+ఇవ=దేవదత్తుడు మొదలగు వారియందు వలె, భేదః=భేదము, ఉపాధి=శరీరము అను, వ్యాధిసంయోగాత్=వ్యాధితో కూడినందువలన, ఏకస్య+ఏవ=ఒక్కనిదే, న వస్తుతః=వస్తుభేదమువలన కాదు, ద్విరూపతా=రెండు రూపముల ఉనికి.

వివరణము:- మూడు గుణములు లక్షణముగాగల శరీర సంబంధముచేతనే బ్రహ్మము పరమాత్మ-జీవాత్మ రూపములలో రెండు రూపములలో ప్రకాశించుట. దేవదత్తు డొకడే యైనను రోగము సోకినందువలన రోగి దేవదత్తుడై, రోగము తొలిగినందువలన నీరోగి దేవదత్తుడై, ఇట్లు ఇద్దరు దేవదత్తులున్నట్లు కన్పించుచున్న రీతిగాను లేక, బాల్యము, కౌమారము, యౌవనము, వార్ధక్యము అను అవస్థాభేదమున ఒకే వ్యక్తి బాలుడుగాను, కుమారుడుగాను, యువకుడుగాను, వృద్ధుడుగాను వివిధముగా వ్యవహరించబడుచున్నట్లు, ఒకే బ్రహ్మములో వస్తువునుబట్టి చైతన్యభేదము లేనందున, కన్పించుచున్న గుణదోషభేదమువలని భిన్నత్వమును శాస్త్రములు నిరాకరించుచున్నవి.

అవతారికా:- ననూపాధిపదార్థస్య సత్త్వాదిగుణస్య సంసర్గః సచ్చిదానన్దరూపస్య బ్రహ్మణః కథం వైగుణ్యకర ఇత్యాశఙ్క్య, నిరతిశయానన్దసంవలితస్య అత్మనో గుణ-సమ్బన్ధోపస్థితసాతిశయానన్దయోగో న గుణావహ ఇత్యాశయేనాహ।

*శ్లో॥ న గుణో గుణసమ్బన్ధో నిర్గుణస్య పరాత్మనః।*
*గుణినో గుణసమ్బన్ధో గుణకృచ్చాపరాత్మనః॥* 68

వ్యాఖ్యా:-నేతి। నిర్గుణస్య గుణాధ్యాసరహితస్య పరమాత్మనః గుణసమ్బన్ధః సత్త్వాదిగుణా-వయవకమాయాసమ్బన్ధః న గుణో గుణకృత్ న భవతి। సచ్చిదానన్దావరకత్వాత్। గుణినః గుణేషు ప్రతిబిమ్బితస్యాపరాత్మనః జీవస్య గుణసమ్బన్ధః ఫలానుసన్ధానరహిత-కర్మానుష్ఠాన-సత్సఙ్గ-విరక్తి-వివేకాది-లక్షణగుణసమ్బన్ధః గుణకృత్। సచ్చిదానన్దాత్మక-స్వరూపస్ఫూర్తికర ఏవేత్యర్థః। చకార ఏవార్థే। ఏతేన జీవాత్మనోన్తఃకరణశుద్ధి-సత్సఙ్గ-వైరాగ్య-సదసద్వివేకోపరతయః సాక్షాత్ పరమ్పరయా వా కర్మనిర్వాహకత్వేన ఇష్టసాధనా-నీతి సిద్ధమ్। ఏకమేవ వస్తు అవస్థాభేదేన క్రియాభేదేన జాతిభేదేన వా గుణావహోఽ-గుణావహశ్చ భవతీతి భావః॥

అవతారిక:- ఉపాధియొక్క సత్త్వము మొదలైన గుణముయొక్క చేరిక సచ్చిదానంద-రూపుడైన బ్రహ్మమునకు ఎట్లు గుణరాహిత్యకరమని చింతించి, నిరతిశయానందముచే ఆవరించబడిన ఆత్మకు గుణసంబంధమువలన వచ్చిచేరిన అతిశయించిన అనంద-యోగము గుణముచే ఆవహించబడినది కాదు అను భావమున చెప్పుచున్నాడు.

ప్రతిపదార్థము:- నిర్గుణస్య=గుణమొకటియును లేని, పర+ఆత్మనః=పరమాత్మకు, న గుణః=గుణములేదు, (న) గుణసమ్బన్ధః=గుణముతో సంబంధము లేదు, గుణినః=గుణమును కలిగియున్న, గుణకృత్=గుణమును కలిగించు, అపరాత్మనః చ=అపరాత్మకే, గుణసమ్బన్ధః=గుణముతో సంబంధము.

వివరణము:- నిర్గుణుడైన పరమాత్మకు గుణములు అవయవములుగ గల మాయతో సంబంధము గుణము కాదు, గుణముచే యేర్పడినది కాదు. గుణియొక్క గుణము-లలో, ప్రతిఫలించినట్లు పరమాత్మకు జీవాత్మయొక్క గుణసంబంధము ఫలాపేక్షలేని కర్మాచరణ-సత్సంగ-విరక్తి-వివేకాది లక్షణములుగల గుణసంబంధము గుణములచే చేయబడినది. ఒకే వస్తువు అవస్థాభేదముతో, క్రియాభేదముతో, జాతిభేదముతో గుణావహమో అగుణావహమో అగుచున్నదని భావము.

అవతారికా:- ప్రకరణార్థముపసంహరతి ఇతః పరం శ్లోకద్వయేన --

శ్లో॥ శ్రద్ధయా కర్మణోఽసఙ్గాత్ కృతస్య ఫలసమ్పదః।
భవన్తి కృతినః శుద్ధ్యా శాన్తిశైథిల్యసంవిదః॥ 69

వ్యాఖ్యా:- శ్రద్ధయేతి । ఫలసమ్పదః ఫలానాం సమ్పదుదయః యస్మాత్తస్య, శ్రద్ధయా కృతస్య కర్మణః అసఙ్గాత్ ఫలానుసన్ధానరాహిత్యాత్ కృతినః కుశలస్య యోగాపర-పర్యాయకర్మకౌశలం జానతః పురుషస్య శుద్ధ్యా చిత్తశుద్ధి ద్వారా శాన్తిశైథిల్యసమ్పదః భవన్తి। శాన్తిః సఞ్చితసఞ్చీయమానయోః కర్మణోరుపశమః కార్త్స్న్యేన శైథిల్యం, ప్రారబ్ధస్య కర్మణో భోగే హర్షశోకహేతుక-ఇష్టానిష్టలాభే తద్ వృత్తేః సామ్యేన భానమనుత్కర్షో వా। సంవిత్ పరోక్షాపరోక్షావభాసకం జ్ఞానం। కృతినా ఇత్యనేనేష్ట-సాధనతాజ్ఞానహీనస్య శాన్త్యాదయ ఉపతిష్ఠన్తే ఇత్యుక్తమ్। శాన్త్యాదీనాం ప్రాయః శుద్ధ్యధీనత్వాత్।శ్రద్ధయేత్యనేన అశ్రద్ధయా కృతేన కర్మణా చిత్తశుద్ధ్యభావః సూచితః। ఫలసమ్పద ఇతి అనేన కర్మఫలానన్త్యముక్తమ్। అథవా ఫలసమ్పద ఇతి తాటస్థ్యే షష్ఠీ। కృతస్య కర్మణో యా ఫలసమ్పత్ తస్యా అసఙ్గాత్ అననుసన్ధానాత్ ఇతి సంవృతోఽర్థః।ప్రస్తుతార్థసఙ్గ్రహే సంవృతార్థస్య చ వివృతార్థస్య చ అభ్యర్థితత్వాత్॥

అవతారిక:- ఇక్కడి నుండి రెండు శ్లోకములలో ఈ చర్చాంశమును ముగించుచున్నాడు.

ప్రతిపదార్థము:- ఫలసంపద్+ఉదయః=ఫలముయొక్క, సంపద జనించుట, శ్రద్ధయా =భక్తితో, కృతస్య=చేయబడిన, కర్మణః=కర్మకు, అసఙ్గాత్=ఫలసంబంధము లేనందు వలన, కృతినః=కర్మకౌశలము నెఱిగిన వానికి, శుద్ధ్యా=చిత్తశుద్ధి కలుగుటవలన, శాన్తిశైథిల్యః=కర్మల ఉపశమనసంపద, సంవిదః=పరోక్షాపరోక్షజ్ఞానము, (ఇవి), భవన్తి=కలుగుచున్నవి.

వివరణము:- భక్తితో, ఫలాపేక్షలేకుండగ, చేయబడిన కర్మద్వారా చిత్తశుద్ధి కలిగి, సంచిత-సంచీయమాన కర్మలు శమించి, ప్రారబ్ధమును అనుభవించుటలో సంతోషము గాని శోకముగాని లేని సమస్థితి కలిగి, పరోక్షజ్ఞానము, అపరోక్షజ్ఞానము గూడ కలుగును. స్వస్వరూపజ్ఞానమును సాధించుటెట్లో తెలియనివానికి శాంతి మొదలగునవి చేరువలోనుండునని చెప్పబడినది. కారణము, బహుశః శాంత్యాదులు శుద్ధికి అధీనములైయుండుట. అశ్రద్ధతో చేసిన కర్మలకు చిత్తశుద్ధి లేకుండుట సూచింపబడినది.

శ్లో॥ సత్సఙ్గాత్ శుద్ధితో జ్ఞానాద్వైరాగ్యాదస్మృతేః స్మృతేః।
సద్వృత్త్యా త్రిపుటీనాశాద్ ఐక్యమాత్మపరాత్మనోః॥ 70

వ్యాఖ్యా:-సత్సఙ్గాదితి। సతామన్తఃకరణశుద్ధివైరాగ్యాదీనాం సఙ్గఃసమ్బన్ధో యత్ర, అర్థాద -సత్ఫలప్రసఙ్గో యత్ర నాస్తి తాదృశాత్కర్మణః శుద్ధిరన్తఃకరణస్య అజ్ఞానావృతత్వాభావః సమ్పద్యతే। అథవా సతాం స్వధర్మాణాం సఙ్గాత్ శ్రద్ధయా అనుష్ఠానాత్ శుద్ధిరుత్పద్యతే। అథవా స్వస్వధర్మోపాసనాచ్యుతిజన్యసకలాపరాధపాతకోచ్ఛేదక-స్వస్వశాఖీయ-వేద-భగవద్గీతాపాఠః సచ్ఛన్దార్థః, తస్య సఙ్గాత్ శ్రద్ధయాభ్యాసాత్ చిత్తశుద్ధిరుదేతి।

శుద్ధితోఽన్తఃకరణశుద్ధ్యా చ "బ్రహ్మాస్తీతి, తదేవ సత్యమిత్యాకారకం జ్ఞానం పరోక్షజ్ఞానముత్పద్యతే। జ్ఞానాదుక్తలక్షణాత్ సదసద్వివేకద్వారా వైరాగ్యమ్ అసదంశే విరక్తిరుత్పద్యతే। పదార్థలక్షణస్య పూర్వముక్తత్వాన్న జడత్వాపత్తిః। తాదృశవిరక్తేశ్చ అస్మృతిః కృతకర్తవ్యాసత్ఫలజనకకర్మణాముపరతిర్భవతి। యద్యపి బ్రహ్మాకారాకారిత-వృత్త్యుదయానన్తరం సదసద్వివేకాదీనామపి సత్ఫలత్వం న ఉపయుజ్యతే తథాపి పూర్వసోపానమారూఢస్యారుహ్యమాణోత్తరసోపానస్య సత్ఫలత్వ అనఙ్గీకారే ఇష్టావాప్తే-ర్దుర్లభత్వాదన్తఃకరణశుద్ధ్యాదీనాం కర్మసత్ఫలత్వం ప్రతిపాద్యతే శ్రుతిభిః, తదేవాచార్యై-రప్యఙ్గీక్రియతే। తస్యా అస్మృతేః సకాశాత్ స్మృతిః "బ్రహ్మైవ ధ్యాతవ్యం నేతరత్" ఇతి ధ్యానక్రియావలమ్బినీ ధారణా సమ్పద్యతే।

యద్యపి యోగశాస్త్రే ధ్యానధారణాలక్షణం వృత్తిద్వయముక్తం తథాపి ఆశ్రయ-ఆశ్రయిభావేన ఏకత్వే న విరోధః, స్మృతేః ధ్యానధారణాఖ్యచిత్తవృత్తేః సకాశాత్ సద్వృత్తిః। సద్బ్రహ్మ తదాకారాకారితాన్తఃకరణవృత్తిరుదయతే। తత్రైవ సవికల్ప సమాధేరన్తర్భావః। అష్టాఙ్గయోగేఽపి సవికల్పసమాధేః ఏవ సఙ్జ్ఞావిషయత్వాత్। నిర్వికల్పసమాధేరఙ్గత్వాఙ్గీకారే విశేష్యలోపాపత్తేః తస్యైవ శిరఃసోపానత్వాత్।

సద్వృత్త్యా చ త్రిపుట్యాః ధ్యాతృధ్యానధ్యేయ-ద్రష్టృదర్శనదృశ్య-శ్రోతృశ్రవణ-శ్రోతవ్యాదిలక్షణాయా నాశో వినష్టిః సమ్పద్యతే। అభావస్యాపి యథార్థత్వాఙ్గీకారాత్ క్రియాసంసర్గో న విరుధ్యతే। తాదృశత్రిపుటీనాశాత్ ధ్యానక్రియాదివ్యవధానహేతూ-పాధేః తదాకారవృత్త్యా నిర్వికల్పసమాధిలక్షణయా పరిమార్జనాత్ ఆత్మపరాత్మనో బిమ్బప్రతిబిమ్బరూపయోర్జీవాత్మపరమాత్మనోః ఏకత్వం సచ్చిదానన్దరూపేణ స్థితిః సిద్ధ్యతీతి శేషః। స్వరూపేణావస్థితేరేవ మోక్షపదార్థత్వాదఙ్గాఙ్గిభావవత్ జన్యజనక-

**భావస్యాపి పరమార్థత్వానఙ్గీకారాత్। శాస్త్రాణామపి త్రిపుటీవిషయకత్వాత్ త్రిపుటీ-త్రైగుణ్యశబ్దయోశ్చ సమానార్థత్వస్య ఆచార్యైః ప్రతిపాదితత్వాత్। తదితరస్యోపాధిత్వా-సమ్భవాత్ తదభావే జలాద్యభావే చేన్ద్వైక్యవత్ ఆదర్శాద్యభావే ముఖైక్యవత్ ఏకతా ఆత్మనోః స్వతః సిద్ధ్యతీతి భావః॥**

**ప్రతిపదార్థము:-** సత్సఙ్గాత్=సత్సంగమువలన, శుద్ధితః=చిత్తశుద్ధివలన, జ్ఞానాత్=జ్ఞానమువలన, వైరాగ్యాత్=వైరాగ్యమువలన, అస్మృతేః=అస్మృతివలన, స్మృతేః=స్మృతి వలన, సద్+వృత్త్యా=సద్వృత్తిచేత, త్రిపుటీనాశాద్=త్రిపుటి నశించినందువలన, ఆత్మపరాత్మనోః=ఆత్మపరమాత్మలయొక్క, ఐక్యం=ఏకత్వము.

**వివరణము:-** సత్సంగమనగా అసత్ఫల ప్రసంగములేని కర్మసంబంధము, లేక, స్వధర్మములను శ్రద్ధగా ఆచరించుట, లేక, స్వధర్మాచరణలోపమున కలిగిన అపరాధములను తొలగించగల, తన శాఖకు నియతమైన, వేదమును, భగవద్గీతా-పాఠమును శ్రద్ధగా అభ్యసించుట. వీనివలన చిత్తశుద్ధి కలుగును. ఈ అన్తఃకరణ-శుద్ధి మూలమున బ్రహ్మమున్నది, బ్రహ్మమే సత్యము అను పరోక్షజ్ఞానము కలుగును. ఈ జ్ఞానమువలన సదసద్వివేకము కలిగి, వైరాగ్యమున్ను అసద్విషయమున విరక్తి కలుగును. ఈ విరక్తి నుండి అస్మృతి, అనగా చేయబడిన - చేయదగిన అసత్ఫలప్రద-కర్మలలో ఉపరతి (అనగా బాహ్య విషయములచే కలవరపాటు చెందని స్థితి) కలుగును. ఒకవేళ బ్రహ్మజ్ఞానానంతరము సదసద్వివేకములకు గూడ సత్ఫలత్వము కలుగకున్నను, మొదటి మెట్టు నెక్కినవానికి ఆపై మెట్టు నెక్కిన ఫలము రాదను తర్కముచేత ఇష్టావాప్తి దుర్లభమగుటవలన, చిత్తశుద్ధి మొదలగువానికి కర్మ-సత్ఫలత్వమును వేదములు ప్రతిపాదించుచున్నవి. ఆచార్యులు కూడ దానినే అంగీకరించినారు. వానికి అస్మృతి నుండి స్మృతి "బ్రహ్మమే ధ్యానించదగినది, అన్యము కాదు"అను ధ్యానక్రియాశ్రయియైన భావము కలుగుచున్నది. ఈ ధ్యానధారణ-వృత్తి నుండి సద్వృత్తి కలుగును. అందులో సవికల్పసమాధి అంతర్భవించును. ఈ సద్వృత్తి నుండి ధ్యాత-ధ్యానము-ధ్యేయము అను త్రిపుటి, లేక ద్రష్ట-దృశ్యము-దర్శనము అను త్రిపుటి, శ్రోత-శ్రోతవ్యము-శ్రవణము అను త్రిపుటి నశించును. ఈ త్రిపుటీనాశము నుండి జీవాత్మ-పరమాత్మల ఐక్యము సంభవము.

అవతారికా:- మహదనుగ్రహసమ్పన్నస్య నిబన్ధస్య మహదేవ ఫలమితి స్వోక్తం స్వశిష్యోక్తం వా ప్రకరణార్థానుసన్ధానఫలమ్ ఆహ --

శ్లో॥ ఆచార్యానుగ్రహాదేవ సూక్తా విజ్ఞానదీపికా।
సిద్ధపద్మపాదాచార్యైర్ధృత్యాస్యా ముచ్యతే కృతేః॥ 71

వ్యాఖ్యా:- ఆచార్యానుగ్రహాదితి । ఆచార్యాణాం శఙ్కరాదీనామనుగ్రహాత్ కృపా-కటాక్షాదేవ సిద్ధైర్నిరస్తదేహాధ్యాసైః పద్మపాదాచార్యైః విజ్ఞానదీపికా ఫలానుసన్ధానరహిత-కర్మానుష్ఠానద్వారా సాక్షాత్ క్రమేణ వా విజ్ఞానం జాయతే ఇతి తత్త్వజ్ఞానప్రకాశికా సూక్తా సంక్షేపేణోక్తా। అస్యా విజ్ఞానదీపికాయా ధృత్యా అర్థానుసన్ధానపూర్వకధారణేన కృతేః త్రివిధాదపి కర్మణో ముచ్యతే। యోఽర్థానుసన్ధానకర్తా స ముక్తో భవతీత్యర్థః।

కాలకర్మగుణాధీనః స్వభావనిబద్ధో జన్తుః ఫలశ్రుతిమన్తరేణ ప్రాయః సత్కర్మణి న ప్రవర్తతే ఇతి సన్మార్గప్రవర్తకా ఆచార్యాః శబ్దార్థానుసన్ధానఫలం స్వముఖేన స్వశిష్య-ద్వారా వా స్వనిబన్ధనాన్తే సమారోపయన్తీతి భావః॥

ఇతి శ్రీమచ్ఛఙ్కరభగవత్పాదాచార్యప్రియశిష్యయతీశ్వర-
పద్మపాదాచార్యేణ విరచితా విజ్ఞానదీపికా తేనైవ కృతా వివృతివ్యాఖ్యా చ
సమ్పూర్ణా॥ శుభం భూయాత్ ॥

అవతారిక:- గొప్ప అనుగ్రహముతో కూడిన గ్రంథమునకు ఫలము గూడ గొప్పనే యగునని నాచే లేక నా శిష్యులచే ప్రవచింపబడిన ఈ విషయమునకు అర్థముతో అనుసంధింపబడిన ఫలము నిట్లు చెప్పెను --

ప్రతిపదార్థము:- ఆచార్య=ఆచార్యులయొక్క, అనుగ్రహాత్+ఏవ=కృపవలననే, సిద్ధ=సిద్ధిని పొందినట్టి, పద్మపాద+ఆచార్యైః=పద్మపాదులను పేరుగల ఆచార్యులచేత, విజ్ఞానదీపికా=విజ్ఞానదీపిక యను గ్రంథము, సు+ఉక్తా=బాగుగ చెప్పబడినది, అస్యా=దీనియొక్క, ధృత్యా=ధారణముచే, కృతేః=కర్మలనుండి, ముచ్యతే=విడువబడుచున్నాడు.

వివరణము:- శ్రీపద్మపాదులు శ్రీ శంకరభగవత్పాదుల శిష్యులు కనుక ఆచార్యులనగా నిచట శంకరులే. వీరి కృపావిశేషమున పద్మపాదులకు తమ దేహము ఆత్మయే యను భావము నశించినది. వీరు రచించినది ఈ విజ్ఞానదీపిక. ఇందు ఫలాపేక్షలేని కర్మనాచరించుటద్వారా క్రమముగానైనను తత్క్షణమేయైనను విజ్ఞానము కలుగునను తత్త్వజ్ఞానప్రకాశికోక్తవిషయము సంగ్రహముగా చెప్పబడినది. ఈ గ్రంథమును

అర్థమును సమన్వయము జేసికొనుచు ధారణ చేయుటచేత సంచితసంచీయమాన-ప్రారబ్ధములను మూడు విధములైన కర్మల నుండి ముక్తుడగుచున్నాడు.

కాలమునకు కర్మకు గుణమునకు వశులైన నరులు బహుశః సత్కర్మలలో ప్రవర్తించకుందురని భావించిన సన్మార్గబోధకులైన ఆచార్యులు శబ్దమును దాని అర్థముతో కలిపి చదివినందువలన సత్ఫలము కలుగునని స్వయముగగాని, తమ శిష్యుల ద్వారా గాని తమ గ్రంథముల చివర ఫలశ్రుతిని చేర్చుచున్నారు.

ఇది శ్రీశంకరభగవత్పాదశిష్యుడైన
శ్రీపద్మపాదాచార్యులచే రచింపబడి వ్యాఖ్యానించబడిన
వివృతివ్యాఖ్యానసహితమైన విజ్ఞానదీపికా గ్రంథమునకు తెలుగుసేత.

-----



శ్రీః

# పద్యానుక్రమణికా

- - - -

శ్రీః

130

శ్రీశ్రీశ్రీ

**స్వామి అరుళానందసరస్వతివారి**

సంపాదకత్వములో వెలువడుతున్న

"ఆత్మజ్యోతి" లో ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యవివరణములతో

ధారావాహికగా వెలువడుతున్న **"విజ్ఞానదీపికా"**

ది.15-06-2009 న పుస్తకరూపముగా వెలువడుటకు

ఆర్థిక సహాయము అందించినవారు

కీ॥శే॥ నడిపినేని కొండయ్య, భార్య మహాలక్ష్మమ్మ గార్ల స్మృత్యర్థం

వారి కనిష్ఠ పుత్రుడు

డా॥ సూర్యనారాయణ, ప్రిన్సిపల్ (రిటైర్డ్), కందుకూరు.

ఇయ్యది

**శ్రీ వ్యాసాదిగురుపరంపరకు**

భక్తితో సమర్పితము.

